# శ్రీ సింహాద్రి నారసింహ శతకము

## గోగులపాటి కూర్మనాథకవి

**(క్రీ.శ. 1720-1790)**

**(తెలుగు తాత్పర్య సహితము)**

*తాత్పర్య రచన*

**శ్రీ బులుసు వేంకటేశ్వర్లు**

*సంపాదకులు, ప్రకాశకులు*

**ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

**వ్యవస్థాపక అధ్యక్షులు**

**శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య ('శ్రీరస')**

**బెంగుళూరు**

**2019**

**SRI SIMHADRI NARASIMHA SATAKAMU - Gogulapati Kurmanatha Kavi (1720-1790)**; Telugu Commentary by **Sri Bulusu Venkateswarlu**; edited and published by **Prof. T.V. Subba Rao**, Sri Krishnadevaraya Rasajna Samakhya (**‘Srirasa’**), Bengaluru, 2019.

**No. of Pages: xl + 152**

**First Edition : 2019**

**No. of Copies : 1000**

**Price: Rs.200/-**



ముఖచిత్రము : స్వామివారి నిత్యరూపము

**For Copies:**
**Prof. T.V. Subbarao**
#1708, *“Siitaavadhaanam”*
11th Cross; 1st “G” Main
Kengeri Satellite Town
BENGALURU – 560 060
Mobile: 99454 22742

**DTP:**
**Nagasri Graphics**
H.No.1-18, Plot No.17
Brindavana Colony, Near Agnimaremma Temple
Gundlasagaram - 517 425, Gudupalli Mandal;
Chittoor District, Andhra Pradesh

*Printing :*
**Omkar Offset Printers**
Bengaluru - 560 002
Phone: 080-2670 8186; 2670 9026

# అంకితం

మహాదాత శ్రీపోచా బ్రహ్మానందరెడ్డిగారికి -
ప్రసిద్ధ వ్యవసాయశాస్త్రవేత్త ప్రొ॥ కాదరబాద్ రవీంద్రనాథ్ గారికి-
"రేనాటి సూర్యచంద్రుల స్మారక సమితి" కార్యవర్గమునకు -
"శ్రీరస" కార్యవర్గమునకు, దాతలకు, వక్తలకు, శ్రోతలకు -
"శ్రీరస" ట్రస్టు సభ్యులకు
మహారాజ పోషకులకు, రాజపోషకులకు, పోషకులకు -
ముఖ్యంగా దాతలలో "దానరాధేయ" శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠిగారికి -
వక్తలలో "మధురభారతి" శ్రీమల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారికి -
ఉభయభాషాకవయిత్రి శ్రీమతి అంబికా అనంతగారికి -
మా అన్నదమ్ములకు - మా చిరంజీవులకు -
మా మనుమలకు - మనుమరాండ్రకు -
మా మఱదండ్రకు - తోడల్లునకు -
బ్రిగేడియర్ డా. గిడుగు (తంగిరాల) హిమశ్రీకి -
ప్రొ॥ ఈడిగ సత్యనారాయణగారికి -
నాకు నచ్చిన, సాహిత్యలోకం మెచ్చిన, పండితప్రకాండత్రయం:
ప్రొ॥ శలాక - ప్రొ॥ రవ్వా - ప్రొ॥ బేతవోలు గారలకు -
తాత్పర్యకర్త "మధురకవి" శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారికి-
తమ కావ్యాలను నాకు అంకితమిచ్చిన కవిశేఖరులకు -
ప్రాణమిత్రులకు - ప్రత్యేకంగా ప్రొ॥ ఎల్.బి. శంకరరావు -
శ్రీ ఎం. వేణుగోపాలయ్య - శ్రీ ఎం. రామచంద్రప్రసాద్ -
ప్రొ॥ యస్. అక్కిరెడ్డి - ప్రొ॥ ఆర్వీయస్. సుందరంలకు -
ప్రియతమ శిష్యులకు - ప్రధానంగా ప్రొ॥ జి.యస్. మోహన్‌కి-
చి॥ తోట వెంకటస్వామికి - డా॥ వి.వి.భానుమూర్తిగారికి
మా అన్నయ్యగారి "ఏఱిన ముత్యాలు" గ్రంథాన్ని పునర్ముద్రించి
అందరికీ ఉచితంగా పంచిన ఉదారహృదయులు
కవితారసజ్ఞులు శ్రీ పాడేటి జాన్సన్‌గారికి -
"అమ్మకడుపు చల్లగా..." అనే తన ఆత్మకథతో నన్ను ఉఱ్ఱూతలూగించిన

## అంకితం

శ్రీ గొల్లపూడి మారుతిరావుగారికి –
విశాఖనగర నివాసిని, విదుషీమణి, ఉపన్యాసద్యుమణి
ఆచార్య కోలవెన్ను మలయవాసినిగారికి –
మా తఙుకులో 1931లో స్థాపింపబడిన సాహిత్యసంస్థ "శ్రీ నన్నయభట్టారక పీఠము"ను 1990 నుండి నేటివరకు దీక్షాదక్షలతో నిర్వహిస్తున్న అధ్యక్షులు డా॥ జి.యస్.వి. ప్రసాదుగారికి, 1983 నుండి ఈనాటివరకూ క్రాంతదర్శిగా సేవలందిస్తున్న అనర్ఘ కార్యదర్శి శ్రీ యామిజాల సుబ్రహ్మణ్యశర్మ ('సుశర్మ') గారికి –
1999 నుండి ఈనాటివరకు "ప్రకాశంజిల్లా రచయితలసంఘం" అధ్యక్షులుగా "మన తెలుగుతల్లిని మల్లెపూదండలతోను, మంగళారతులతోను" పూజిస్తున్న నిత్యసాహిత్యార్చకులు, న్యాయకోవిదులు, కవి, రచయిత, స్వచ్ఛమనస్కులు, సౌజన్యధన్యులు, శ్రీ బి. హనుమారెడ్డిగారికి –
బెంగుళూరులో 1952లో తెన్నేటి విశ్వనాథంగారిచే స్థాపించబడి, తెలుగు భాషా సాహిత్య కళాసాంస్కృతిక రంగాలకు అపూర్వమైన సేవలందిస్తున్న అతిప్రాచీనసంస్థ "తెలుగు విజ్ఞాన సమితి"కి వర్తమాన అధ్యక్షులు, కార్యదీక్షా దక్షులు, ప్రియమిత్రులు డా॥ ఎ. రాధాకృష్ణరాజుగారికి, ఉపాధ్యక్షులు శ్రీ కె. గంగరాజుగారికి, పూర్వకార్యదర్శి శ్రీ ఎ.కె. జయచంద్రారెడ్డిగారికి, ప్రస్తుత కార్యదర్శి శ్రీ ఇడమకంటి లక్ష్మిరెడ్డిగారికి –
"ఆంధ్ర సారస్వత విజ్ఞాన సంఘం" (1948–శ్రీ ఎస్.కె. నారాయణగారు, శ్రీ ఎన్. శ్రీ కంఠరావుగారు)–"తెలుగు సాహిత్య సమితి"(HAL,1990, శ్రీ తోట వీర్రాజుగారు) – ఇంకా– "తెలుగు సాంస్కృతిక సమితి" (IISc)– "తెలుగు మిత్రులు" (ITI) – "ఆంధ్ర మహాసభ" (BEL)–"తెలుగు వెలుగు" (LIC)–"సి.పి.బ్రౌన్ సేవాసమితి" (2011, శ్రీ ఇడమకంటి లక్ష్మిరెడ్డిగారు, శ్రీ నిమ్మగడ్డ చంద్రశేఖర్‌గారు) – మొదలైన బెంగుళూరులో ఉన్న అన్ని తెలుగు సాహిత్యసంఘాల కార్యవర్గసభ్యులకు –
పైన పేర్కొన్నవారి కుటుంబసభ్యులందరికీ –
పవిత్ర సింహాచలక్షేత్రంలో వేంచేసియున్న
**శ్రీ వరాహ లక్ష్మీ నరసింహస్వామివారు**
ఆయురారోగ్య సంపత్పరంపరాభివృద్ధిని ప్రసాదించి
ఎల్లవేళలా కాపాడుచుండుగాక!

**– తంగిరాల వెంకట సుబ్బారావు**

# కవితాశీస్సులు

## శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డిగారి ప్రశంస

### రచన: కీ.శే. దేవులపల్లి చెంచుసుబ్బయ్యగారు

(ఈ శతక ముద్రణకు ఉదారహృదయంతో రూ. 50,000/– లు విరాళమిచ్చిన వారు శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డిగారు. వీరు 'ఉయ్యాలవాడ'లో 2009లో "రేనాటి సూర్యచంద్రుల స్మారక సమితి"ని స్థాపించి, దానికి అధ్యక్షులుగా కొనసాగుతున్నారు. నంద్యాలలో "భారతి సీడ్స్" అను విత్తనసంస్థద్వారా రైతులకు అపారమైన సేవలు అందిస్తున్నారు. 'మధురకవి' దేవులపల్లి చెంచుసుబ్బయ్యగారు 2013లో రచించిన "రేనాటి వీరభారతం" అనే పద్యకావ్యాన్ని అంకితం పొందిన శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు దానిని ముద్రించి వెలుగులోకి తెచ్చారు. ఆ కావ్యం నుండి ఈ క్రింది పద్యములు గ్రహింపబడినవి – సంపాదకుడు: తంగిరాల)

**సీ.** **శ్రీ వేంకటేశ్వర శ్రీకరపాదాబ్జ, చింతనానంద సచ్చిత్తుఁడతఁడు**
**శ్రీశైలమందిర శ్రీమల్లికార్జున, పాదాబ్జ సేవక భక్తుఁడతఁడు**
**సౌజన్య పూర్ణుండు సౌభాగ్యవంతుండు, కారుణ్యనిలయుండు ఘనుఁడతండు**
**"పోచా" కులాంభోధి పూర్ణశశాంకుండు, వేదాంత విజ్ఞాన విలసితుండు**

**గీ.** **శ్రీ విరాజిత మోటాటి రెడ్డివరుఁడు**
**వాసిఁగాంచిన ఉయ్యాలవాడవాసి**
**కర్షకోత్తముఁడాతఁడు ఘనయశుండు**
**ఆత్మతత్త్వంబెఱింగిన యమృతమూర్తి**
**శ్రితజనసురభి "వేంకటరెడ్డి"వరుఁడు.** **1**

**గీ.** **అమ్మహాత్ముని యర్ధాంగి యమలచరిత**
**సద్గుణోపేత సాధ్వి సౌజన్యభరిత**
**అమలగుణపూర్ణ యతిథుల కన్నపూర్ణ**
**ఈశుపదముల మదినమ్ము "నీశ్వరమ్మ".** **2**

గీ. అమ్మహాత్ముల పూర్వపుణ్యముల పంట
సుగుణ విభ్రాజి సాంద్రయశోవిరాజి
సదమలకుల నందన హరిచందనంబు
ప్రియసుతుండు "బ్రహ్మానందరెడ్డి" వరుఁడు. 3

సీ. "పోచా"కుల సుధాబ్ధి పూర్ణశశాంకుఁడై, ప్రభవించినాఁడు సౌభాగ్యమూర్తి
వ్యవసాయశాస్త్రంబు నాపోసనముఁబట్టి, యందరి మన్ననల్ పొందినాఁడు
"భారతీ సీడ్స"ను భవ్యమౌ సంస్థను, స్థాపించినాఁడు ప్రశస్తిఁగూర్పఁ
బ్రముఖమౌ శ్రీశైల పబ్లికు స్కూలునుఁ, బురమున నెలకొల్పి పొలుపుఁ గాంచె

గీ. పొసఁగ సత్కళా సాహిత్య పోషణంబు
సలుపు చౌదార్యధుర్యుఁడై చెలువు మీఱ
ఔర! నంద్యాల పురమునఁ బేరుఁగాంచె
శ్రీవిరాజి బ్రహ్మానందరెడ్డివరుఁడు. 4

గీ. రైతుబాంధవుఁడనగ విఖ్యాతిఁగాంచె
బాలవిద్యాభివృద్ధికై పాటుపడియె
మధుర హృదయుఁడు, సౌజన్య మాన్యఁవరుఁడు,
శ్రీయుతుండు బ్రహ్మానందరెడ్డివరుడు 5

చం. కలియుగ దానకర్ణుడయి ఖ్యాతినిఁగాంచిన వేంగళాఖ్య స
న్నిలయము నందుఁబుట్టె సతి నిర్మలచిత్తకు వేంకటమ్మకున్
నెలవగు "పోచ" వంశమున నిశ్చల భావుఁడు పుట్టినాఁడు, వా
రల సుగుణంబులన్నియు విరాజిలుగా మన రెడ్డియందునన్. 6

సీ. విద్యానవద్యుఁడై విద్యాభివృద్ధికిఁ, బాఠశాలను నిల్పెఁ బట్టణమున
సద్బీజములఁగూర్చి సహకార మందించి, వ్యవసాయదారుల బంధువయ్యె
పరిశోధనము సల్పి బహుఫలంబుల నెర్గి, యధికదిగుబడుల నరయఁ గూర్చెఁ
బాత్రోచితంబుగా బహుదానముల సల్పి, పురి మహాదాతగాఁ బొలుపుఁ గాంచె

గీ. బహువిధోన్నత సద్భావబంధురుండు
ధీరశాంత స్వభావుం డుదారగుణుఁడు

ప్రముఖుఁడు పరోపకారపరాయణుండు
శ్రీవిరాజి బ్రహ్మానందరెడ్డివరుఁడు. 7

కం. "రేనాటి సూర్యచంద్రుల"
నేనాటికి మరువకుండ నీనాటికినిన్
దానొక స్మారక సమితిని
మానుగ నెలకొల్పినాడు మాన్యుండగుచున్. 8

ఉ. లేదను మాటరాదు గద! లేనిదియైనను దెచ్చియిచ్చుఁ దా
గాదన దేమి యడ్గినను గల్పమహీరుహమౌను నర్థులౌఁ
బేదల సాదలన్ గనును వేదనఁ బాపును ప్రేమమూర్తియై
మోదముఁగూర్చు నెల్లరకు ముందుగ సార్థకనామధేయుఁడై 9

కం. హితముగ మితముగఁ బ్రియముగ
జతురతతోఁబల్కు నతడు సజ్జనహితుఁడై
వితరణశీలుండాతఁడు
సతతము వ్రతముగ సలుపును సత్కార్యంబుల్. 10

చ. పలుదేశంబుల కేఁగినాఁడు, పలుభాషల్ నేర్చి భాషించుగా
విలువల్ బెంచును సత్యమూర్తియగుచున్ విజ్ఞానపూర్ణుండునై
సలుపున్ నిత్యము సత్ప్రజాహిత మహాసౌభాగ్య సత్కార్యముల్
ఫలముల్ గోరని కర్మయోగి యితఁడే భాగ్యంబులున్ గల్గెడున్. 11

కం. తెలియదు "లా"కేత్వము, మఱి
తెలియదుగద "ద"కునుఁగొమ్ము ధీమంతునకున్!
దెలియును మిగిలిన వన్నియు
నిల బ్రహ్మానందరెడ్డి కెల్లరుఁ బొగడన్. 12

మ. ప్రతివర్షంబును సత్సభన్ జరుపు సౌభ్రాతృత్వ మొప్పారఁగా
హితులన్ బాత్రుల ఛాత్రులన్ బ్రజలనున్ హేరాళమౌ రీతిగా
నతిమోదంబునఁ బిల్వఁబంచి యిట బ్రహ్మానందరెడ్డీంద్రుఁడు
న్నత భావంబున సంస్మరించు మదిలో నానందసంధాతలన్. 13

మ. కవితానంద వినోద లాలసుఁడు, సత్కల్యాణ శీలుండు, శ్రీ
ధవ పాదాంబుజ షట్పదంబు, వర విద్యావంతుఁ డౌదార్య స
న్నవ భావాన్విత భవ్యమానసుఁడు, నానాగ్రంథ విజ్ఞానియున్,
వ్యవసాయజ్ఞుఁడు, కీర్తిఁగాంచె భువి బ్రహ్మానందరెడ్డీంద్రుఁడున్. 14

గీ. ఆశ్రయంబెందు లేని విద్యావిరాజి
తాంధ్ర సుకవి శుకపికాళి కాశ్రయంబు
నిచ్చి కల్పతరువుగఁ బోషించు నెపుడు
శ్రిత కవిజన మందార మీ రెడ్డివరుఁడు. 15

కం. ఉయ్యాలవాడ కీ ధర
కయ్యా! గుర్తింపుఁ దెచ్చి యందఱితోడన్
నెయ్యంబున మెలగెదవుగ
వెయ్యేండ్లిల వెలుగుమింక విజ్ఞతతోడన్. 16

మ. సరసోదాత్త గుణాకరున్, బుధవరున్, సౌజన్య సంశోభితున్,
వర కర్తవ్యపరాయణున్, మధుర సౌభ్రాతృత్వ సద్భావు, స
చ్చరితున్, నిత్య పరోపకారగుణు, భాషాభిజ్ఞు, ధీరోత్తమున్,
హరి శ్రీరాముఁడు బ్రోచు నెప్పుడును బ్రహ్మానందరెడ్డీంద్రునిన్. 17

కం. జయమగు బ్రహ్మానందా!
జయమగు శుభమగు సతతము సద్ఘనకీర్తీ!
జయమగు శ్రీహరి బ్రోచును
జయము జయంబగును నీకు జనహిత! రెడ్డీ! 18



# చంపకమాల

# "శ్రీరస"

# శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య

**(స్థాపన: 11-04-1994 భావనామసంవత్సర ఉగాది)**

## కార్యవర్గం

| | |
|---|---|
| వ్యవస్థాపక అధ్యక్షులు | : ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు |
| వ్యవస్థాపక కార్యదర్శులు | : డా. దివాకర్ల రాజేశ్వరిగారు<br>శ్రీమతి అంబికా అనంత్‌గారు |
| ఉపాధ్యక్షులు | : ప్రొ॥ తంబిశెట్టి రామకృష్ణకవిగారు<br>శ్రీ పి. కృష్ణంరాజుగారు |
| ప్రధాన కార్యదర్శి | : శ్రీ పి.వి. రాధాకృష్ణగారు |
| మహిళా కార్యదర్శులు | : శ్రీమతి మారుతి శ్రీలతగారు<br>డా॥ టి.ఆర్. మీనలోచనగారు |
| కోశాధికారి | : శ్రీనారపరాజు సుబ్బారావుగారు |


**ప్రత్యేక కృతజ్ఞతలు**

ఈ గ్రంథం అనుబంధం-2లో "శ్రీలక్ష్మీనృసింహస్వామివారి అష్టోత్తర శతనామస్తోత్రం" - "సహస్రనామస్తోత్రం" శ్లోకాలు ముద్రించాను. ఇవి ప్రసిద్ధ ప్రాచీనగ్రంథ ప్రచురణసంస్థయైన "వావిళ్ళ రామస్వామి శాస్త్రులు & సన్స్" వారి "బృహత్ స్తోత్ర రత్నాకరః" (సంపుటి-2) నుండి గ్రహింపబడినవి. వావిళ్ళ వంశస్థులు దీనిని 2017వ సంవత్సరంలో పునర్ముద్రించారు. సంస్కృతాంధ్ర సాహిత్యాలకు కీ.శే. వావిళ్ళ రామస్వామి శాస్త్రులుగారు (1826-1891), వారి పుత్రులు కీ.శే. వావిళ్ళ వేంకటేశ్వరశాస్త్రిగారు (1884-1956) చేసిన సేవలు అమోఘమైనవి. ఆ ఉత్తమ ప్రచురణసంస్థకు నా కృతజ్ఞతాపూర్వక నమోవాకములు.

సంపాదకీయం

# చందన సౌరభం

**1**

**క. సతతము కావ్యజగత్తున
నితరములగు ప్రక్రియలవి యెన్ని కలిగినన్
శతకమె నిజమగు పచ్చల
పతకము పరికించి చూడ వాగ్దేవతకున్.**

**క. నీతులు, సాంఘిక జీవన
రీతులు, భువి మానవాళి హృదయపు లోతుల్,
ప్రీతిగ దేవుని దివ్య వి
భూతులు, శతకమ్ములందు ముచ్చట గొలుపున్.**

**క. నికషము కవిప్రతిభ కిదియె,
ముకురము లోకమ్ముతీరు ముందర నిలుపన్,
సకలములగు ప్రక్రియలకు
మకుటము శతకమ్ము కాదె మతి నూహింపన్!**

– "మధురభారతి" శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారు

"శతకం" అంటే నూరు పద్యాలతో కూడిన గ్రంథం. ఈ పద్యాలన్నింటినీ కలిపే అంతస్సూత్రమైన కథ ఏమీ ఉండదు. ఏ పద్యానికాపద్యమే ఒక ముక్తకంగా ఉంటుంది. శతకమంటే నూరు పద్యాలనే అర్థం ఉన్నా, సాధారణంగా కవులు 108 పద్యాలు వ్రాస్తూ ఉంటారు. శతకాలు ఎక్కువగా భగవంతుని స్తుతించేవిగా ఉంటాయి. భక్తులు దేవుని అష్టోత్తరశతనామాలతో పూజిస్తారు కాబట్టి, కొందరు కవులు తమ శతకాలలో 108 పద్యసంఖ్యను పాటించారు.

**శతక సాహిత్యం:–**

శతకం అన్ని భాషలలో ఉన్నా, తెలుగు సాహిత్యంలో దీనికి ఒక ప్రత్యేకమైన స్థానం ఉంది. పూర్వం ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో పనిచేసిన ప్రొ॥ కె. గోపాలకృష్ణారావుగారు, తెలుగులోని శతకాలనుగురించి లోతైన పరిశోధన చేసి,

1976లో "ఆంధ్ర శతకసాహిత్య వికాసము" అనే మంచి గ్రంథాన్ని ప్రచురించారు. వీరి కన్న చాలా ఏండ్లు ముందుగానే వంగూరి సుబ్బారావుగారు "శతక కవుల చరిత్ర"ను వెలువరించారు. వంగూరివారి కాలంనాటికి తెలుగుశతకాల సంఖ్య 500 దాటిపోయిందని చెప్పారు. తెలుగులో మొట్టమొదటి శతకమైన పాల్కురికి సోమనాథుని "వృషాధిప శతకం" నుండి (అంటే క్రీ.శ. 12వ శతాబ్దం నుండి) ఈనాటి వరకు శతకరచన సాగుతూనే ఉంది.

శతకంలో 100 కాని, 108 కాని పద్యాలుంటాయి. ఈ పద్యాలన్నీ ఒకే ఛందస్సులో వ్రాయబడతాయి. ప్రతిపద్యం చివర ఒక మకుటం విధిగా ఉంటుంది. ఇది ఎక్కువగా భగవంతుని సంబోధిస్తూ ఉంటుంది. అన్ని పద్యాలనూ కలిపే కథాసూత్రం ఉండదు కాబట్టి శతకాలలో రసపోషణకు, పాత్రపోషణకు అంతగా అవకాశం ఉండదు. (అయినా శృంగార శతకాలు, భక్తిశతకాలు, హాస్య శతకాలు కొన్ని లేకపోలేదు.) ఇవి ఆత్మాశ్రయ కవితలు. వీటిలో కవి తన అంతరాత్మను భగవంతుని ముందు ఆవిష్కరిస్తాడు. అతని ఇష్టదైవముయొక్క గుణగణాలను, మహిమలను వర్ణిస్తాడు. కొన్ని శతకాలలో కవులు తమ కాలంనాటి సాంఘిక పరిస్థితులను విశదీకరిస్తారు; దుర్మార్గాలను ఖండిస్తారు. మరికొందరు శతక కవులు నీతులను, ధర్మాలను, తాత్త్విక విషయాలను తెలియజేస్తారు. కాబట్టి తెలుగు శతకాలను – నీతిశతకాలు, భక్తిశతకాలు, వ్యాజస్తుతి శతకాలు, తాత్త్విక శతకాలు – అని నాలుగు విధాలుగా వర్గీకరిస్తారు విమర్శకులు. గోగులపాటి కూర్మనాథకవి రచించిన "శ్రీ సింహాద్రి నారసింహ శతకము" వ్యాజస్తుతి శతకాల వర్గంలోకి వస్తుంది. (కాని గోపాలకృష్ణారావుగారు దీనిని "చారిత్రక శతకములు" అనే వర్గంలో చేర్చారు).

భాషావిషయంలో శతకకవులు కొంత స్వాతంత్ర్యాన్ని తీసుకున్నారు. అయినా శతకపద్యాలు ధారాశుద్ధిసంశోభితాలు. సహజభావాలతో కూడి, చదువరులకు ఆనందంతోపాటు విజ్ఞానాన్ని వివేకాన్ని కూడా కలిగిస్తాయి. స్వచ్ఛమైన కవితాసంపద వీటిలో అధికం (–దివాకర్ల వేంకటావధానిగారు). పూర్వం బాలబాలికలచేత ప్రసిద్ధమైన శతకాలను కంఠస్థం చేయించేవారు. అందువల్ల వారికి తెలుగు భాషాపాటవం అభివృద్ధి అయ్యేది. సత్యము, ధర్మము, నీతినియమాలు వారి భావిజీవితంలో అలవడేవి. నా చిన్నతనంలో ప్రాథమిక పాఠశాలల్లో రెండవ

తరగతిలో "కృష్ణశతకం", మూడవ తరగతిలో "సుమతి శతకం", నాల్గవ తరగతిలో "దాశరథి శతకం", ఐదవ తరగతిలో "భాస్కర శతకం" పూర్తిగా కంఠస్థం చేయించేవారు. ఈ పద్ధతి ఈనాడు ఎక్కడా కనబడటం లేదు. దీని దుష్ఫలితాలను నేటి బాలబాలికలలో మనం చూస్తూనే ఉన్నాము.

**2**

గోగులపాటి కూర్మనాథకవి క్రీ.శ. 18వ శతాబ్దానికి చెందినవాడు. క్రీ.శ. 1720 ప్రాంతంలో నేటి విశాఖజిల్లా 'రామతీర్థం' అనే గ్రామంలో పుట్టి, క్రీ.శ. 1790లో అదే జిల్లాలోని "దేవులపల్లి" అనే గ్రామంలో చనిపోయినట్లు తెలుస్తోంది. ఈ కవి విజయనగర సంస్థానాధీశుడు పూసపాటి పెదవిజయరామరాజుగారిచే సత్కరింపబడ్డాడు. (ఈ పెదవిజయరామరాజుగారు క్రీ.శ. 1757లో జరిగిన "బొబ్బిలి యుద్ధం"లో మరణించాడు.) విజయనగరం సమీపంలో ఉన్న "రామతీర్థం" ఈ కవి స్వగ్రామం. తల్లిదండ్రులు: "గౌరమాంబ-బుచ్చనమంత్రి". పితామహుడు: "సూరనార్యుడు". వీరు ఆరువేల నియోగి బ్రాహ్మణులు, ఆపస్తంబ సూత్రులు. కూర్మనాథకవి గురువు, విజయనగరరాజుల రాజగురువైన "శ్రీ తిరుమల పెద్దింటి సంపత్కుమార వేంకటాచార్యులవారు". ఈ కవికి "వెంకన్న, కామన్న" అనే ఇద్దరు తమ్ములున్నట్లును, వారు కాశీ రామేశ్వర మజిలీలు చేస్తూ, సుప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు సందర్శిస్తూ, దేశసంచారం చేసినట్లును తెలుస్తోంది. కూర్మనాథకవి స్వగ్రామానికి దగ్గరలో ఉన్న దేవాలయాలలో సంకీర్తనాచార్యుడుగా ఉండేవాడు. ఈ పదవిలో ఇతనిని పెదవిజయరామరాజుగారో లేక ఆయన తండ్రి మొదటి ఆనంద గజపతి రాజుగారో నియమించారు. ఆ రాజుల దేవాలయాన్నింటినీ ఈ కవి దర్శించి, సాహిత్య కైంకర్యం చేస్తూ ఉండేవాడు.

**కూర్మనాథకవి రచనలు:-**

కూర్మనాథకవి చిన్నతనంలోనే "మృత్యుంజయ విలాసము" అనే ఒక యక్షగానాన్ని రచించాడు. ఇది నిజానికి "ప్రబంధం, యక్షగానం, నాటకం అన్నీ కలిపిన కొత్త ఫక్కీ రచన" (ఆరుద్ర). కవే స్వయంగా దీనికి "శృంగార నాటక గేయ ప్రబంధము" అని కొత్తపేరు పెట్టాడు.

కూర్మనాథకవి రెండవరచన "సుందరీమణి శతకము". ఈ "సుందరి" కవి ఉంచుకొన్న వేశ్య కాబోలు! దీనిలో శృంగార రసాన్ని విశృంఖలంగా వర్ణించాడు.

ఈ రెండు రచనలతో కవిగా అతని పేరు నలుదిక్కులా వ్యాపించింది. పెద విజయరామరాజుగారు ఈ కవిని పిలిపించి ఘనంగా సత్కరించారు. రాజుగారిపేరూ, ఆ రాజుల కులదైవమైన రామతీర్థంలోని "సీతారాముడు" పేరూ కలిసి వచ్చేటట్టుగా "విజయరామా! రామతీర్థాశ్రయా!" అనే మకుటంతో ఒక శతకం చెప్పాడు. కాని దీంట్లో మూడు పద్యాలు మాత్రమే నేడు లభిస్తున్నాయి.

పెదవిజయరామరాజుగారి భార్యపేరు "చంద్రయ్యమ్మగారు". ఈమెపేరుతో "చంద్రమ్మపేట" లేక "చంద్రనగరం" వెలసింది. ఆ ఊళ్ళో దేవునిపేర కూర్మనాథకవి ఒక "అష్టకం" వ్రాశాడు. ఇది విడిగా లభించటంలేదు. ఈ కవియే రచించిన "లక్ష్మీనారాయణ సంవాదము" అనే సేవాప్రబంధంలో ఈ అష్టకం ఉంది. ఈ సేవా ప్రబంధం మూడాశ్వాసాల కావ్యం. దీనిలో రెండవ ఆశ్వాసంలో, దారిదోపిడీలు చేసి, వైష్ణవులకు విందులు పెట్టిన 'తిరుమంగయాళ్వారు కథ' ఉంది. అందువల్ల ఈ రెండవ ఆశ్వాసాన్ని "చోరసంవాదం" అంటారట (ఆరుద్ర).

### శ్రీ సింహాద్రి నారసింహశతకం - రచనకుగల కారణాలు:-

గోగులపాటి కూర్మనాథకవి కీర్తిని దశదిశలా చాటిన రచన "శ్రీ సింహాద్రి నారసింహ శతకము". ఇది ఉత్తమ అధిక్షేప శతకము లేక చారిత్రక శతకము. 18వ శతాబ్ది మధ్యభాగంలో (క్రీ.శ. 1753లో) కళింగాంధ్రం లేక ఉత్తరాంధ్రం (నేటి విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలు) తురక సైన్యాల దోపిడీలతో అల్లకల్లోలంగా ఉంది. ఈ తురకల (యవనుల) దాడికి చారిత్రకులు రెండు రకాల కారణాలు చెపుతున్నారు:- (1) హైదరాబాదు నవాబులు, ఢిల్లీ చక్రవర్తియైన ఔరంగజేబునకు సామంతులు. ఉత్తర సర్కారులు వీరి అధీనంలో ఉండేవి. ఔరంగజేబు ప్రతినిధి "ఫకీర్ అలీఖాన్". ఇతని దగ్గర విజయనగర సంస్థానాధీశుడైన మొదటి ఆనంద గజపతిరాజు, అనకాపల్లి పాలకుడైన "హాల్‌కొలమ్" అనే ఆంగ్లేయునిద్వారా కొంతధనం ఋణంగా తీసుకున్నాడట. అది సకాలంలో చెల్లించక పోవటంవల్ల, అలీఖాన్ ఆంధ్రదేశంపై (సర్కారు జిల్లాలపై) దండెత్తి గ్రామాలను దోచుకోవడం, స్త్రీలను చెరపట్టడం, దేవాలయాలను ధ్వంసం చేయడం మొదలు పెట్టాడు. (2) క్రీ.శ. 1753లో దక్కను సుబేదారు "సలాబత్ జంగ్" ఉత్తర సర్కారులను ఫ్రెంచివారికి కౌలుకు ఇచ్చాడు. వాటిని స్వాధీనం చేసుకోమని ఫ్రెంచిదొర "బుస్సీ", మచిలీపట్టణం గవర్నరైన "మారిసన్"ను పంపించాడు.

శ్రీకాకుళంలో ఫౌజుదార్‌గా ఉన్న "జాఫరల్లీఖాన్" తిరుగుబాటు చేశాడు. అతడు మహారాష్ట్రులతో చేతులు కలిపి, ఉత్తర సర్కారులను దోచుకోవడం మొదలుపెట్టాడు. మరాఠాదండు గ్రామాలను దోచుకొంటూ ఉంటే, తురకదండు దేవాలయాలను ధ్వంసంచేయడం ప్రారంభించింది. ప్రమత్తంగా ఉన్న పెదవిజయరామరాజు వీరిని నిలువరించలేకపోయాడు. ఆంధ్రదేశం ఈ విధంగా అట్టుడికిపోతున్న సందర్భంలో ఈ శతకం పుట్టింది.

క్రమంగా ముస్లింలు సింహాచల కొండమీదికి చేరుతున్నారనే వార్త తెలిసి, ఆ దేవస్థానంలో ఉద్యోగిగా ఉన్న భక్తకవి "గోగులపాటి కూర్మదాసు" నారసింహుని ప్రార్థిస్తూ ఈ శతకం చెప్పాడు. "ఆదుర్తి హరిహరదాసు" అనే అతని మిత్రుడు లేఖకుడుగా ఉండి ఈ శతకాన్ని వ్రాశాడట. ఇది "వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!" అనే మకుటంతో, సీసపద్యాలతో, నిందాస్తుతితో, ఉపాలంభనలతో సాగిన శతకం. మొదటిపద్యంలో స్వామివారిని భక్తితో ప్రార్థించి ప్రసన్నుణ్ణి చేసుకున్నాడు. రెండవ పద్యంలో, తాను చెప్పబోయే విషయాలను పరాకు లేకుండా, శ్రద్ధగా వినుమని భగవంతునికి విన్నవించుకున్నాడు. తరువాత 3వ పద్యం నుండి 67వ పద్యంవరకూ తురకసైనికులచేత ప్రజలు పడుతున్న పాట్లను కళ్ళకు కట్టినట్లుగా వర్ణించాడు. స్వామివారి పరాక్రమాన్ని జ్ఞప్తికి తెచ్చి, శత్రువులను శీఘ్రంగా పారద్రోలుమని ప్రార్థించాడు. తాను చెప్పదలచుకొన్న విషయానికీ, స్వామి నిర్వహించవలసిన కర్తవ్యానికి అనుగుణంగానే, "శత్రువులను శీఘ్రంగా (వెంటనే) సంహరించేవాడా! ఓ సింహాద్రి నారసింహప్రభూ!" అనే అర్థమిచ్చే మకుటాన్ని నిర్ణయించుకున్నాడు. ఎంత సేపటికీ స్వామి కరుణించక పోవడంతో, "నీవు కూడా తురకలలో కలిసిపోయావా?" అని నిందించాడు, నిలదీశాడు. ఈ విధంగా 67 పద్యాలు పూర్తి అయ్యేసరికి స్వామి కరుణించాడు. సింహాచలం గుహలలో మంటలు చెలరేగాయి. అక్కడనున్న తేనెపట్లు అంటుకున్నాయి. వాటిలోనుండి గండుతుమ్మెదలు (తేనెటీగలు) భయంకరంగా చెలరేగి, ప్రళయకాలంలోని కారుమేఘంలా తురకసైనికులను కప్పి, తమ ఉక్కుమూతులతో వారిని కఱచి, కండలు ఊడిపడేలా చీల్చి చెండాడి, నెత్తురు పీల్చి, వారిని సింహాచలంనుండి విశాఖపట్టణంలోని శ్మశానంమెట్టదాకా తరిమివేశాయి. అందువల్ల ఆ శ్మశానంమెట్టకు 'తుమ్మెదల మెట్ట" అని పేరు వచ్చిందని ప్రతీతి.

**దశావతారాలు – రామావతార వర్ణన ప్రత్యేకత:–**

పై సంఘటన జరిగిన తరువాత, కూర్మనాథకవి, స్వామివారి మాహాత్మ్యానికి ఆశ్చర్యపడి, 68వ పద్యంనుండి స్వామిని నిందించిన తనను క్షమింపుమని ప్రార్థిస్తూ మిగిలిన పద్యాలు వ్రాసి, శతకాన్ని పూర్తిచేశాడు. 68–100 మధ్యగల పద్యాలలో స్వామివారి దశావతారాలను వర్ణించాడు. మత్స్యావతారం (76)–కూర్మావతారం (78)–వరాహావతారం (79)–నరసింహావతారం (80) – వామనావతారం (81) – పరశురామావతారం (82) – అనే ఆరు అవతారాలను వర్ణించిన తరువాత, రామావతారాన్ని గురించి ప్రత్యేకంగా 13 పద్యాలు (83 నుండి 95 వరకు) వ్రాశాడు. ఈ పద్యాలన్నీ కవిమనసులోని రామభక్తిని వేనోళ్ళ చాటుతున్నాయి. స్థూలంగా రామాయణకథ అంతా వీటిలో వచ్చేసింది. ఈ రామావతార వర్ణనలో కొన్ని పద్యాలు మిక్కిలి మనోహరంగా ఉన్నాయి. బాల్యంలోని రాముని వర్ణన (85) – విశ్వామిత్రుని వెంట వెళ్ళిన కౌమార రాముని వర్ణన (86) – రాముని పాదధూళి సోకిన వెంటనే శిల అహల్యగా మారటం (87) – కల్యాణసమయంలో పెండ్లికూతురైన సీతాదేవి అత్యద్భుత వర్ణన (89) – సీతారామలక్ష్మణుల అరణ్యవాస ప్రసక్తి(92)–మొదలైనవి, ఈ శతకంలో ధారాశుద్ధిసంశోభితమైన, భావశబలితమైన, అతిమనోజ్ఞమైన పద్యాలు.

**1) బాలరాముని వర్ణన:–**

**సీ॥ చిఱుత కూఁకటి ఘటించిన రావిరేక ము**
**త్యములు నెన్నొసటిపై దుముకుచుండ;**
**నిద్దంపు చెవులఁజెందిన పెద్ద మగఱాల**
**మద్దికాయలజత ముద్దుఁగులుకఁ;**
**బులిగోరు నాటిన బలు పద్మరాగంపు**
**హార మక్కున తళుక్కనుచు మెఱయఁ;**
**గంకణధ్వని, మొలఘంటల రొదయుఁ, గిం**
**కిణి రావములును, నేకీభవింప;**

**తే॥ భరత లక్ష్మణ శత్రుఘ్ను బాలకేళిఁ**
**దనరు నినుఁ గన్న తల్లిదండ్రు లనఘు లెన్న,**

**చిన్న రామన్న! నన్ను రక్షింపుమన్న!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 85**

మన తెలుగు సాహిత్యంలో బాలకృష్ణుని వర్ణనలున్నాయికాని, బాలరాముని వర్ణనలు లేవు. ఆధునికకాలంలో రామాయణ కల్పవృక్షంలో విశ్వనాథవారు వర్ణించారు. కాని విశ్వనాథవారికన్నా 200 సం.లు ముందుగానే గోగులపాటి కూర్మనాథకవి బాలరామమూర్తిని పాఠకుల మనోనేత్రంముందు ప్రత్యక్షంచేశాడు.

**2) అహల్యా శాపవిమోచన వర్ణన:–**

**సీ॥ శిలదాసినప్పుడె – చికురభావము తోఁచెఁ–**
**బదపద్మకలిత షట్పదము లనఁగ!**
**నడుగిడునప్పుడె – యాననం బేర్పడె–**
**నఖతారగతి నిశానాథుఁడనఁగ!**
**నంజవేయఁ – గుచద్వయము గనుపట్టెను–**
**రతియుక్త కోకదంపతు లనఁదగి!**
**కలయఁ గ్రుమ్మరువేళఁ – గాంతయయ్యెఁ – దనూజ**
**నొసఁగ నల్లుని జూచు నుర్వి యనఁగ!**

**తే॥ నంతఁ గౌతమునతివ యహల్య యగుచు**
**నతిథి సత్కారములు సల్పెనఁట! త్వదంఘ్రి**
**రజము నుతిసేయఁదరమె శ్రీరామచంద్ర!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 88**

ఈ వర్ణనప్రభావం విశ్వనాథవారి రామాయణంలో మనకు స్పష్టంగా కనబడుతుంది. (చూ. బాలకాండ, అహల్యా, 554వ పద్యం.)

**3) కల్యాణఘట్టంలో పెండ్లికూతురైన సీతాదేవి అత్యద్భుత సౌందర్య వర్ణన:–**

**సీ॥ కనక శలాక, శృంగార తరంగంబు,**
**రాజమరాళి, సామ్రాజ్యలక్ష్మి,**
**మదనబాణము, నవమాలిక, మాణిక్య**
**వల్లరి, చంచలావల్లి, చంద్ర**

**కళ, ధగద్ధగిత నక్షత్రంబు, నవరత్న**
**మంజరి, కందర్ప మదగజంబు,**
**లావణ్య సరసి, విలాస పేటిక, మనో**
**జ వనవాటిక, ఘనసార ఘుటిక,**
**తే॥ జాతరూప సమేత, భూజాత, జనక**
**జాత, దృగ్జిత నవవనజాత, సీతఁ**
**బరిణయంబగు నీమూర్తిఁ బ్రస్తుతింతు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 89**

ఈ విధంగా అద్భుత కృత్యాలను మైమరచి వర్ణించిన రామభక్తాగ్రగణ్యుడైన యీ కవి, పతివ్రతయైన సీతాదేవి విషయంలో మాత్రం, రాముడు చేసిన అన్యాయాన్ని నిలదీసి అడగడంలో వెనుకాడలేదు–

"ఓ రామా! నీవు రావణ సంహారం కావించి, నిఖిలలోకాలను నిష్కంటకములుగా చేసి, కొలిచిన వారికి కొంగుబంగారమై, సుమస్త కోరికలు ఇస్తున్న నిన్ను తలచుకొంటే నాకు మిక్కిలి సంతోషమే కాని, –

**"…. ధరాసుత ముద్దరాలిఁ**
**బరమపావని, వినరాని పలుకులాడి**
**యగ్నిఁ జొరఁజేయుటకె మాకు నలుక పుట్టె!"**

– అంటాడు మొహమాటం లేకుండా (చూ. పద్యం 94). అల్లసాని పెద్దనగారి మనుచరిత్రలోని పద్యాలలో ఉండే ధారాశుద్ధి, శయ్యాసౌభాగ్యం, ప్రసన్నత, ద్రాక్షాపాకం ఈ రామావతారవర్ణన పద్యాలలో మనకు సాక్షాత్కరిస్తాయి.

ఈ రామావతారవర్ణన తరువాత బలరామ(96)–బుద్ధ(97)–కల్కి–(98) – కృష్ణ(99) అవతారాలను వర్ణించి, చివరిగా శ్రీమన్నారాయణమూర్తిని వర్ణించి (100), స్వవిషయాన్ని చెప్పుకొని (101) తన శతకాన్ని ముగించాడు కూర్మనాథకవి. శతకం చివరలో చేసిన శ్రీమన్నారాయణమూర్తి వర్ణన మహాద్భుతంగా ఉండి, కవి మనసులోని భక్తిని మనకు సాక్షాత్కరింపజేస్తోంది–

**సీ॥ మాణిక్యపీఠికా మధ్య పద్మస్థితు,**
**రవికోటి తేజోవిరాజమానుఁ;**

**గంధర్వ శతకోటి సుందరాకారుని,**
**శంఖ చక్ర గదాసి శార్ఙ్గ ధరుని;**
**శ్రీ భూమి యువతి సంశోభి పార్శ్వద్వయు,**
**నంచిత పుండరీకాయతాక్షు;**
**శ్రీవత్స కౌస్తుభ శ్రీహారయుత వక్షుc,**
**గటి లసన్మణి కాంతిc గనక చేలు;**

**తే॥ మకుట కుండల కేయూర మహిత కంక**
**ణాంగుళీయక ముఖ్య భూషాంగు, విశ్వ**
**నిలయు, నారాయణస్వామి! నిన్నుc గొలుతు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!** **100**

ఒక్క మాటలో చెప్పాలంటే, గోగులపాటి కూర్మనాథకవి రచించిన ఈ శతకంలోని పద్యాలు – సింహాచల చంపకపుష్ప దివ్యసౌరభసంభరిత సమీర తరంగాలు! అక్షయ తృతీయనాటి శ్రీవారి చందనోత్సవ సమయ శ్రీగంధయుక్త పరమపవిత్ర మహాప్రసాదపు ఘుమఘుమలు! భక్తులు ఆఘ్రాణించి ఆనందింతురుగాక! ఆస్వాదించి తరింతురుగాక!!

**3**

గోగులపాటి కూర్మనాథకవి రచించిన ఈ సింహాద్రి నారసింహశతకంయొక్క వైశిష్ట్యాన్ని గురించి, ప్రముఖ అభ్యుదయకవి, పరిశోధకుడు, సాహిత్య చరిత్రకారుడు అయిన ఆరుద్రగారు ఎంతో చక్కగా వివరించారు. దానిని పాఠకులకోసం, యథాతథంగా ఈ దిగువ ఇస్తున్నాను:–

**ఆరుద్రగారి ప్రశంస:–**

"ఆలయానికే జీవితం అంకితం చేసిన కవి, గుడికి ఏ విపత్తు వచ్చినా భరించలేడు. కూర్మనాథుని కాలంలో మరాఠీలు, పిండారీలు, రోహిలాలు మొదలైన వాళ్లు గ్రామాలమీద పడి దోచుకునేవారు. ఏ సంవత్సరమో సరిగ్గా చెప్పలేంగాని ఒకసారి తురకలు పెచ్చురేగారు. ప్రజలను హింసించి దేవాలయాలు నాశనం చేయడం ప్రారంభించారు. అప్పుడు కూర్మనాథం సింహాచలం దేవాలయాల్లో ఉద్యోగి. ఆ పురాతన నిర్మాణానికి ముప్పువస్తుందని అతడు ఆవేదనతో

తల్లడిల్లిపోయాడు. అతని కళ్లముందే ఇతర గ్రామాలలో ఎన్నో దారుణాలు జరిగాయి.

“తురక దాడికి బెదిరి ఇల్లూ వాకిళ్లు వదిలి సంసారాలు పారిపోయాయి. ఎక్కడ తలదాచుకోవాలో తెలియక అడవులు పట్టారు. నడవలేనివాళ్లూ పరిగెత్తక తప్పలేదు. పైమీద దుప్పటి బరువనుకొనేవాళ్లు, మూటలు మోయవలసివచ్చింది. పంచభక్ష్య పరమాన్నాలు తినేవాళ్లు, బలుసాకు తినవలసి వచ్చింది. గడపదాటని ఇల్లాళ్లు, అలంగం తిరగవలసి వచ్చింది. పఠానీలఫౌజు గ్రామాలను చుట్టబెట్టింది. సోయాజుల పెద్ద జారీలను గుడిగుడీలుగా చేసుకొన్నారు. యజ్ఞవాటికలో ధూమపానం చేశారు. యాగపాత్రలను లుడికీ చిప్పలు చేసుకొన్నారు. ఇవన్నీ ఇతరగ్రామాలలో చూసి, సింహాచలంలో కూడా ఇవి జరుగుతాయేమో అని కూర్మనాథం అలమటించి పోయాడు! దేవుణ్ణి ప్రార్థించాడు! మొత్తుకొన్నాడు! ఎత్తిపొడిచాడు! తిట్టాడు! రోషం కలిగించాడు!

**ఇందుగల దందులేదను సందియంబుఁ**
**జెందవలదను వేదవాగ్బృందమెల్ల**
**నెందువెదికినఁ గానరావేమి యిపుడు?**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!** (పద్యం–52)

అని గాలించాడు. దేవునికి కూడా తురకమతంపై అభిమానం పుట్టిందా అని కవికి అనుమానం వేసింది. “బీబినాంచారిని బిలిపింపు వేగమే, తుద కభ్యసింపుమా తురకభాష” అని ఏద్దేవ చేశాడు. ఇంకా ఇలా తిట్టాడు: –

**పాశ్చాత్యుల నమాజుపై బుద్ధిపుట్టెనో, మౌనుల జపముపై మనసురోసి;**
**యవనుల కందూరియందిచ్ఛ చెందెనో, విప్రయజ్ఞములపై విసువుపుట్టి;**
**ఖానజాతి సలాముపై నింపుపుట్టెనో, దేవతాప్రణతిపై భావమెదలి;**
**తురకల యీదునందు ముదంబుగల్గెనో, భక్తనిత్యోత్సవ పరతమాని;**

**వాండ్రు దుర్మార్గులయ్యయో “వ్రతము చెడ్డ**
**సుఖము దక్కదు”, వడి ఢిల్లి చొరగఁ దోలు**
**పారసీకాధిపుల పటాపంచలుగను!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!** (పద్యం–8)

"కవి తన వ్రతం చెడగొట్టుకొని దేవుణ్ణి తిడుతున్నాడు. అయితే తన సొంతానికి కాదు. ప్రజల క్షేమంకోసమే ఈ దూషణ. ఆ సంగతి ఇలా చెప్పాడు:-

**మా మొఖాసాకు గ్రామంబు లిమ్మనలేదు, కొంపలు గాల్పింపఁ గూడదంటిఁ;**
**గరి హయాదుల మేము గాంక్షింపగాలేదు, గోవధ మాన్పించి ప్రోవుమంటి;**
**మాకు మిమ్ములను సామ్రాజ్యమిమ్మనలేదు, జనులను దోపింపఁ జనదటంటి;**
**స్వామి! మాకొఱకేమి కామింపఁగాలేదు, క్షితిలోనఁ బ్రజల రక్షింపుమంటిఁ;**
**జెలఁగి నీ పదసేవలు సేయు మాకు-వేఱె కోరికలేటికి? వెన్నగలుగ**
**నహహా! నేతికి నేటికి నంగలార్చ?-వైరిహరరంహా! సింహాద్రి నారసింహా.**

(పద్యం-54)

"అంగలార్చడం అంతా ప్రజల కోసమే! అందుకే దేవుణ్ణి బ్లాక్‌మెయిల్ చేశాడు. "చాటకపోఁ జుమీ! చాలఁబ్రోవకయున్న, నాటి వ్రేపల్లెలో ఱోటిమాట" అని బెదిరించాడు. "పాలీయవచ్చిన భామిని ప్రాణంబు లపహరించి చెలంగినట్లు గాదు... పరబలంబిది నీ ప్రజ్ఞ పనికిరాదు'' అని తూలనాడాడు.

**ఔర! నిజమాడ నిష్ఠురంబౌ నటంద్రు!**
**కాక రోషంబు గలిగినఁ, గఠిన యవన**
**సేన నిర్జించి, యీ యాంధ్రసృష్టి నిల్పు!**
**వైరిహరరంహా! సింహాద్రి నారసింహా!** (పద్యం-24)

"ఆంధ్రసృష్టిని నిలుపుకోవాలనే ఆశయం, అది నాశనమవుతుందేమో అనే ఆరాటం, అవకూడదనే సంకల్పం తొలిసారిగా తెలుగుకవితలో ఇక్కడ సాక్షాత్కరిస్తుంది. నాటి ప్రజలు ప్రమాదంలో ఉన్నప్పుడు, సంఘచైతన్యం కల ఏ కవికంఠం ఎలుగెత్తక మానదు? అన్యాయం జరుగుతూఉంటే ఆపడానికి దేవుణ్ణయినా అది లక్ష్యపెట్టదు. కారుచిచ్చులా దహించే కన్నీళ్లతో గోగులపాటి కూర్మనాథం సింహాద్రి నారసింహ శతకం చెప్పాడు. ఒక పక్కనుంచి తురకసేనలు త్వరత్వరగా వస్తూంటే వడివడిగా పద్యాలు అతడు చెప్పాడు. 67 పద్యాలు చెప్పగానే, ఆ పద్యాల వేడికో, ప్రజల వుసురుకో, సింహాచలం కొండమీద ఉన్న తేనెపట్లు ఒక్కసారి అంటుకున్నాయి. వెల్లువలాగ తుమ్మెదలు చెలరేగి, తురకసేనలను విశాఖపట్నంలోని శ్మశానంమెట్టదాకా తరిమాయి. నాటినుండి ఆ మెట్టకు "తుమ్మెదల మెట్ట" అని పేరు వచ్చింది.

"గోగులపాటి కూర్మనాథానికి పేరుతెచ్చిన శతకం కూడా ఇదే. ఇటువంటి శతకాలు తెలుగు సాహిత్యంలో మరికొన్ని లేకపోలేదు. అయితే ఆంధ్రసృష్టిని నిలుపమని సందేశం ఇచ్చిన కవులలో ఇతడు ప్రముఖుడు. తెలుగు సాహిత్యంలో ఇతని ఈ సృష్టి నిలుస్తుంది."

(–సమగ్ర ఆంధ్రసాహిత్యం, ఎనిమిదవ సంపుటం,
కడపటి రాజుల యుగం, పుటలు 237–239)

**4**

**కూర్మనాథకవి అతులిత రామభక్తి:–**

ఈ శతకాన్ని చదివినవారికి గోగులపాటి కూర్మనాథకవి గొప్ప రామభక్తుడని స్పష్టమవుతుంది. రాముని ప్రసక్తి ఎక్కడవచ్చినా ఇతడు తన్మయుడై వర్ణిస్తున్నాడు. ఆ భక్త్యావేశంలో చక్కని చిక్కని కవిత్వం జాలువారుతోంది. ఈ శతకంలో నాల్గవ వంతు పద్యాలు – అంటే 76వ పద్యం నుండి 100వ పద్యం వరకూ గల 25 పద్యాలు) దశావతార వర్ణనకు ప్రత్యేకించాడు కవి. ఒక్కొక్క అవతారానికి ఒక్కొక్క పద్యం మాత్రమే వ్రాశాడు. కాని రామావతార వర్ణనకు మాత్రం 13 పద్యాలు (83–95) కేటాయించాడు. ఇవన్నీ అత్యద్భుతమైన పద్యాలు. (వీటిని గురించి ఇంతకుముందే తెలియజేశాను). ఈ దశావతార వర్ణనకు పూర్వమే 61వ పద్యంలో వీరరాఘవుని ప్రసక్తివచ్చింది. అక్కడ యుద్ధభూమిలోని రాముని వీరావతారాన్ని కళ్ళకు కట్టినట్లుగా వర్ణించాడు కూర్మనాథకవి:–

**సీ॥ నిడుద కడానిశాల్ నడుమున బిగియించి,**
**తీరైన గండపెండేర మూని;**
**రమణీయ మణిశిరస్త్రాణ మౌదలఁబూని,**
**స్ఫుట వజ్రమయమైన జోడుఁ దొడిగి;**
**తూణంబు లిరువంకఁ దోరణంబుగఁ గట్టి,**
**విలసిత శరమైన విల్లుబట్టి;**
**పరవైరి హరమైన తరవారి ధరియించి,**
**దాపల చికిలి కటారి చెక్కి;**

**తే॥ రామవేషంబుతో, సుమిత్రాసుతుండు**
**నీవు, రణరంగమున నిల్చి, నిబిడశత్రు**

**జాలముల నేలపాల్సేయు లీల నెఱపు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!** **61**

ఇలాగే, రాముని పాదధూళి మహిమ, బాహుబలము, ఆజ్ఞాప్రభావము, ప్రతాపాగ్ని – వీటిని వర్ణిస్తూ ఇంకొక అతిసుందరమైన పద్యం వ్రాశాడు. కూర్మనాథకవి: –

**సీ॥ నీ పాద రజమున నిమిషంబు లోపల**
**బాపురే! సతియయ్యె చాపఱాయి!**
**నీ బాహుబలమున నిలువక పెళ్ళున**
**ముక్కంటి చాపంబు ముక్కలయ్యె!**
**నీ యాజ్ఞచే గిరుల్ నీటఁ దెప్పునఁ దేలె,**
**కడకు సముద్రంబు గట్టువడియె!**
**నీ ప్రతాపాగ్నిచే నిఖిల రాక్షసకోటి**
**మాడి దోమలమాడ్కి మడిసి పోయె!** **66**

ఈ శతకంలో రామావతారవర్ణన పద్యరచనకూ, తక్కిన పద్యరచనకూ ఎంతో వ్యత్యాసం కనబడుతోంది నా దృష్టికి. రామునివర్ణన వచ్చినప్పుడల్లా నేను ఆశ్చర్యంతో ఉలిక్కిపడుతున్నాను! అత్యద్భుతమైన కవిత్వాన్ని చదివిన ఆనందానికి లోనవుతున్నాను! సహృదయులైన పాఠకులుకూడా ఇదే రసానుభూతిని పొందుతారని భావిస్తున్నాను.

**కూర్మనాథకవి సీసపద్యరచన: –**

ఇది సీసపద్యశతకం. ఈ పద్యాలన్నీ ఆశువుగా చెప్పినట్లుగా జనశ్రుతి ఉంది కాబట్టి ఇవన్నీ ధారాశుద్ధి సంశోభితంగా ఉన్నాయి. శ్రీనాథుని సీసపద్యాలలాగ, పోతనగారి సీసపద్యాలలాగ వీటిలో మంచి 'తూగు' కనబడుతుంది. ఏ పాదానికి ఆ పాదం, ఒకే పాదంలోని ఏదళానికి ఆ దళం, చక్కగా విరామాన్ని పొంది ఉన్నాయి. ఈ క్రింది ఉదాహరణాలు చూడండి: –

**(1) సీ॥ చింపికుళ్లాయైన శిరమునఁ దాలిచి,**
**దివ్యకిరీటంబుఁ దీసి దాఁచు;**
**వనమాలికయ చాలు వక్షంబున ధరింపఁ,**

గౌస్తుభరత్నంబు గట్టిసేయు;

. . . . . . . . . . . . . . . . . . . . . (21వ పద్యం)

(2) సీ॥ మనువంశభూషణ మహిమచేఁ జెన్నొంది,
ఘన కళాసాంగత్య కలనఁజెంది;
సకల సాయక వర్ణసంగతి నింపొంది,
సద్గుణరీతిఁ బ్రశస్తినొంది;

. . . . . . . . . . . . . . . . . . . . . (83వ పద్యం)

(3) సీ॥ ఫణిరాజ శయ్యపైఁ బవ్వళించెడు నీవు,
పండితి కౌసల్య పక్కలోన;
బ్రహ్మాండ గోళముల్ బ్రాఁకి యాడెదు నీవు,
రహిఁ బ్రాఁకితివి దశరథుని యింట;

. . . . . . . . . . . . . . . . . . . . . (84వ పద్యం)

(4) సీ॥ "అయ్యారె! నెమ్మోము నొయ్యారమౌ భళీ!
నిక్కు వీనులు, ముక్కు చక్కఁదనము;
ఔర! కైజామోర యల్లార్చు నుద్ధతి
సేబాసు! తొమ్ములో జిగి బెడంగు

. . . . . . . . . . . . . . . . . . . . . (98వ పద్యం)

(5) సీ॥ మాణిక్యపీఠికా మధ్య పద్మస్థితు,
రవికోటి తేజోవిరాజమానుఁ;
గందర్ప శతకోటి సుందరాకారుని,
శంఖ చక్ర గదాసి శార్ఙ్గ ధరుని;

. . . . . . . . . . . . . . . . . . . . . (100వ పద్యం)

74, 81, 86, 96, సంఖ్యలుగల పద్యాలలో కూడా ఈ తూగు కనబడుతుంది. శతకం చివరి భాగంలో వచ్చిన దశావతార వర్ణనలన్నీ ఈ నడకలోనే సాగాయని చెప్పవచ్చును.

నన్నయ సీసాలలో లాగ, తిక్కన సీసాలలో లాగ, ఒక పాదంనుండి మరోపాదంలోకి 'దురాక్రమణ' చేస్తూ, గద్యంలాగ సాగే పద్యాలు (గునుగుసీసాలు) ఈ శతకంలో లేవు. కాని, ఒక సీసపద్యపాదంలోని ఒక దళంనుండి మరొక

దళంలోకి కొనసాగిన పద్యాలు మాత్రం ఉన్నాయి. సీసపద్యపాదంలోని రెండు దళాలూ కలిపి ఒకేపాదంగా ఛందశ్శాస్త్రం భావిస్తుంది కాబట్టి ఈ 'ఆక్రమణ' తప్పుకాదు. శతక ప్రారంభపద్యంలోనే ఇది మనకు సాక్షాత్కరిస్తుంది:-

**(1) సీ॥ శ్రీమద్రమారమణీమణీ రమణీయ**
**సరస చిత్తాబ్జ బంభర ! పరాకు!**
**శంఖ చక్ర గదాసి శార్‌ఙ్గ చాపాది భా**
**సుర దివ్యసాధనకర ! పరాకు!**
**. . . . . . . . . . . . . . . . . . . . . . (1వ పద్యం)**

**(2) సీ॥ నట్టువల్ ద్రొక్కగా నవ యామునీయ కూ**
**లంబుగాదు, రణస్థలంబుగాని;**
**కొట్టితోలఁగ నీకు గోవృషభంబుల**
**బారుగాదు, గుఱాలఫౌఁజుగాని;**
**. . . . . . . . . . . . . . . . . . . . . . (15వ పద్యం)**

**(3) సీ॥ గ్రామంబులన్నియుఁ గాల్చి దీపారాధ**
**నలు చేసి రౌర! యానందముగను;**
**వడి సాధుజనుల సర్వస్వమ్ముఁ గొని శఠ**
**గోపంబుఁ బెట్టిరి గురుతరముగ;**
**. . . . . . . . . . . . . . . . . . . . . . (27వ పద్యం)**

**(4) సీ॥ "తే నమో! రక్షిత దేవతాయ, సురేంద్ర**
**సేవితాయ, మునీంద్ర భావితాయ;**
**తే నమో! నిత్య సుధీరతాయ, సుమేరు**
**ధీరతాయ, యశుభ వారణాయ;**
**. . . . . . . . . . . . . . . . . . . . . . (73వ పద్యం)**

**(5) సీ॥ శాశ్వతంబుగ విభీషణునకు లంక ని**
**శ్చలకృప నొసఁగుటఁ దలఁచుకొన్నఁ;**
**జెఱఁబద్ద సురసిద్ధ గరుడ గంధర్వ కాం**

**తల విడిపించుటఁ దలఁచుకొన్న;**

**. . . . . . . . . . . . . . . . . . . . . (94వ పద్యం)**

ఇంకా 4, 11, 18, 85 మొదలైన పద్యాలలో కూడా ఈ పాదదళ సమ్మేళనం కనబడుతుంది.

మొత్తానికి కూర్మనాథకవి సీసపద్యాలన్నీ పంచకల్యాణి గుఱ్ఱాల్లాగ పరుగులు పెట్టాయని చెప్పవచ్చును. సీసపద్యానికి ఎత్తుగీతిగా ఆటవెలది పద్యంకాని, తేటగీతి పద్యంకాని వ్రాస్తారు. ఈ కవి తేటగీతి పద్యాన్ని ఎంచుకొని, అన్ని పద్యాల చివరా దీనినే పాటించాడు.

**భాషావిశేషాలు:–**

గోగులపాటి కూర్మనాథకవి ఈ శతకంలో ఎన్నో తెలుగు "జాతీయాలు" ("నుడికారాలు" లేక "పలుకుబడులు"–Idioms), మరెన్నో "సామెతలు" (లోకోక్తులు లేక నానుడులు –Proverbs) ప్రయోగించాడు. ఇవి యించుమించు ప్రతిపద్యంలోను మనకు కనబడతాయి. (ముఖ్యంగా 1 నుండి 67వ పద్యంవరకూ గల అధిక్షేపపద్యాలలో ఎక్కువ).

**జాతీయాలు:–**

చిత్తగించు – జబ్బుపడియుండు – ఒక్క దెబ్బతీయు – చుట్టబెట్టు – మట్టిమల్లాడు – కొట్టికొల్లలువెట్టు–పట్టిపల్లార్చు – భగభగలాడు – అయ్యయో – పాఱఁదరుము – మట్టుకొనివచ్చు – ఎంత ముచ్చటపడి –ఇల్లు చెడగొట్టుకొనకు – పడరాని పాట్లు – తప్పటడుగిడునప్పుడు – ఆటప్రాయము – కానివేళ – వేషంబు చెడు – మీనమేషములు లెక్కించు – మెడ (వడి)ఁబట్టి త్రోయు – తాతతాతవు ముదిమదిఁదప్పినావొ – ఈ తెప్ప బోర్లపడిన నేమి తినియెదవు? – పాలబుద్ధులు – ఆచంద్రతారకముగ – బైసి పోగొట్టుకోకు – "నీ సిగ్గు నిలుపుకొమ్ము, పరులు నవ్వఁగ నపకీర్తిపాలుగాక" (సిగ్గునిలుపుకొను – పరులు నవ్వు– అపకీర్తిపాలగు) – వేడుకొనుకొద్ది లావాయె–బుద్ధితెచ్చుకో – ఒడ్డుకొనఁబోకు – దిక్కేది మాకు? – పొడుగుచేతివాని పణ్యారము – పసతీరు – మొదల్పదిలమగు – శీఘ్రబుద్ధి – చేసికొనిన కర్మము – చిత్తంబు కరుఁగు – భోరున రక్తధారలు కురియు – నెత్తురు పీల్చు – కండలెల్ల నూడిపడన్ – చించిచెండాడు – చుట్టుముట్టు

– వేంచేయుమయ్య! – అడవులకు నేగుమన నోరాడెనెట్లు? – అయ్యారె! – ఒయ్యారమౌ బళీ!

**సామెతలు: –**

1. "ఇంటికన్న గుడి పదిలమనుచు" (పద్యం–2)
2. "పిన్నపామునకైనను పెద్దదెబ్బ" (పద్యం–6)
3. "వ్రతము చెడ్డ సుఖముదక్కదు" (పద్యం–8)
4. "వేఁటకాడిల మెత్తనౌవేళ, లేడి మూడు కాళ్ళను నడుచు" (పద్యం–9)
5. "కొండ యెక్కెదు బ్రతిమాలుకొనిన కొలఁది" (పద్యం–17)
6. "ఏండ్లెగసనైన, బుద్ధి దిగసన వచ్చెనో పో మరేమి?" (పద్యం–19)
7. "తినఁదినఁగ గారెలైనను కనరువేయు" (పద్యం–20)
8. "ఔర! నిజమాడ నిష్ఠురంబౌనటంద్రు" (పద్యం–24)
9. "కొందఱికిని మును శిశువు నేడిపింపక ముద్దురాదు" (పద్యం–31)
10. "గుడిమ్రింగువానికి లింగ మూర్భిండి వడెము" (పద్యం–36)
11. "కలవాఁడు గాదెఁదీయుఁదనుక బీదలప్రాణముల్ తాళుటెట్లు?" (పద్యం–37)
12. "కబళమననోరుఁ దెఱుతువు, కళ్ళెమన్న మోముఁద్రిప్పు హయగ్రీవమూర్తి వహహ!" (పద్యం–38)
13. "ఒదిగి చూచెదు కలిబోయ నుట్లదిక్కు" (పద్యం–39)
14. "మెడవట్టి త్రోయ, చూరు పట్టుక వ్రేలాడినారము" (పద్యం–41)
15. "మర్మమెఱిఁగిన వారితో మాను వాదు" (పద్యం–43)
16. "వెట్టివాడ! యోడముంచకు మనురీతి యొనరె మాకు" (పద్యం–45)
17. "అయ్య సామెల్ల నింటనే యన్నమాట" (పద్యం–47)
18. "ఇందుగల డందులేడను సందియంబుఁ జెందవలదు" (పద్యం–52)
19. "వెన్నగలుగ నహహ! నేతికి నేటికి నంగలార్చ?" (పద్యం–54)
20. "వాంద్రు+అంద సికయు, నందకుండినఁ గాల్బట్టుకొందురయ్య!" (పద్యం–55)
21. "కందకులేని దూల బచ్చలికి నేల గల్గ?" (పద్యం–59)
22. "కర్మమా మాకు గజమెక్కి కంతదూర?" (పద్యం–66)

**తురుష్క పదములు:-**

తురకదండు ప్రజలను(ముఖ్యంగా వివిధ ధర్మాలను పాటించే బ్రాహ్మణులను) బాధించు సందర్భాలలో, ఈ కవి తురుష్కపదాలను (ఉర్దూ, అరబిక్, పారశీక పదాలను) యథాతథంగా వాడినాడు. ఇది పాత్రోచితభాషగా అందగించింది. ప్రధానంగా రెండు పద్యాలలో (25, 36 పద్యాలలో) ఈ ఉర్దూ పద వాక్య ప్రయోగాలు కనబడతాయి. 25వ పద్యంలో -

1. 'హుక్కా పకడ్‌దౌరె గద్దా'' (< గధా)= "హుక్కా పట్టుకొని రారా గాడిదా!"
2. "పాము దోనేకు తుం పాని లా(వ్)రే"=(< పావ్ౘ ధోనేకో తుం పానీ లావ్‌రే")
   = కాళ్ళు కడుగు కొనేందుకు నీళ్ళు తీసికొని రారా!"
3. "ఘాసులారే అరే గాండూ! = "పచ్చగడ్డి పట్టుకొని రారా (మడ్డివెధవా!)"
4. "కులితీ పకావ్‌రే జలిదీ!" = "ఉలవలు ఉడకబెట్టరా త్వరగా!"

ఈ విధంగా ఎరిని ఆజ్ఞాపిస్తున్నారు తురకలు? బ్రాహ్మణులను! వారిలోను ఆహితాగ్నులను, శ్రోత్రియులను, శిష్టతతులను, మాధ్వులను!

"కిటికీ దారు" (< కిటికీదార్) = రహస్యద్వారపు కావలివాడు (పద్యం-32)

అంతేకాదు, బోడిసన్న్యాసులను, వైష్ణవులను, శైవులను, మాధ్వులను ఈ క్రింది విధంగా ఉర్దూభాషలో తిడుతున్నారు:- (పద్యం-36)

1) "బేగీ అరే అరబ్బీ పఢోరే" = "ఒరేయ్! త్వరగా అరబిక్ భాష చదవరా!" (సన్న్యాసులకు హెచ్చరిక)
2) "మత్రఖో మూపరు మాటి" - "మూపర్" = ముఖం మీద; "మాటీ" = బొట్టు (నామం); "మత్+రఖో" = పెట్టుకోవద్దు. (స్మార్తులకు, శ్రీవైష్ణవులకు హెచ్చరిక)
3) "పత్తరు కాయకు బందీయారే? చోదుదేవ్"-"పత్తరు (పత్తర్)"=ఱాయి (లింగము); "కాయకు (క్కైకో)" = ఎందుకు?; "బందియారే?" = కట్టుకుంటావు?; "చోదుదేవ్ (చోడ్‌దేవ్)" = వదిలెయ్! (శైవులకు హెచ్చరిక)
4) "కాలటీకా తూ నికాల్దేవ్" - "కాలా టీకా" = నల్ల బొట్టు; "తూ" = నీవు; "నికాల్దేవ్'' = తీసివేయుము! (మాధ్వులకు హెచ్చరిక)

క్రీ.శ.997-1030మధ్య 17సార్లు జరిపిన ఘజనీ మహమ్మదు దండయాత్రల లోను; తరువాత 12వ శతాబ్ది చివర్లో ఘోరీమహమ్మద్ జరిపిన 9 దండయాత్రలలోను; క్రీ.శ. 13-16 శతాబ్దాల మధ్య (క్రీ.శ. 1206-1526

మధ్య) ఢిల్లీ సుల్తానుల పాలనలోను; పిమ్మట మొఘల్ చక్రవర్తుల పాలనలోను (క్రీ.శ. 16, 17, 18 శతాబ్దాలు) – అంటే క్రీ.శ. 1526లో ప్రారంభమైన "బాబర్" నుండి – క్రీ.శ. 1707లో సంభవించిన ఔరంగజేబు మరణంవరకూ, మొత్తం సుమారు 700 సంవత్సరాలలో భారతదేశంలోని హిందువులు కొన్ని కోట్లమంది చంపబడ్డారు. మరికొన్ని కోట్లమంది స్త్రీలు చెరచబడ్డారు. అనేక లక్షల సంఖ్యలో స్త్రీలను, పిల్లలను బానిసలుగా ఇతర దేశాలకు తీసుకుపోయారు. కొన్ని కోట్లమంది హిందువులు మహమ్మదీయులుగా మార్చబడ్డారు. ఔరంగజేబు మరణంతో (క్రీ.శ. 1707లో) హిందువుల బాధలు తీరిపోయాయని నేను నిన్నమొన్నటివరకు భావిస్తూ వచ్చాను. కాని ఈ శతకం చదివిన తరువాత, ఔరంగజేబు మరణానంతరం కూడా (18వ శతాబ్దం చివరిదాకా కూడా) హిందువులు కష్టాలనుండి గట్టెక్కలేదని గ్రహించాను. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే – 1947లో జరిగిన దేశవిభజనవరకు ముస్లింలు హిందువులను లక్షల సంఖ్యలో చంపుతూనే ఉన్నారు. స్వాతంత్ర్యం వచ్చాక కూడా 1948 వరకు హైదరాబాద్ స్టేట్‌లో నైజాంపాలనలో "రజాకార్లు" ఎందరో హిందువులను చంపివేశారు. చరిత్రలో 700 సం.లు ముస్లిములకు, మరో 200 సం.లు ఆంగ్లేయులకు హిందువులు బానిసలుగా పడిఉండటానికి ముఖ్యకారణం ఏమిటి? – అని ఎన్నో సంవత్సరాలుగా నేను ఆలోచిస్తూ వచ్చాను. నా ఉద్దేశంలో, హిందువులలో కులభేదాలు, (వీటిలో మళ్ళీ శాఖాభేదాలు)–మతభేదాలు (శైవం–వైష్ణవం–జైనం –బౌద్ధం) – అస్పృశ్యతతో దళితులను దూరంగా పెట్టడం – ముఖ్యకారణాలు. ఈనాటికీ కూడా మన ప్రజాస్వామ్యం కులభేదాలమీద, మతభేదాలమీద మనుగడ సాగిస్తూ ఉండటం మిక్కిలి బాధాకరం! ప్రతికులానికీ ఒక ప్రత్యేక సంఘం; తమ కులంకోసం, రిజర్వేషన్లకోసం, తిరుగుబాట్లు – హింసాత్మక పోరాటాలు; అధికారంలో ఉన్న రాజకీయ పార్టీలు ఆ కులాల ఓట్లకోసం ప్రత్యేక కార్పోరేషన్లు పెట్టి కోట్లరూపాయల నిధులిచ్చి, వారిని మచ్చిక చేసుకోవడం; – ఇవన్నీ చూస్తుంటే, హిందూజాతికి ఇప్పట్లో మోక్షం ఉన్నట్టు కనబడటం లేదు! హిందూజాతి అంతా ఒక్కటైననాడే మనకు బానిసత్వంనుండి పూర్తివిముక్తి లభిస్తుంది!

## 5

ఈ శతకంలో 108 పద్యాలు ఉండాలి; కాని 101 పద్యాలు మాత్రమే

లభిస్తున్నాయి. తరువాతి కాలంలో జయసంవత్సరం పాల్గునమాసంలో ప్రకటింపబడిన "ఆరాధన" పత్రికలో ఈ శతకంలోనివిగా పేర్కొనుచు ఒక సీసపద్యం, ఒక తేటగీతి పద్యము లభించాయి. వీటిలో, స్వామి ప్రభావంచేత ఉక్కుమూతుల తుమ్మెదలు వచ్చి, తురకసేనలను చుట్టుముట్టి కుట్టి తరిమివేశాయని ఉంది. ఈ రెండు పద్యాలూ ప్రక్షిప్తాలని పండిత విమర్శకుల భావన. అందువలన వీటికి నేను సంఖ్యలు వేయలేదు. 101 పద్యాలకు మాత్రమే సంఘ్యలు వేసి, 68-69 పద్యాల మధ్యలో ఈ ప్రక్షిప్త పద్యాలు రెండూ ఉంచాను. వీటికి * అనే పువ్వుల గుర్తులు వేశాను.

ఈ శతకంలో 1 నుండి 67 వరకుగల పద్యాలు స్వామిని ఉపాలంభించిన పద్యాలు. నిజానికి, గండు తుమ్మెదలు తురకసైనికులను తరిమికొట్టిన సంఘటన ఈ శతకంలో లేదు. స్వామి ఏదో మహిమ చూపించి ప్రజలను రక్షించినట్లుగా "ఖల హిరణ్యాక్ష ముఖ్యులనెల్ల ఖండించి, దేవతాతతిఁబ్రోచు దివ్యమహిమ..." అనే 68 పద్యంలో కూర్మనాథకవి ధ్వనింపజేస్తున్నాడు. అంతే! ఈ పద్యానికి - దీని తరువాత వచ్చే "జయమాయె యవనరాట్ సంతమసము బాసె, భవదీయ భాస్వత్ ప్రభాబలమున..." అనే 69వ పద్యానికి మధ్యలో, తురకలను తుమ్మెదలు తరిమిన విషయాన్ని వర్ణిస్తూ "కారుణ్య దృష్టిచేఁగని మమ్ము రక్షింప, నీరజేక్షణ! నేఁడు నీవు పంప..." అనే సీసపద్యమూ, "అరులఁబరిమార్చి వైశాఖపురి సమీప, గిరిబిలంబున డాఁగె బంభరములెల్ల..." అనే తేటగీతి పద్యమూ (దీనిని "పద్యగీతము" అన్నారు పూర్వపరిష్కర్తలు - ఎందుకో నాకు అర్థంకాలేదు) కూర్మనాథకవికి తరువాతి కాలంలో వేరొక కవి రచించి, ఈ శతకంలో చేర్చి ఉంటాడనీ, కూర్మనాథకవి రచనాశైలికీ - ఈ పద్యాల రచనాశైలికీ చాలా భేదం ఉందనీ, 1962లో ఈ శతకాన్ని పరిష్కరించిన పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు అభిప్రాయపడ్డారు. ఈ తుమ్మెదల దాడి మాత్రం జనశ్రుతిలో బలంగా ఉంది.

**6**

ఈ సింహాద్రి నారసింహ శతకాన్ని మొట్టమొదట 1930లో విశాఖపట్టణం లోని "అందే కృష్ణమూర్తి అండ్ బ్రదర్స్" వారు "శ్రీ వరాహ లక్ష్మీ నారసింహ శతకము" అనే పేరుతో ప్రచురించారు. అదే సంవత్సరంలో విజయనగరంలోని "ఆర్.సంజీవరావు అండ్ సన్స్" వారు కూడా ఈ శతకాన్ని ముద్రించారు. ఈ రెండు పుస్తకాలలోను చాలా దోషాలున్నాయని భావించి, వీటిని విజయనగరంలోని

ప్రభుత్వ మహారాజ సంస్కృత కళాశాలలో ఆంధ్రభాషాశాఖాధ్యక్షులుగా ఉన్న పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారిచేత పరిష్కరింపజేసి, సింహాచల దేవస్థానం పరంగా 1962లో ప్రచురించినవారు – ఆనాటి Executive Officer గా ఉన్న దాట్ల లక్ష్మీనరసింహరాజుగారు. తిరిగి దీనిని దేవస్థానంవారు 1983లో పునర్ముద్రించారు. ఈ ప్రతిని నేను చూచాను. దీనిలో అడుగడుగునా తప్పులే! ఈ తప్పులన్నీ సవరించి, టీకాతాత్పర్య సహితంగా ఈ శతకాన్ని ముద్రించాలని నాకు కోరిక కలిగింది. సింహాచలానికి దగ్గరలో "చిట్టివలస"లో ఉన్న నా ప్రియమిత్రులు "మధురకవి" బిరుదాంకితులు శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారిని టీకాతాత్పర్యాలు వ్రాయమని కోరాను. వారు నిరంతరం "బహు కార్యభార మగ్నులు" గా ఉంటారు. పైగా వారి మనస్సు ఎల్లప్పుడూ కవితాసృష్టియందే లగ్నమై ఉంటుంది; ఇతర విధాల సాహిత్యంవైపు మళ్ళదు. ఏదో మహాకావ్య రచనలో నిమగ్నులై ఉన్నారట! అందువల్ల అయిదారు నెలల తర్వాత, ఈ శతకంలోని పద్యాలకు హడావిడిగా తాత్పర్యాలు మాత్రమే వ్రాసి పంపించారు. "ప్రతి పదార్థాలు వ్రాయాలంటే చాలా టైము పడుతుంది సారూ!" అన్నారు. పోనీ కొన్ని కఠినపదాలకైనా అర్థాలు వ్రాసి పంపమన్నాను. "కొన్ని పదాలకు" మాత్రం వ్రాసి పంపించారు. "మరికొన్నింటికి" నేనే వ్రాసుకున్నాను. మొత్తానికి ఒక రకంగా పనిపూర్తి అయింది. తనకు చిక్కిన స్వల్పవ్యవధిలో నాకు ఈ సహాయం చేసిపెట్టిన "కవివతంస" శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారికి మిక్కిలి కృతజ్ఞుడను.

వృత్తపద్యాలతోకూడిన శతకాలకు (దాశరథి శతకము, శ్రీకాళహస్తీశ్వర శతకము మొదలైన వాటికి) మాత్రమే ప్రతిపదార్థ తాత్పర్య రచన చేస్తారుకాని, సీసపద్య శతకాలకు ఎవరూ చేయరని శ్రీ బులుసువారు ఒక సందేహాన్ని వెలిబుచ్చారు. నాకు తెలిసి, అలాంటి నియమం ఏమీ లేదు. కవితారచన కఠినంగా ఉంటే, సీసపద్యశతకాలకు కూడా ప్రతిపదార్థ తాత్పర్యరచన, విశేషాంశాల వివరణ చేయవలసిందే! ఉదాహరణానికి – హైదరాబాదులోని "పావని సేవా సమితి" వారు (శ్రీ చల్లా సాంబిరెడ్డిగారు) శేషప్పకవి వ్రాసిన సీసపద్య శతకమైన "శ్రీ నరసింహ శతకానికి" (అదికూడా "నరసింహ శతకమే") డా॥ కొసిరెడ్డి వెంకటపతిరెడ్డి గారిచేత "జనప్రియవ్యాఖ్య" పేరుతో టీకాతాత్పర్యాలు, విశేషాంశాలు వ్రాయించి ప్రచురించారు (తృతీయ ముద్రణ 2012). నా కవిమిత్రులు, భీమవరం కళాశాలలో నా సహాధ్యాయులు అయిన కీ.శే. శనగన నరసింహస్వామిగారు (బెజవాడ

ఆంధ్ర లయోలా కళాశాలలో తెలుగు శాఖాధ్యక్షులుగా పనిచేసినవారు) కాసుల పురుషోత్తమకవి రచించిన ఆంధ్రనాయక శతకానికి (సీసపద్య శతకానికి) ప్రతిపదార్థాలు, తాత్పర్యాలు, విశేషాంశాలు వ్రాసి ప్రచురించారు (శ్రీసత్యసాయి పబ్లిషర్స్, విజయవాడ, 1996). కాబట్టి బులుసువారు వెలిబుచ్చిన సందేహం తర్కానికి నిలబడదు. వారికి వ్యవధిలేక ప్రతిపదార్థాలు, విశేషాంశాలు, వ్రాయలేకపోయారు – అన్నది మాత్రం సత్యం. వారి పరిస్థితిని నేను అర్థం చేసుకున్నాను. ఇంతెందుకు? ఈ బులుసు వేంకటేశ్వర్లుగారే, దాసరి లక్ష్మణస్వామిగారు సంకలనంచేసిన వర్ణన రత్నాకరం–ఆరవ సంపుటంలో, ఎన్నో సీసపద్యాలకు ప్రతిపదార్థ తాత్పర్యాలు వ్రాశారు కదా!

ఈ శతకంలోని పద్యాలు తాత్పర్యరచనతో సరిపెట్టదగినంత సులభమైన పద్యాలు కావు. నూటికి 60–70 శాతం పద్యాలు కష్టంగానే ఉన్నాయి. ఎన్నో ఉర్దూ పదాలున్నాయి. "తేనమో! రక్షిత దేవతాయ, సురేంద్ర సేవితాయ" అనే 73వ పద్యం పూర్తిగా సంస్కృతంలోనే వ్రాయబడింది. "మనువంశ భూషణ మహిచేఁ జెన్నొంది, ఘనకళాసాంగత్య కలనఁజెంది"అనే 83వ పద్యంలో "రామునికి"–"ఇంద్రనీలమణి"కి "ప్రకృతాప్రకృతశ్లేష" పాటింపబడింది. దీనిని విడమరిచి వ్రాయవలసి ఉంది. "అతి తిగ్మరుచి మండలాక్షియుగ్మచ్ఛాయ, వలయాద్రి దావాగ్నివలె వెలుంగ" అనే 79వ పద్యం (వరాహావతార వర్ణన); "నతిఁజేతు నిదె నీకు నాసికా నిస్సృత ఝుంఝూనిలోద్ధూత శైలజాత" అనే 80వ పద్యం (నరసింహావతారవర్ణన) – మొదలైన కొన్ని పద్యాలు తత్సమపదభూయిష్ఠ సమాస రచనతో కూడి క్లిష్టంగా ఉన్నాయి. కాబట్టి ఈ శతకాన్ని టీకాతాత్పర్య సహితంగా ప్రచురించడమే మంచిది. నా వల్ల కాలేదు. భవిష్యత్కాలంలో ఎవరైనా పండితులు ఈ పని చేయుదురుగాక! భవతు!

ఈ శతకంలో మరీ కష్టంగా ఉన్న 73, 79 పద్యాలకు నా పండిత మిత్రులు డా॥ కొడిమడుగు నాగేశ్వరశాస్త్రిగారు (లేపాక్షి ప్రాచ్యకళాశాలకు ప్రిన్సిపాల్‌గా పనిచేసినవారు) ప్రతిపదార్థ తాత్పర్యాలు వ్రాసి యిచ్చారు. వారికి నా ధన్యవాదాలు. 80వ పద్యానికి నేను వ్రాసుకున్నాను. 83వ పద్యంలో ఉన్న శ్లేషను నేనే వివరించాను. అయినా ఈ నాలుగు పద్యాలలోను కొన్ని పదాలకు, పాదాలకు అన్వయం కుదరడం లేదు. ఆ మధ్య, ఏదో పనిమీద మా యింటికి వచ్చిన ప్రాణమిత్రులు ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారికి వీటిని చూపించాను. ఒక

పూట అంతా వీటితో "కుస్తీపట్టి" ఈ నాలుగు పద్యాలను సరిచేసి, అన్వయక్లిష్టతను తొలగించారు. అంతేకాదు, మొత్తం శతకంలోని ప్రతిఅక్షరమూ సరిచూచి, సంస్కరించి యిచ్చారు. పండిత ప్రకాండులు, కవిశేఖరులు, పరిశోధకులు అయిన ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారికి నా మనఃపూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

ఈ శతకం చివర మొదటి అనుబంధంగా ఉన్న శ్రీ లక్ష్మీనృసింహ కరావలంబస్తోత్రానికి తాత్పర్యరచన చేసిన నా పండిత మిత్రులు శ్రీ కాశీభొట్ల సత్యనారాయణగారిని అభినందిస్తున్నాను. వీరుకూడా, శ్రీబులుసువారిలాగే, టీకాతాత్పర్యాలు వ్రాయమంటే, తాత్పర్యాలు మాత్రమే వ్రాసి ఊరుకున్నారు! మిత్రులు శ్రీమల్లాప్రగడవారు చెప్పినట్లుగా, కవిపండితులందరూ ఎవరి పనిలో వారు ఎల్లప్పుడూ busyగా ఉంటారు; మనం చెప్పిన పనులు చేయడానికి వారికి తీరిక ఉండదు కదా!

**7**

పాతికేళ్ళ క్రిందట, భావనామసంవత్సరం ఉగాదినాడు, అంటే 11.4.1994 నాడు, నేను "శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య" ("శ్రీరస") అనే సాహిత్యసంస్థను స్థాపించి, ఈనాటివరకు నిర్విఘ్నంగా కొనసాగిస్తున్నాను. కొన్ని వందల సాహిత్య సభలు ఏర్పాటు చేశాను. నెలనెలా కనీసం మూడు ఉపన్యాసాలు ఉంటాయి. వీటికి "నెలనెలా వెన్నెల" అని పేరు. ఆంధ్రదేశంలో మిక్కిలి ప్రసిద్ధులైన ఎందరో కవులు, పండితులు, ఆచార్యులు మా సంస్థలో ప్రవచనాలు చేశారు. రామాయణం, భారతం, భాగవతం, కావ్యాలు, ప్రబంధాలు, సౌందర్యలహరి, శివానందలహరి, భగవద్గీత, ఆధునిక కవిత్వం – మొదలైన వాటినిగురించి ప్రముఖులు ప్రసంగాలు చేశారు. శేషేంద్ర, ఆవంత్స సోమసుందర్, పఠాభి, ఇస్మాయిల్, ప్రొ॥ శలాక రఘునాథశర్మ, ప్రొ॥ బేతవోలు రామబ్రహ్మం, డా॥ మైలవరపు శ్రీనివాసరావు, శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి, శ్రీవద్దిపర్తి పద్మాకర్, డా॥ గరికిపాటి నరసింహారావు, డా॥ ప్రసాదరాయ కులపతి, ప్రొ॥ ఆర్వీయస్. సుందరం, డా॥ అద్దేపల్లి రామమోహనరావు, డా॥ అక్కిరాజు సుందరరామకృష్ణ, ప్రొ॥ ముదిగొండ వీరభద్రయ్య, శ్రీ నాగళ్ళ గురుప్రసాదరావు, ప్రొ॥ కోలవెన్ను మలయవాసిని, ప్రొ॥ సి.మృణాళిని, ప్రొ॥ కాత్యాయనీ విద్మహే, ప్రొ॥ ఎల్.బి. శంకరరావు, ప్రొ॥ దేవళ్ళ చిన్నికృష్ణయ్య, ప్రొ॥ వేటూరి ఆనందమూర్తి, శ్రీ నగ్నముని, ప్రొ॥ ఎండ్లూరి సుధాకర్, ప్రొ॥ శిఖామణి, శ్రీ రెంటాల శ్రీవెంకటేశ్వరరావు,

డా॥ మీగడ రామలింగస్వామి, ప్రొ॥ ఆర్. శేషశాస్త్రి, డా॥ జోస్యుల సదానందశాస్త్రి, శ్రీ అంపశయ్య నవీన్ మొదలైన హేమాహేమీలు "శ్రీరస"లో ఉపన్యసించి, బెంగుళూరులోని తెలుగువారిని ఆనందపరవశుల్ని చేశారు. అష్టావధానాలు, భువనవిజయ సభలు, ఇంద్రసభ, మహాభారతంపై తీర్పు–ఇత్యాది సాహిత్య రూపకాలు కూడా మా 'శ్రీరస'లో నిర్వహించాము. ఇదంతా నా గొప్పతనం కాదు. నాకు ఆర్థికంగాను, హార్దికంగాను సహకరిస్తున్న "శ్రీరస" పోషక సభ్యులు, వార్షిక సభ్యులు, కార్యవర్గ సభ్యులు–వీరి గొప్పతనం. 25 సంవత్సరాలుగా నాకు సహాయం చేస్తున్న ఈ "శ్రీరస" సభ్యుల ఋణాన్ని కొంతలో కొంత తీర్చుకుందామని, శ్రీసింహాద్రి నారసింహ శతకాన్ని తాత్పర్యసహితంగా ప్రచురించి, వారికి అంకితం చేస్తున్నాను. "శ్రీరస" సభ్యులను, వారి కుటుంబ సభ్యులను, సింహాచల పుణ్యక్షేత్రంలో వెలసియున్న శ్రీ వరాహ లక్ష్మీనరసింహస్వామివారు ఆయురారోగ్య సంపత్ పరంపరాభివృద్ధిగా ఆశీర్వదించి, ఎల్లవేళలా కాపాడుచుండుగాక!

**8**

రాయలసీమలో, కర్నూలు – కడప జిల్లాలలో "కుందునది" ("కుందేరు" లేకు "కుయుద్వతీ నది") ప్రవహించే ప్రాంతాన్ని "రేనాడు" అంటారు. ఈ రేనాటి సీమలో క్రీ.శ. 19వ శతాబ్దిలో ఇద్దరు మహావీరులు ఉండేవారు. ఒకరు యుద్ధవీరుడు–ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధుడు అయిన ఉయ్యాలవాడ నరసింహారెడ్డిగారు (విప్లవకాలం: 1945–47; వీరమరణం: 22–02–1847). రెండవవారు దానవీరుడు బుడ్డా వెంగళరెడ్డిగారు (1822–1900). ఇద్దరూ ఉయ్యాలవాడ గ్రామస్థులే. నేను 1965–66 సంవత్సరాలలో రేనాటిసీమలో పర్యటించి, యీ యిద్దరు వీరులను గురించి పరిశోధన చేసి, అనేక జానపద గేయాలు, వీరగాథలు, కథలు సేకరించాను. 1999లో "రేనాటి సూర్యచంద్రులు" అనే పేరుతో 600 పుటల పెద్ద గ్రంథాన్ని వెలువరించాను. నా ప్రియమిత్రులు ముక్కమళ్ళ నారాయణరెడ్డిగారు, బసిరెడ్డి శ్రీనివాసులురెడ్డి కలిసి 1998 నుండి కోవెలకుంట్లలో ప్రతిసంవత్సరం క్రమంతప్పకుండా ఫిబ్రవరి 22వ తేదీని ఉయ్యాలవాడ నరసింహారెడ్డిగారి వర్ధంతిని జరుపుతూ వచ్చారు. తరువాత 2009లో నారాయణరెడ్డిగారు, బుడ్డా వెంగళరెడ్డిగారి వంశస్థులైన శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డిగారు ("భారతీ సీడ్స్" అధినేత, నంద్యాల) కలిసి, ఉయ్యాలవాడలో "రేనాటి సూర్యచంద్రుల స్మారక సమితి"ని స్థాపించారు. ఈ సంస్థ ఉయ్యాలవాడ,

కోవెలకుంట్ల, నంద్యాల మున్నగుచోట్ల నారసింహారెడ్డిగారి వర్ధంతిని ప్రతిసంవత్సరమూ ఫిబ్రవరి 22వ తేదీని జరుపుతూనే ఉంది. 1998-2018 మధ్య, గత 20 ఏండ్లలో జరిగిన ఇంచుమించు ప్రతి వర్ధంతిసభకూ నేను బెంగుళూరునుండి వెడుతూనే ఉన్నాను. గత 22-02-2018 నాడు నంద్యాలలో జరిగిన నారసింహారెడ్డిగారి 171వ వర్ధంతి సభలో నేను పాల్గొన్నాను. అప్పుడు "రేనాటి సూర్యచంద్రుల స్మారక సమితి" వ్యవస్థాపక అధ్యక్షులైన శ్రీ పోచాబ్రహ్మానందరెడ్డిగారు నన్ను నూతన వస్త్రాలతోను, దుశ్శాలువలతోను ఘనంగా సత్కరించి, నాకు రూ.50,000/- లు బహూకరించారు. రేనాటి సూర్యచంద్రులను గురించి మొట్టమొదటిసారిగా పరిశోధన చేసి, లోకానికి తెలియజేసిన నన్ను గుర్తించి, బ్రహ్మాండంగా సత్కరించిన ప్రియమిత్రులు ఉదారస్వభావులు, పరోపకార పరాయణులు శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డిగారికి, ఆ సన్మానసభను నిర్వహించిన రెడ్డిగారి గురువర్యులు ప్రొ॥ కె. రవీంద్రనాథ్‌గారికి నా కృతజ్ఞతాపూర్వక అభినందనలు తెలియజేస్తున్నాను. ఆనాడు శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు నాకు బహూకరించిన "రేనాటి సూర్యచంద్రుల పురస్కారధనం"తో ఈ శతకాన్ని ముద్రిస్తున్నాను.

30-03-2008 నాడు నాకు 73 సంవత్సరాలు నిండాయి. ఆనాడు మా "శ్రీరస" వ్యవస్థాపక కార్యదర్శియయిన ప్రముఖ రచయిత్రి శ్రీమతి అంబికా అనంత్ (శ్రీలలితాంబిక) గారు మా ఇంటికి వచ్చి, నాకు బట్టలుపెట్టి, 10 వేల రూపాయలు బహూకరించారు. ఆ ధనాన్నికూడా ఈ శతక ముద్రణకు ఉపయోగించాను. చి.సౌ.శ్రీలలితాంబికగారికి నా అనంతమైన ఆశీస్సులు!

2015 నుండి 2018 వరకు ద్రావిడ విశ్వవిద్యాలయం వైస్-ఛాన్సలర్‌గా పనిచేసిన మాన్యమహోదయులు ప్రొ॥ ఈడిగ సత్యనారాయణగారు విశిష్టమైన వ్యక్తిత్వం కలవారు. కవి పండిత పక్షపాతి. గొప్ప సాహిత్యాభిరుచి కలవారు. నిగర్వి. సౌజన్యశీలి. విశ్వవిద్యాలయ ప్రచురణల కేంద్రంద్వారా ఎన్నో మంచి మంచి గ్రంథాలను ముద్రించి వెలుగులోకి తెచ్చారు. నేను సంకలనం చేసిన "వీరగల్లు" అనే ప్రసిద్ధ వీరగాథలను, మా అన్నగారు శ్రీ టి.వి.కె. సోమయాజులుగారు రచించిన "జ్ఞానతరంగాలు" - "భగవద్గీతా ప్రబోధము" అనే ఉత్తమ గ్రంథాలను, మిక్కిలి ఉదార హృదయంతో విశ్వవిద్యాలయ పరంగా ముద్రించారు. వారికి నేను ఎంతో ఋణపడి ఉన్నాను. వారికి, వారి కుటుంబ

సభ్యులకు, పరమేశ్వరుడు – శ్రీ వరాహలక్ష్మీనరసింహస్వామివారు ఆయురారోగ్య సంపత్పరంపరాభి వృద్ధిని ప్రసాదించుగాక!

నా జీవనయానంలో నాకు సంభవించిన కష్టసుఖాలలో మా అన్నదమ్ములు నాకు మిక్కిలిగా సహకరిస్తున్నారు. మా అన్నయ్య "భాషాప్రవీణ" శ్రీ టి.వి.కె. సోమయాజులుగారి (శ్రీ తంగిరాల వేంకట కృష్ణసోమయాజులుగారి) పాదపద్మములకు నా వినమ్ర ప్రణామాంజలి! చిరంజీవి "బాచితమ్ముడు"–శ్రీ తంగిరాల భాస్కరరావుకు, చిరంజీవి "బుల్లితమ్ముడు"–కర్నల్ తంగిరాల కృష్ణమూర్తికి నా అనంతమైన ఆశీస్సులు!

30–03–2015నాడు నాకు 80 సంవత్సరాలు నిండాయి ("అశీతిపూర్తి"). ఆనాడు మా చిరంజీవులు ఐదుగురు (కాళి–రాము–సీత–శీను–శశి) కలిసి, నాకు రూ. 80,000/–లు బహూకరించారు. వారికి నా యెడలగల పితృభక్తికి మిక్కిలి చలించిపోయాను! (ఆ ధనంతో త్వరలో మరొక ఉత్తమగ్రంథాన్ని ముద్రించ బోతున్నాను). మా చిరంజీవులందరికీ – వారి కుటుంబ సభ్యులకూ నా మంగళాశాసనము!

ఇక్కడ ఒక ముఖ్యవిషయం చెప్పాలి. పూర్వం మా బ్రాహ్మణ కుటుంబాలలో పురుషులు వేదాలు, శాస్త్రాలు కూలంకషంగా చదువుకున్నా, స్త్రీలుమాత్రం అవిద్యావంతులుగా మిగిలిపోయి, భక్తితోను, పూజాపునస్కారాలతోను, మూఢాచారాలతోను, అజ్ఞానాంధకారంలో మునిగి ఉండేవారు. పైగా బాల్యవివాహాలు (రజస్వల కాకుండా ఉన్న 7–8 ఏండ్ల బాలికలకు పెండ్లిండ్లు) జరిగేవి. కుటుంబ నియంత్రణ ఉండేది కాదు. అధిక సంతానంతో బాధపడుతూ ఉండేవారు. మా అమ్మమ్మ, నాయనమ్మ; మా అమ్మ, మా పినతల్లులు, మేనత్తలు, మా అక్కయ్యలు, మా ఆవిడ – వీరి విద్య ప్రాథమిక పాఠశాల స్థాయిని దాటలేదు. ఈ నవీన తరంలో మా కూతుళ్ళు, మనుమరాండ్రు, బాగా చదువుకొని, పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తున్నారు. మా పెద్దబ్బాయి కూతురు చి॥ సౌ॥ ప్రత్యూష న్యూజిలాండ్‌లో మెడిసిన్ చదివి, అక్కడే డాక్టరుగా పనిచేస్తోంది. మా రెండవ అబ్బాయి పెద్దకూతురు చి॥ సౌ॥ శిల్ప అమెరికాలోను, రెండవ కూతురు చి॥ సౌ॥ భావన హైదరాబాదులోను పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తున్నారు. మా మూడవ అబ్బాయి కూతురు చి॥ వైజయంతి బి.ఇ. (ఆర్కిటెక్చర్) చేసింది. మా రెండవ అమ్మాయి డా॥ శశిప్రియ ఇంగ్లీషులో పిహెచ్.డి. చేసింది. ఆమె కూతురు

చి॥ రసజ్ఞ కూడా బి.ఇ. (ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్) చదివి, టెక్‌మహీంద్రాలో ఉద్యోగం చేస్తోంది. ఇది మా కుటుంబంలోని మహిళల ప్రగతి. వీరందరికీ నా అనంతమైన ఆశీస్సులు!

మరొక అత్యంత ప్రధానమైన అంశం – మా "బుల్లితమ్ముడు" కర్నల్ కృష్ణమూర్తి కూతురు డా॥ హిమశ్రీ ఎం.బి.బి.ఎస్., ఎం.డి.లు చేసి, ఆర్మీలో నిన్న మొన్నటి వరకూ "కర్నల్"గా ఉండి, ఇటీవలనే "బ్రిగేడియర్" అయింది. ఇది మా తంగిరాల సోదరుల కుటుంబాలవారికందరికీ గర్వకారణమైన విషయం. చి॥సౌ॥ డా॥ హిమశ్రీకి నా ఆశీఃపూర్వక అభినందనలు!

శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డిగారిని – వారి కుటుంబ సభ్యులను; ప్రొ॥ కె. రవీంద్రనాథ్‌గారిని – వారి కుటుంబ సభ్యులను; శ్రీమతి అంబికా అనంతగారిని – వారి కుటుంబసభ్యులను; ప్రొ॥ ఈడిగ సత్యానారాయణగారిని – వారి కుటుంబ సభ్యులను; మా అన్నదమ్ములను – వారి కుటుంబసభ్యులను; మా చిరంజీవులు "కాళిదాసు (సుబ్బావధానులు) – సీతారామరాజు – సీతామహాలక్ష్మి – శ్రీనాథకవిసార్వభౌమ – రేవతీ శశిప్రియ"లను – వారి కుటుంబ సభ్యులను; శ్రీసింహాచల వరాహలక్ష్మీనరసింహస్వామివారు తన దివ్యమైన ఆశీస్సులతో నిరంతరమూ రక్షించుగాక!

"సీతావధానం" — **– తంగిరాల వెంకట సుబ్బారావు**
బెంగుళూరు — విళంబినామ సంవత్సర అక్షయ తృతీయ
18-04-2018. — స్వామివారి చందనోత్సవము.

**ఆత్మశాంతి నీకు అగునుగాక!**

2018 ఆగస్టు 19వ తేదీ ఆదివారంనాడు మా రెండవ అబ్బాయి డా॥ తంగిరాల సీతారామరాజు స్వర్గస్థుడైనాడని తెలుపుటకు మిక్కిలి చింతిస్తున్నాను... వాని ఆత్మకు శ్రీ వరాహలక్ష్మీనరసింహస్వామివారు పరమశాంతిని ప్రసాదించుగాక!

బెంగుళూరు — **– తంగిరాల వెంకట సుబ్బారావు**
18-10-2018
విళంబి విజయదశమి.

## "శ్రీరస" ట్రస్టు (రి.)

# శ్రీ సింహాద్రి నారసింహ శతకము

**సీ॥ శ్రీమద్రమారమణీమణీ రమణీయ**
**సరస చిత్తాబ్జ బంభర ! పరాకు!**
**శంఖ చక్ర గదాసి శార్ఙ్గ చాపాది భా**
**సుర దివ్యసాధనకర ! పరాకు!**
**ప్రహ్లాద నారద వ్యాస శుకాదిక**
**భక్త సంరక్షణపర ! పరాకు!**
**బహుతర బ్రహ్మాండభాండ పరంపరా**
**భరణ లీలాధురంధర ! పరాకు!**

**తే॥ నీకు సాష్టాంగ వినతు లనేక గతులఁ**
**జేసి, విన్నప మొనరింతుఁ జిత్తగింపు,**
**చెనఁటి వీఁడని మదిలోనఁ గినుక మాని,**
**వైరిహరరంహా! సింహాద్రి నారసింహా! 1**

[*]**అర్థములు:-** (శ్రీమత్ + రమా-రమణీ-మణీ) శ్రీమత్ = ఐశ్వరముతో కూడిన; రమణీ = మనోహరమైన; మణీ = శ్రేష్ఠురాలైన; రమా=లక్ష్మీదేవియొక్క; రమణీయ = ఒప్పిదమైన; సరస= అనురాగముతోకూడిన; చిత్త+అబ్జ= మనస్సు అనెడి పద్మమునకు; బంభర = తుమ్మెద అయినవాడా! పరాకు=ప్రమాదము, హెచ్చరిక; సాధనము=ఆయుధము; చెనఁటి = కుత్సితుడు; వైరి-హర-రంహా! - వైరి = శత్రువులను, హర = హరించుటయందు (సంహరించుటయందు), రంహ = వేగపడువాడా! (త్వరపడువాడా!) రంహస్సు=వేగము, వడి.

**భావము:-** శత్రువులను వేగముగా (వెంటనే) సంహరించువాడా! సింహాచలమున వెలసిన ఓ నరసింహస్వామీ!! లక్ష్మీదేవి హృదయపద్మమునకు తుమ్మెదవంటివాడా!

---

[*] ఇచ్చట "అర్థములు" అనగా "కఠినపదములకు అర్థములు" అని మాత్రమే గ్రహింపవలెను. ఇవి "ప్రతిపదార్థములు" కావు. 73, 79, 80, 83 అను సంఖ్యగల నాలుగు పద్యములకు తప్ప, తక్కిన పద్యములన్నింటికిని ఇది వర్తించును. పాఠకులు గమనింప ప్రార్థన - సంపాదకుడు.

నీకు పరాకు! శంఖ చక్ర గద ఖడ్గ ధనుస్సు మొదలైన తళతళ మెరయు గొప్ప ఆయుధములు ధరించినవాడా! నీకు పరాకు! ప్రహ్లాదుడు, నారదుడు, వ్యాసుడు, శ్రీశుకుడు మొదలగు భక్తులను రక్షించినవాడా! నీకు పరాకు!! అనేకమైన బ్రహ్మాండభాండ పంక్తులను లీలగా ధరించినవాడా! నీకు పరాకు! నీకు అనేక సాష్టాంగ నమస్కారములు చేసి విన్నపము చేయుచున్నాను. మనస్సులో కోపము పూనక చిత్తగింపుము స్వామీ!!

**సీ॥ "అవధారు దేవ! చిత్తావధానతఁగొను,**
**వనజజాదులు సేయు వందనములు;**
**సెలవె రాత్రిందివ స్థితిగతుల్దెలుపఁగా**
**సోమ పద్మాప్తు లిచ్చో నిలిచిరి!**
**మందారతరుసూన మాల్యముల్గొని యింద్రుఁ**
**దేతెంచె నిందుల కేమియాజ్ఞ?**
**గంధర్వ కిన్నరు ల్కరగత వీణులై**
**తడవాయె వచ్చిరి దర్శనేచ్ఛ."**

**తే॥ అనుచు జయవిజయులు దెల్ప "హాయి" యనుచు**
**నిందిరనుగూడి యుంటి వీ "వింటికన్న**
**గుడి పదిలమంచు" యవనులఁ గొట్టవయ్య**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 2**

**అర్థములు:–** అవధారు = వినుము; చిత్త+అవధానతన్+కొనుము = నీ మనస్సును (మేము చెప్పెడి విషయములపై) లగ్నము చేయుము; వనజ–జ+ఆదులు = బ్రహ్మ మొదలగువారు; (వనజ=పద్మము, వనజజ=పద్మమునుండి పుట్టినవాడు–బ్రహ్మ); సోమ–పద్మాప్తులు=చంద్రసూర్యులు (పద్మ+ఆప్తుడు = తామరపూలకు ఇష్టమైనవాడు – సూర్యుడు); మాల్యములు=దండలు; తడవు = ఆలస్యము; 'ఇంటి కన్న గుడి పదిలము' – సామెత.

**భావము:–** శత్రువులను శీఘ్రముగా సంహరించువాడా! ఓ సింహాచల నారసింహస్వామీ! "దేవా! బ్రహ్మాదులు నీకు వందనములు చేయ వచ్చిరి! సూర్యచంద్రులు పగటి రాత్రి విశేషములు తెల్పగా వచ్చియున్నారు. కల్పతరు మందార

పుష్పమాలికలు పూని, ఇంద్రుడు నిన్ను పూజించుటకు సిద్ధముగా నున్నాడు. వీణలు చేతబట్టుకొని గంధర్వకిన్నరులు నీ దర్శనమునకై వేచియున్నారు"-అని జయవిజయులు తెల్పుచుండగా, హాయిగా 'ఇంటికన్న గుడిపదిల'మన్నట్లు శ్రీలక్ష్మితో నున్నావు. నీ ఆలయముపైకి దండెత్తవచ్చిన యవనులను పాఱద్రోలవయ్యా!!

**సీ॥ చటుల సోమకహర స్ఫుటతరాటోపంబు**
**కుంభినీభరణ విజృంభణంబు**
**ఖల హిరణ్యాక్ష శిక్షణ రూక్ష దక్షత**
**క్షుభిత హిరణ్య వక్షోభిదాత్మ**
**బలి మహావైభవ భంజన మహిమంబు**
**నుర్వీశ గర్వాంతకోర్వతిశయ**
**మతిదుష్ట దశకంఠ హరణ బాహాశక్తి**
**ప్రబల ప్రలంబ దారణ విధంబు**

**తే॥ పురవధూ వ్రతభంగ విస్ఫురణ సరణి**
**భువనములఁ బ్రోవఁ గావించి; జవన యవన**
**సేన నణఁచుట కిటు జాగుఁ జేయఁదగునె?**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 3**

**అర్థములు:-** చటుల=మెఱపువలె చలించునట్టి; స్ఫుటతర=మిక్కిలి స్పష్టమైన; ఆటోపము=పరాక్రమము; కుంభిని=భూమి, నేల; ఖల=దుర్మార్గుడైన; రూక్ష= కర్కశమైన; క్షుభిత+హిరణ్యవక్షస్+భిద+ఆత్మ!= కలతపెట్టబడిన-హిరణ్యకశిపుని ఱొమ్మును-చీల్చుటయందు-బుద్ధికలవాడా!; భంజనము= చెడగొట్టుట; ఉర్వీశ (ఉర్వి+ఈశ)+గర్వ+అంతక+ఉరు+అతిశయ! = రాజుల - గర్వమును - అణచుట యందు - గొప్ప - ఆధిక్యము కలవాడా!; దారణ=చీల్చుట; జవన = వడిగల గుఱ్ఱములు కలిగిన; యవనసేన=తురకలసైన్యము.

**భావము:-** శత్రువులను వడిగా కూల్చువాడా! ఓ సింహాచల నారసింహప్రభూ! మెఱపువలె చలించెడి మత్స్యావతారములో సోమకాసురుని వేగముగా సంహరించితివి. వరహావతారములో (నీకోరలపై) భూమిని భరించి విజృంభించితవి. దుర్మార్గుడైన హిరణ్యాక్షుని శిక్షించుటలో కర్కశమైన దక్షతను చూపించితివి. నరసింహావతారములో

హిరణ్యకశిపుని గుండెలు చీల్చితివి. వామనావతారములో బలిచక్రవర్తి మహావైభవమును చెడగొట్టితివి. పరశురామావతారములో రాజులగర్వమును అణచివైచితివి. రామావతారములో నీ బాహుశక్తితో మిక్కిలి దుష్టుడైన రావణుని సంహరించితివి. బలరామావతారములో ప్రలంబాసురిని చీల్చివైచితివి. బుద్ధావతారములో దుర్మార్గుడైన రాక్షసుని సంహరించుటకు ఆతని భార్యలు చేయువ్రతమును భగ్నము కావించి లోకములను రక్షించితివి. అప్పటి ఆ శౌర్యము, ఆ వేగము, ఆ శక్తి, ఆ నైపుణ్యము, ఆ బుద్ధి, ఆ గొప్పతనము, ఆ గర్వము - ఇప్పుడేమయినవి? తురుష్క సైన్యమును అణుచుటకు ఏల జాగుసేయుచుంటివి?

**సీ॥ మొఱవోయెనో వక్రముఖ నక్రహర మహా**
**సంపర్క నిర్వక్ర చక్రధార?**
**వాడిదప్పెనో హతోద్భాసి సుమాలి మ**
**హాసుర శార్‌ఙ్గ బాణాసనంబు?**
**పదనువాసెనొ మధుప్రముఖేంద్ర రిపురాజ**
**బృందాంతకారక నందకంబు?**
**కడిమిఁదప్పెనొ సౌంభక మథన ప్రధాన**
**చండమై తగు గదాదండ పటిమ?**

**తే॥ జబ్బుపడియుంటివేల మాయబ్బ! యొక్క**
**దెబ్బతీయక తురకల యుబ్బు చెడదు!**
**గొబ్బునఁ జెలంగు మిఁకనైన నిబ్బరముగ!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 4**

**అర్థములు:-** నక్రహర=మొసలిని చంపిన; నిర్వక్రము=అడ్డులేని; హత+ఉత్+భాసి = చంపుటవలన మిక్కిలిగా ప్రకాశించిన; శార్‌ఙ్గ బాణాసనము='శార్‌ఙ్గ' మను పేరుగల ధనుస్సు; రిపురాజ-బృంద+అంత-కారకము=శత్రురాజుల - సమూహమును - చంపుటకు - కారణమైన; కడిమి=పరాక్రమము; చండము=తీవ్రము; పటిమ=నేర్పు (శక్తి); నిబ్బరముగ = అధికముగ (ధైర్యముగా).

**భావము:-** ఓ! సింహాచల నారసింహస్వామీ! గజేంద్రుని రక్షించినపుడు మొసలిని ఖండించిన నీ చక్రం ఇప్పుడు పదను పోయిందా? సుమాలి అను రాక్షసుని

సంహరించిన నీ శార్ఙ్గమను ధనుస్సు వాడితప్పినదా? మధువు అను రాక్షసుని నరికి చంపిన నీ నందకమను పేరుగల ఖడ్గము పదను తగ్గినదా? సౌంభకుణ్ణి మొత్తి స్వర్గానికంపిన నీ కౌమోదకి అను గద ఇప్పుడు పనికిరానిదయ్యెనా? ఎందులకయ్యా ఇట్లు మౌనంగా ఉన్నావు? ఒక్క దెబ్బ తీసినకానీ తురకల ఔద్ధత్యం తగ్గదు. ఇప్పటికైనా ధైర్యముగా లెమ్ము!!

**సీ॥ చుట్టబెట్టెను మహారట్టజంబులతోడ**
**నిఖిల రాజ్యము పఠానీల ఫౌజు**
**మట్టిమల్లాడెను మదసామజంబులఁ**
**బురజన పదములు తురకబలము**
**కొట్టి కొల్లలువెట్టె గురు విప్ర మానినీ**
**ఘనగోగణంబుల ఖానసమితి**
**పట్టిపల్లార్చెను బహుదుర్గ వర్గముల్**
**సరభ సౌద్ధత్య పాశ్చాత్యచయము**

**తే॥ మించి భూస్థలి నిటు లాక్రమించి రాగ**
**నలుకరాదేమి నగరివారలను దోఁచఁ**
**బొంచియుంటివి యవనులఁ ద్రుంచుమిఁకను**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 5**

**అర్థములు:–** ఆరట్టజము = పశ్చిమదేశము; ఫౌజు = సేన; జనపదములు = గ్రామములు; మానిని = స్త్రీ; ఔద్ధత్యము = చెలరేగుట.

**భావము:–** ఓ! సింహాచల నారసింహస్వామీ! ఇప్పటికే దేశమున ఉత్తర పశ్చిమముల యందు పఠానుల సేనలు చుట్టిముట్టియున్నవి. తురకసేనలు దేశరాజుల గజబలమును బంధించినవి. ఖానుసైన్యము గురువులను, బ్రాహ్మణులను, స్త్రీలను, గోగణములను కొల్లకొట్టుచున్నారు (దోచుకొనుచున్నారు). పాశ్చాత్యసేనలు అనేక కోటలను ఆక్రమించుకొనియున్నవి. ఈ విధముగా దేశమును శత్రువులు ఆక్రమించుకొనుచుండగా నీకు కోపము రాకుండుటకు కారణమేమి? ఇకనైనను దాగికొనుట మాని, యవనులను సంహరింపుమయ్యా!

సీ॥ మొగిసి రక్కసుని బొందుగఁ జించు నీ గోళ్లు
చిటిలెనో సిరికుచశిఖరిఁ దాఁకి!
యరులపై భగభగలాడు కోపజ్వాల
లారెనో శ్రీకటాక్షామృతమునఁ!
బరవీర గర్భముల్పగిలించు బొబ్బ ప
ల్కదొ రమానంద గద్గదికచేత!
ఖలుల దండింపఁగాఁ గఠినమౌ నీ గుండె
కరఁగెనో శ్రీలక్ష్మి సరసకేళి!

తే॥ నహహ! నీ భీకరోద్వృత్తి నల్చులనక
యవనరాజుల నడఁచి వ్రేయంగవలయు!
పిన్నపామునకైనను పెద్దదెబ్బ!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 6

**అర్థములు:–** మొగియు = పూను, కవియు; కుచశిఖరి = ఎత్తైన పాలిండ్లు; శ్రీ–కటాక్ష + అమృతము=లక్ష్మీదేవి చూపులనెడి అమృతము; పరవీరులు=శత్రువీరులు; అలుచులు = దుర్బలులు, నీచులు.

**భావము:–** ఓ సింహాచల నారసింహస్వామీ! హిరణ్యకశిపుని గుండె చీల్చిన నీ గోళ్లు – లక్ష్మీదేవి కఠినకుచములను తాకుటచే చిట్లిపోయినవా? శత్రువులపై భగభగలాడు నీ కోపజ్వాల – లక్ష్మీకటాక్షములనెడి అమృతముచేత ఆరిపోయినదా? శత్రువుల కడుపులు పగలగొట్టజాలు నీ బొబ్బరింతలు – రమాసుందరితో ఆనందముగా గడుపుటవలన పలుకుటలేదా? శ్రీలక్ష్మీసరసకేళివలన కఠినమై, దుష్టశిక్షణ సేయగల నీ గుండె కరిగిపోయినదా? ఈ యవనులు చిన్నవారని తలపకుము. 'చిన్నపామున కైనా పెద్దదెబ్బ' అన్నారుకదా!

సీ॥ పొదలలో దాఁగెనో పొట్నూరులో నున్న
రమణీయ కోదండరామమూర్తి!
యెక్కడికేఁగెనో యెఱుగంగరాదుగా
పటు భీమసింగి గోపాలమూర్తి!

**సాధ్వసోద్వృత్తి నెచ్చటికేగియుండెనో**
**జామి జానార్దనస్వామిమూర్తి!**
**యెన్నిపాట్లను బడుచున్నాడొ చోదవ**
**రంబులోఁ గేశవరామమూర్తి!**

**ఆ॥ నిబిడ యవనుల భయశంక నీవు నింకఁ**
**బరుల కగపడకుండుమీ, ప్రక్కనున్న**
**గాయ మిప్పటికిని మానదాయె నయయొ!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 7**

**అర్థములు:-** రమణీయ = అందమైన; సాహస+ఉద్వృత్తి = సాహసముతో నెదురుకొనుట; అయయొ! = అయ్యో!

**భావము:-** ఓ! సింహాచల నారసింహస్వామీ! పొట్నూరులోనున్న కోదండరామమూర్తి పొదలలో దాగియున్నాడా? భీమసింగి గ్రామములోని గోపాలకృష్ణస్వామి ఎక్కడ ఉన్నాడో తెలియదు. జామిలో వెలసిన జనార్దనస్వామి కంగారుతో ఎక్కడ దాగినాడో! చోదవరములోని కేశవరామమూర్తి ఎన్నిపాట్లు పడుచున్నాడో! ఇంక నీవు కూడ తురుష్కులకు భయపడి ఎక్కడికైనను పోయి దాగియుండు. పాపము! హిరణ్యాక్షుడు అలనాడు పొడిచిన బల్లెపుపోటు గాయము ఇప్పటికీ మానలేదు కదా అయ్యో నీకు!! (సింహాచల నరసింహస్వామికి "యజ్ఞవరాహమూర్తి" అని పేరు. హిరణ్యాక్షుడు బల్లెము విసరగా స్వామికి గాయమయ్యెనని, ఆ గాయము ఇప్పటికిని ఉన్నదని ప్రజలు చెప్పుకొనుచుందురు.)

**సీ॥ పాశ్చాత్యుల నమాజుపై బుద్ధిపుట్టెనో**
**మౌనుల జపముపై మనసు రోసి,**
**యవనుల కందూరియం దిచ్ఛచెందెనో**
**విప్రయజ్ఞములపై విసుపు పుట్టి,**
**ఖానజాతి సలాముపై నింపుపుట్టెనో**
**దేవతా ప్రణతిపై భావమెడలి,**
**తురకల యీదునందు ముదంబు గల్గెనో**
**భక్త నిత్యోత్సవపరత మాని,**

తే॥ వాండ్రు దుర్మార్గులయ్యయో! "వ్రతముచెడ్డ
సుఖము దక్కదు"! వడి ఢిల్లి చొరగఁ దోలు
పారసీకాధిపుల పటాపంచలుగను!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 8

**అర్థములు:–** పాశ్చాత్యులు = పశ్చిమ దేశములవారు (ఇక్కడ మహమ్మదీయులు); నమాజు = మహమ్మదీయుల ప్రార్థన; 'కందూరి' = (ఇది "తందూరి" కావచ్చును. తందూరి యనగా ఒక విధమైన మాంసపు వంటకము); సలాము = తురకలుచేయు నమస్కారము; ఈదు (ఈద్) = ముస్లిముల పండుగ; పారసీక+అధిపులు = పర్షియా దేశపు రాజులు; పటాపంచలుగను = చెల్లాచెదరులుగా.

**భావము:–** ఓ సింహాచల నరసింహస్వామీ! మునులుచేయు జపాలపై ఇష్టముపోయి, తురకల నమాజుపై మనసుపడితివా? బ్రాహ్మణుల యజ్ఞప్రసాదములపై విసుగుపుట్టి, యవనుల మాంసప్రసాదములపై కోర్కెకలిగెనా? దేవతలుచేయు నమస్కారములపై అనిష్టముకలిగి, ఖానులుచేయు సలాములు నచ్చినవా? భక్తులు చేయు నిత్యోత్సవములయందు ఆసక్తిపోయి, తురకల 'ఈద్' పండుగులయందు సంతోషముకలిగెనా? అయ్యో వారందరూ దుర్మార్గులు! వ్రతముచెడిననూ నీకు సుఖము దక్కదు. పారశీక సైన్యమును త్వరగా ఢిల్లీకి పారిపోవునట్లుగా తరిమికొట్టుము!

సీ॥ నీ కొండపై నెక్కి నియతులౌ భక్తులఁ
గొట్టి నానావస్థఁ బెట్టకుండ,
గాంగధారాతీర కలిత మంటపముల
మద్యపానముఁజేసి మలయకుండ,
నీ వంటసాలలో నిశ్శంకతో మాంస
ఖండము ల్మెండుగా వండకుండ,
నీ గుడిఁజొచ్చి దుర్నీతిఁ గామాంధులై
పరవధూటుల భంగపఱుపకుండ,

తే॥ పౌరుషంబునఁ దుఱుకలఁ బాఱఁదరుము!
వేటకాడిల మెత్తనౌవేళ లేడి

**మూఁడుకాళ్లను నడుచు నిర్మూలితాంహ!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 9**

**అర్థములు:–** నియతులు = నియమము కలవారు; పరవధూటులు = ఇతరుల భార్యలు; నిర్మూలిత + అంహ = పోగొట్టిన – పాపము కలవాడా! (పాపమును పోగట్టువాడా!) అంహస్సు = పాపము, దోషము.

**భావము:–** పాపమును పోగొట్టువాడా! ఓ సింహాచల నారసింహస్వామీ! శత్రువులు వచ్చి, నీ కొండపైనున్న భక్తులను దురవస్థలు పెట్టక మునుపే, గంగధార దగ్గఱ పవిత్రమంటపములలో వారు మద్యపానము సేయకముందే, నీ వంటశాలలో దూరి మాంసములు వండక మునుపే, నీ గుడియందే కామాంధులై పరస్త్రీలను చెఱపట్టక ముందే, లెమ్ము! పౌరుషముచూసి తురకలను పారద్రోలుము! 'వేటకాడు మెత్తనివాడయితే లేడి మూడుకాళ్లతో నడిచింది' అన్నట్లు చేయకుము.

**సీ॥ సెలవైన భైరవుం దలుకచే వైరుల**
**నెత్తి బల్గదచేత మొత్తలేదె?**
**ఆజ్ఞయిచ్చిన వీరహనుమంతుఁ దహితుల**
**ఘనవాలమున నేలఁ గలుపలేదె?**
**అంపించితేఁ ద్రిపురాంతకుం దరిసేన**
**ఘోరశూలమ్మునఁ గ్రుమ్మలేదె?**
**కనుసన్నఁ జేసిన వినతాతనూజుండు**
**విమతుల నెగిరిపో విసరలేదె?**

**తే॥ ఇంత తాలిమి చేయుదే యిప్పటికిని!**
**మట్టుకొని వచ్చె శత్రుసమాజమెల్ల!**
**ప్రజల రక్షింపు యవనేశు బలముఁ గూల్చి!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 10**

**అర్థములు:–** వైరులు = శత్రువులు; అహితులు = శత్రువులు; అరిసేన = శత్రుసేన; వినతా తనూజుఁడు=వినతయొక్క కుమారుడు (గరుత్మంతుడు); విమతులు = శత్రువులు; తాలిమి = ఓర్పు; యవన + ఈశ = తురకరాజు.

**భావము:–** ఓ సింహాచల నారసింహస్వామీ! నీవు ఆజ్ఞ ఇచ్చినచో భైరవుడు మహాకోపముతో శత్రువులను గదతో మొత్తలేడా? నీవు అనుజ్ఞ ఇచ్చినచో వీరహనుమంతుడు శత్రువులను తోకతో మోది చంపలేడా? నీవు ఒకమాట చెప్పినచో ఈశ్వరుడు శూలముతో శత్రు సైన్యమును నశింపచేయడా? నీవు కనుసైగ చేసినచో గరుత్మంతుడు ఱెక్కలు విసరి రిపులను ఎగరగొట్టునుకదా! ఇంత ఉదాశీనముగా నుండుట భావ్యమా! ఇప్పటికే శత్రుసేనలు చుట్టుముట్టినవి. యవనులబారినుండి ప్రజలను కాపాడుము!!

**సీ॥ యవనేశు ధాటికి నడలి, సర్వస్వమ్ము**
**విడిచి, మందిరములు వెడలువారు;**
**వెడలియుఁ దలదాఁచ వెరవేమిఁ గానక**
**నడవుల నిడుమలఁ బడెడువారుఁ;**
**బడియు నెచ్చట కూడు బట్టఁ గానక తమ**
**శిశువులతో వెతఁజెందువారుఁ;**
**జెంది డెందము గుందఁ గాందిశీకత నభి**
**మానార్తులై ఖేదమూనువారు**

**తే॥ నైరి యొక్కొక్క భార్యతో నవనిఁ బ్రజలు;**
**అష్టమహిషులపై పదియాఱువేల**
**సతులతో నీవు వలస కెచ్చటి కరిగెదు?**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 11**

**అర్థములు:–** అడలి = భయపడి; వెరవు = ఉపాయము; కాందిశీకులు = దిక్కుకు ఒకరుగా పోవువారు.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహస్వామీ! తురుష్కరాజు దండయాత్రకు భయపడి, ప్రజలు తమ సర్వస్వమును విడిచి, ఇండ్లు వదలి పోవుచున్నారు. ఎక్కడ తలదాచు కొనవలయునో తెలియక అడవులలో కష్టాలు పడుచున్నారు. ఆ జనులు కూడుగుడ్డకు కరవై అల్లాడుచున్నారు. చిన్న పిల్లలతో పలుకష్టములు పడుచున్నారు. కాందిశీకులై దుఃఖముతో అభిమానవంతులై గడుపుచున్నారు. వారికి ఒక్కొక్క భార్యయే! నీవు అష్టమహిషులతో పదహారువేలమంది సతులతో ఎక్కడికి వలసపోగలవు?

**సీ॥ దర్పణాకృతి తళతళలాడు కంబాలు**
**డంబై చెలంగు బేడా హెూరంగు**
**చెప్పఁజూపగరాని యొప్పున నుప్పరం**
**బప్పళించెడు వంక కొప్పు చొప్పు**
**చిత్రవిచిత్రమౌ చిత్రంపు బొమ్మలం**
**గులుకు చక్కని గుళ్ళు గోపురములు**
**అమృతోపమానమై యలరారు గాంగధా**
**రా ముఖ్య సకల ధారాజలంబు**

**తే॥ నెంత ముచ్చటిపడి సృజియించినావొ**
**యిల్లు చెడగొట్టుకొనకు నన్నేలినయ్య!**
**ఘనతురుష్కులఁ బడఁగొట్ట మనసుఁబెట్టు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 12**

**అర్థములు:–** దర్పణము = అద్దము; కంబము = స్తంభము; ఉప్పరము = ఆకాశము; డంబు = కాంతి; బేడా = గర్భాలయమునకు చుట్టు నుండెడు మంటపము; హెూరంగు = విలాసము; కొప్పు = గోపురము.

**భావము:–** ఓ! సింహాద్రి నారసింహస్వామీ! నీ ఆలయము బహుసుందరమైనది. ఇచ్చటి స్తంభాలు అద్దాలవలె తళతళలాడుచుండును. సభామందిరము మిక్కిలి రమణీయమైనది. పైకప్పు ఆకాశమంత ఎత్తున చెప్పలేనంత సౌందర్యవంతమైనది. ఆలయ ప్రాంగణమున గుళ్లుగోపురాలు చిత్రవిచిత్రశిల్పములతో విరాజిల్లుచున్నవి. గంగధారవంటి జలపాతములతో అమృతమువంటి నీరు ప్రవహించుచుండును. ఎంత ముచ్చటపడి కట్టించుకొన్నావో ఈ మందిరము! ఈ తురుష్క సైన్యమును పారద్రోలుము. ఇల్లు చెడగొట్టుకోవలదు స్వామీ!

**సీ॥ యవనధాటికి భయమందియే కాఁబోలు**
**నక్కజంబుగఁ గొండ యెక్కినావు**
**ఖానులకదలియే కాఁబోలు, సంపూర్ణ**
**పౌరుషంబునఁ గత్తి పట్టవైతి**

వఖిల పాశ్చాత్యుల నలమ లేకయె పోలు
తాపసగతి జడఁ దాల్చినావు
మ్లేచ్ఛనాయక బలాలికి జంకి కాఁబోలు
మిక్కిలి గంధంబు మెత్తినావు

తే॥ గట్టిగా నీవు తురకల ముట్టకుండ
నవవరాహాకృతి ధరించినావు సామి
వలదు నిందలఁబడ, తురుష్కుల వధింపు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 13

**అర్థములు:–** అక్కజము = ఆశ్చర్యము; అడలు = భయపడు; అలము = ఆక్రమించు; మ్లేచ్ఛులు = తురుష్కులు; వరాహ + ఆకృతి = పందిరూపము.

**భావము:–** ఓ! సింహాచల నారసింహస్వామీ! ఈ యవనులకు భయపడి కాబోలు – చక్కగా కొండఎక్కావు! ఖానులకు భయపడి కాబోలు, పౌరుషంతో కత్తిపట్టుకున్నావు! ఈ పాశ్చాత్యులను అణచలేక కాబోలు, మునులవలె జడలు ధరించావు. మ్లేచ్ఛుల సైన్యానికి జంకి కాబోలు, గంధపుపొరల్లో దాగినావు! తురకలు దరిచేరరని వరాహాకృతి (పంది ఆకారము) ధరించావు. (తురకలకు వరాహమనిన అసహ్యము). వలదు స్వామీ! నింద పడవద్దు. తురుష్కులను సంహరింపుము.

సీ॥ పటుతర స్తంభంబు పటపట బ్రద్దలు
గా జనించిన నీ యఖండ మహిమ
చటులతరంబుగా పెటపెట దంష్ట్రలు
కొఱుకుచు వచ్చు నీ ఘోరవృత్తి
స్ఫుటతరోద్భట వృత్తిఁ జిటచిట ధ్వని మీరు
నీ నిటలాక్ష వహ్నిక్రమంబు
కుటిల నఖంబుల సొటసొట నెత్తురు
సింద రక్కసు ఁ బొమ్ముఁజించు కినుక

తే॥ యెందుఁబోయెనొ నేడు మహీజనంబుఁ
గుంద, నౌద్ధత్యమునవచ్చు ఘోర యవన

**బృందములయందుఁ జూపు తద్భీకరగతి!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 14**

**అర్థములు:–** దంష్ట్రలు = కోరలు; నిటల + అక్షి = నుదుటి కన్ను; వహ్ని = అగ్ని; కుటిల నఖములు = వంకర గోళ్లు; మహీజనము = లోకమందలి జనులు; కుందన్ = దుఃఖించుచుండగా.

**భావము:–** ఓ! సింహాద్రి నారసింహస్వామీ! ఉక్కుస్తంభాన్ని పటపట బ్రద్దలు కొట్టుకొని వచ్చిన నీ మహిమ ఏమైపోయినది? భయంకరముగ పెటపెట పండ్లుకొరుకుచు కనుపట్టిన నీ ఘోరరూపము, చిటచిటమని నిప్పులొలుకుచు మండిన నీ నుదుటికంటి మంటలు ఏమైనవి? వంపుతిరిగిన వాడిగల గోళ్లతో హిరణ్యకశిపుని గుండెలు చీల్చితివికదా! ఆగోళ్లవాడి ఎక్కడికి పోయినది? ప్రజలందరును దుఃఖించుచుండగా, ఆక్రమించుచున్నట్టి యవనసైన్యమునకు నీ భయంకర విక్రమము చూపుమయ్యా!

**సీ॥ నట్టువల్ ద్రొక్కగా నవయామునీయ కూ**
**లంబుగాదు, రణస్థలంబుగాని;**
**కొట్టితోలఁగ నీకు గోవృషభంబుల**
**బారుగాదు, గుఱాలపౌఁజుగాని;**
**పట్టిచూడగ నీకుఁ బసిగాపుచెలుల పా**
**లిండ్లుగావు, ఫిరంగిగుండ్లుగాని;**
**ముట్టి ముక్కలుసేయ మురిసిన యర్జున**
**తరులుగా వరివీర తరులుగాని;**

**తే॥ యవనబలములతోడఁ బోరాడలేవు,**
**శూరుఁడౌ జరాసంధుండు చుట్టుకొనిన**
**నాఁటి తీరయ్యె, మేల్నీకు నవ్వుగాదె!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 15**

**అర్థములు:–** నట్టువలు = నాట్యాలు; యామునీయ కూలము = యమునానదీ తీరము; రణస్థలము = యుద్ధభూమి; బారు = సమూహము, వరుస; పౌఁజు = సేన; అర్జున తరులు = దేవదారు వృక్షాలు; అరవీర తరులు = బాధించెడి శత్రువీరులు (తరువు =

1. చెట్టు, 2. నిర్బంధించువాడు, బాధించువాడు.); పసిగాపుచెలులు = గోపికలు (పసిగాపు=గోపకుడు, ఆలకాపరి).

**భావము:–** ఓ! సింహాద్రి నారసింహప్రభూ! ఇది యుద్ధరంగమేకాని, నాట్యము చేయుటకు యమునానదీతీరముకాదు! ఇది అశ్వబలమేకాని, కొట్టితోలుటకు ఆవులమందకాదు. దూసుకువచ్చునవి ఫిరంగిగుండ్లుకాని, గోపికల కుచములుకావు. తాకి విరుగగొట్టుటకు ఇది బాధించు శత్రువీరుల సమూహముగాని, అర్జునవృక్షాలు కావు. శూరుడైన జరాసంధునితో పోరాడలేక మునుపు దాగుకొన్నట్లే, ఇప్పుడును యవనసైన్యముతో పోరాడలేకున్నావు!

**సీ॥ కాంతలఁ జెఱపట్టఁ గనుగొనుచుంటివి,**
**పాంచాలి వెత యెట్లు పాపినావొ?**
**గోవధసేయఁ గన్గొనుచుంటి విప్పుడు,**
**కరుణతోఁ గరినెట్లు కాచినావొ?**
**ద్విజులు బాధలుపడఁ దిలకించుచుంటివి,**
**భువిఁ గుచేలుని నెట్లు ప్రోచినావొ?**
**"సత్ప్రభు" రాజ్యనాశనమందఁ గంటివి,**
**ధ్రువుని కెట్లిచ్చితో దొడ్డపదవి?**
**తే॥ దుష్టశిక్షణ మొనరించి, శిష్టరక్ష**
**చేయకుండిన పూర్వప్రసిద్ధి చెడును,**
**ఆర్తరక్షణ బిరుదంబు హానిఁజెందు,**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 16**

**అర్థములు:–** వెత = కష్టము; ద్విజులు = బ్రాహ్మణులు; సత్ప్రభువు = పెదవిజయ రామరాజు.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహస్వామీ! యవనసైనికులు స్త్రీలను చెఱపట్టగా చూచుచున్నావు; ఆనాడు ద్రౌపదిని ఎట్లు కాపాడితివి? గోవధ జరుగుచుండగా చూచుచున్నావే, నాడు గజేంద్రుని ఎట్లు రక్షించావు? బ్రాహ్మణులు నేడెన్నో బాధలు పడుచున్నారు; మరి కుచేలుని ఎట్లు ఆదరించితివి? సత్ప్రభువైన విజయరామ గజపతి రాజ్యము నాశనమగుచుండగా చూచున్నావు; ధ్రువునికి గొప్పపదవిని ఎట్లు ఇచ్చితివి?

దుష్టశిక్షణచేసి శిష్టరక్షణము చేయకుండిన, నీకున్న ఆర్తరక్షణ బిరుదు నవ్వులపాలగును. నీ పూర్వపుకీర్తి అంతయును పోవును.

**సీ॥ సముదగ్రమగు సముద్రముఁ జొచ్చి యీఁదుటో,**
**కొండ నెత్తినిబెట్టుకొంట యొక్కొ,**
**ధారుణీస్థలిఁ ద్రవ్వి తలనెత్తుకొంటయో,**
**గొబ్బున సింగంపు బొబ్బయిడుటొ,**
**యదుగిడి త్రైలోక్య మాక్రమించుట యొక్కొ,**
**వేయిచేతులవాని వేయుటొక్కొ,**
**యొక శరాగ్రమ్మున నుదధి నింకించుటో,**
**కరిపురంబెల్లఁ బెగల్చుటొక్కొ,**

**తే॥ కరుణ జగములఁ బ్రోచుటో, తురగమెక్కి**
**ఘనరిపులఁగొట్టుటో, తురుష్కవధ యెంత?**
**కొండయెక్కెదు బ్రతిమాలుకొనిన కొలఁది!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 17**

**అర్థములు:-** సముదగ్రము = మిక్కిలి భయంకరము; వేయిచేతులవాడు = కార్తవీర్యార్జునుడు; శర + అగ్రము = బాణపు మొన; తురగము = గుఱ్ఱము.

**భావము:-** ఓ! సింహాచల నారసింహస్వామీ! ఈ తురుష్కులను సంహరించుట నీకు ఎంతపని? ఇదేమి మత్స్యావతారివై సముద్రము నీదుటా? కూర్మమువై మంథరమును మోయుటా? యజ్ఞవరాహమవై భూమిని తలకెత్తుకొనుటయా? నరసింహమూర్తివై సింహమువలె గర్జించుటయా? వామనుడవై మూడడుగుల స్థలముకోరి మూడు లోకములను ఆక్రమించుటయా? పరశురాముడవై వేయిచేతుల కార్తవీర్యార్జునుని సంహరించుటయా? రామునివై ఒక్క బాణముతో సముద్రమును ఇంకించుటా? బలరాముడవై నాగలితో హస్తినాపురమును పెకల్చుటయా? బుద్ధుడవై కరుణతో లోకములను రక్షించుటయా? కల్కివై గుఱ్ఱమెక్కి వచ్చి శత్రునాశనము చేయుటయా? బ్రతిమాలిన కొలదీ కొండఎక్కుచున్నావు!

**సీ॥ కుతిపాలు ప్రొద్దునఁ గ్రోలక యొక క్షణ**
**మైనఁ దాళవుగదా యాఁకటికిని!**

**బాగుగా మెయి మలాకీ గంధమలఁదక**
**యింపుఁపుట్టదుగదా యెప్పటికిని!**
**తనువునిండ ధగద్ధగిత పట్టంబరం**
**బవధరింపక మానవహరహంబు!**
**నాటపాటలు మొదలగు వినోదంబుల**
**నుబుసు పుచ్చక గాని యుండలేవు!**

**తే॥ భక్తులెల్లరు దుర్మార్గపర తురుష్క**
**రాజిచేఁ బొందిరిదె పడరానిపాట్లు,**
**భోగరాగంబులిఁక నీకుఁ బొసఁగు టెట్లు?**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 18**

**అర్థములు:–** కుతిపాలు = ఆవుపాలు; (కుట్టి = పాడియావు); మలాకీ – గంధము = శ్రీ గంధము (మంచిగంధము); పట్టు + అంబరము = పట్టువస్త్రము; అహరహము = ప్రతిదినము.

**భావము:–** ఓ సింహాచల నారసింహస్వామీ! ప్రొద్దుననే పాడిఆవు పాలు త్రాగకుండా ఆకలికి ఒక్కక్షణమైనా ఓర్చుకోలేవు. శరీరమంతా గంధపుపూత పూసుకొంటే కానీ నీకు సంతోషంగా ఉండదు. ధగధగలాడే పట్టుపీతాంబరాలు ప్రతిదినము ధరింపకమానవు. ఆటపాటల వినోదాలు లేకుండా నీకు ఉబుసుపోదు. సరే–నీభక్తులు దుర్మార్గులైన తురుష్కులవలన పడరానిపాట్లు పడుచుండగా – నీవు భోగరాగములలో మునిగియుండుట న్యాయమా?

**సీ॥ పుట్టినప్పుడు వీఁకఁ బోకార్చితివి భళీ!**
**పూతనాఖ్యోపేత యాతుధానిఁ!**
**బుడమిపై కడు తప్పుటడుగిడునప్పుడు**
**బండిరక్కసు మేను చెండినావు!**
**ఆటప్రాయమునఁ దృణావర్త బక ధేను**
**కాది దైత్యకులంబు నణఁచినావు!**
**యౌవనంబున నృశంసావతంసక కంస**
**విధ్వంసన రిరంస వెలసినావు!**

తే॥ భూసురులఁ బ్రోవవేమి మహాసురారి?
యిప్పుడేటికిఁ ద్రుంప, వేం డ్లెగసనైన
బుద్ధి దిగసన వచ్చెనో! పో! మరేమి?
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 19

**అర్థములు:–** వీఁకన్ = పరాక్రమముతో; పోకార్చు = నశింపజేయు; పూతన + ఆఖ్య = "పూతన" అను పేరుగల; యాతుధాని = రాక్షసస్త్రీ; బండిరక్కసుఁడు = శకటాసురుఁడు నృశంసుఁడు = పాపాత్ముడు, క్రూరుడు; రిరంసన్ = కోరికవలన; వెలసినావు = ప్రకాశించినావు; భూసురులు = బ్రాహ్మణులు.

**భావము:–** ఓ! సింహాచల నారసింహప్రభూ! పుట్టినతోడనే (పసితనమునందే) పూతన అను రక్కసిని చంపితివి. తప్పటడుగులువేయు సమయమునందే శకటాసురుని సంహరించితివి. ఆటలాడు వయస్సులోనే తృణావర్తుడు, బకాసురుడు, ధేనుకాసురుడు మొదలగు రాక్షసులను చంపితివి. యౌవనమునందే మిక్కిలి క్రూరుడైన కంసుని ప్రాణములు తీసి, కీర్తిగడించినావు. ఏండ్లు పెరిగినంత బుద్ధి దిగజారెనన్నట్లు, ఇప్పుడు యవనులను ఏల మట్టుపెట్టకున్నావు? బ్రాహ్మణుల దుఃఖము పోగొట్టి వారిని రక్షింపవేమి?

సీ॥ ఎలమితో సోమయాజుల పెద్దజారీలు
గుడిగుడీలుగఁ జేసికొనెడివారు
యజ్ఞవాటికలలో నగ్నిహోత్రంబుల
ధూమపానముఁజేసి త్రుళ్ళువారు
యాగపాత్రలు దెచ్చి హౌసుగా వడి లుడి
కీ చిప్పలుగఁ జేసి కేరువారు
స్రుక్స్రువ ముఖ్య దారుమయోపకరణముల్
గొని వంటపొయి నిడుకొనెడివారు

తే॥ నగుచు యవనులు విప్రులఁ దెగడుచుండ
సవనభోక్తవు నీవిట్లు సైపఁదగునె?
తినఁదినఁగ గారెలైనను కనరువేయు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 20

**అర్థములు:–** జారీ = కమండలువు; గుడిగుడీలు = హుక్కాగొట్టములు; హౌసుగా = సొగసుగా; లుడికీచిప్పలు = కర్ణాభరములు ('బుట్ట లోలకులు' వంటివి కావచ్చును.); స్రుక్కు = హోమపాత్ర; స్రువము = హోమజ్వాలలో నేతిని పోసెడి కొయ్యగరిటె; దారుమయ = కొయ్యతో చేయబడిన; సవనభోక్త = యజ్ఞఫలమును అనుభవించువాడు (విష్ణువు); కనరు = వెగటు.

**భావము:–** ఓ సింహాచల నారసింహస్వామీ! యజ్ఞములు చేసిన సోమయాజులచేతి పాత్రలు (కమండలువులు!) హుక్కాగొట్టాలుగా మారిపోయినవి. యజ్ఞవాటికలోని అగ్నిహోత్రములతో ధూమపానములు చేయుచున్నారు. యాగపాత్రలతో కర్ణాభరణములు చేసికొనుచున్నారు. హోమజ్వాలలో నేతిని పోయుటకు ఉపయోగించెడి "స్రుక్కు" – "స్రువము" అను చెక్కవస్తువులను వంటపొయ్యిలో వేసి మండించుచున్నారు. ఈ యవనులు బ్రాహ్మణులను నిందించుచు, ఇన్ని దురాగతములు చేయుచుండగా, యజ్ఞభోక్తవైన నీవిట్లు ఊరకుండుట భావ్యమా! తినగ తినగ గారెలు చేదన్నట్లుగా నున్నది!

**సీ॥ చింపికుళ్లాయైన శిరమునఁ దాలిచి**
**దివ్యకిరీటంబుఁ దీసి దాఁచు,**
**వనమాలికయ చాలు వక్షంబున ధరింపఁ**
**గౌస్తుభరత్నంబు గట్టిసేయు,**
**పూడకుండగఁ జెవి పుడకైన నిడుకొని**
**మకర కుండలములు మాటుసేయు**
**కటి ధగద్ధగితమౌ కనకచేలంబేల?**
**మొలచుట్టు మొకపాటి ముతుకగుడ్డ**

**తే॥ దొడ్డసరుకులు తురకలు దోఁచుకొనినఁ**
**గష్టమౌ కానివేళ, జగత్కుటుంబి**
**వీవు, వేషంబుచెడిన నీకెట్లుఁ గడచు?**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 21**

**అర్థములు:–** చింపి = చిరిగిన; కుళ్లాయ = టోపి; వనమాలిక = "వైజయంతి" అను పేరుగల విష్ణువు మెడలోని పూలదండ; పుడక = పుల్ల; ధగద్ధగితమౌ = ధగధగ

మెఱయుచున్న; కనకచేలము = బంగారు వస్త్రము; జగత్ + కుటుంబి = జగత్తు అంతా కుటుంబముగా కలవాడు.

**భావము:–** ఓ! సింహాచల నారసింహస్వామీ! చిరిగిన టోపీని నెత్తిపై పెట్టుకొని, నీ దివ్య కిరీటాన్ని దాచిపెట్టుము. వక్షస్థలమునందు తులసిమాల చాలు – ఆ కౌస్తుభరత్నాన్ని భద్రపఱచుకొమ్ము. చెవులు పూడిపోకుండా పుడక పెట్టుకొని, మకరకుండలములను దాచుకొనుము. మొలకొక ముతుకగుడ్డ చుట్టుకొని, ఆ కనకచేలము దాచుము. నీకున్న గొప్పఅలంకారాలు తురకలు దోచుకొనినచో ఎంతకష్టము! జగత్‌కుటుంబివైన నీకు వేషము ముఖ్యముగదా!

**సీ॥ నా మొరాలింపవు, నారద గానంబు**
**వినుచుంటివో వేడ్క వీనులలరఁ!**
**గరుణఁ జూడవు మమ్ముఁ, గమలామహాదేవి**
**కన్నులు మూసెనో కౌతుకమున!**
**మముఁబ్రోవ రావేమి? కమలభవాదులు**
**భక్తితోఁ బాదముల్ పట్టుకొనిరొ!**
**ఆదరకలన మాటాడవు, భూ నీళ**
**లలరగా ముచ్చట లాడుచుండ్రొ!**
**తే॥ యిట్టులున్న ననాథల కేది దిక్కు?**
**సమయమా యిది కేళికాసౌఖ్యమునకు?**
**దుష్టుల వధించి, బ్రోవు సాధువులనెల్ల!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 22**

**అర్థములు:–** కమల = లక్ష్మీదేవి; కౌతుకము = కుతూహలము; కమలభవ + ఆదులు = బ్రహ్మ మొదలగువారు.

**భావము:–** ఓ! సింహాచల నారసింహస్వామీ! నారదుని గానం వింటున్నావు కాబోలు, నా మొఱ నీవు వినుపించుకొనుటలేదు. శ్రీమహాలక్ష్మి సరసముతో నీ కనులు మూసినదేమో, మమ్ములను కరుణతో చూచుటలేదు. బ్రహ్మాది దేవతలు నీ పాదములు పట్టుకొని యున్నారేమో, మమ్ము కాపాడుటకు వచ్చుటలేదు. భూదేవి నీళాదేవి నీతో ముచ్చటలాడుచుండిరేమో, మాతో ఆదరముగా మాట్లాడకున్నావు. నీవు ఈ విధముగా

నున్నచో అనాథలమగు మాకు దిక్కెవరు? ఇది కేళీసౌఖ్యములకు సమయమా? దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయుము!

**సీ॥ పాలీయవచ్చిన భామిని ప్రాణంబు**
**లపహరించి చెలంగినట్లు గాదు**
**యాగోత్సవంబున కతిమోదమునఁ బిల్వ**
**నపుడు మామను ద్రుంచినట్లు గాదు**
**చేతగాకొక నరుచేతఁ జుట్టంబుల**
**నందరఁ జంపించినట్లు గాదు**
**తుంగఁగల్పించి యుత్తుంగ వంశద్రోహ**
**మాచరించి చెలంగినట్లు గాదు**

**తే॥ పరబలంబిది నీ ప్రజ్ఞ పనికిరాదు,**
**లెమ్మికను, మీనమేషముల్ లెక్కయిడకు,**
**చౌరవ తురకలఁ గొట్టగాఁ జుక్కలెదురె?**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 23**

**అర్థములు:–** భామిని = స్త్రీ; తుంగ = ఒక విధమైన గడ్డి (తృణ విశేషము); ఉత్తుంగ = గొప్పదైన; మీనమేషములు లెక్కించుట = ఆలస్యము చేయుట.

**భావము:–** ఓ! సింహాద్రి నారసింహప్రభూ! వచ్చినవారు శత్రువులు! ఇంక మీనమేషములు లెక్కపెట్టకుము. లెమ్ము! ఈ తురకలతోడి యుద్ధమనగా – పాలిచ్చుటకు వచ్చిన స్త్రీని (పూతను) చంపుట కాదు. యాగమునకు రమ్మని సంతోషముగా పిలువగా, మామను (కంసుని) సంహరించుట కాదు. నీవు ఆయుధము ధరించకుండా, అర్జుననిచే అతని చుట్టములను చంపించినట్లు కాదు. తుంగను కల్పించి, దానితో యాదవులందరును కొట్టుకొని చనిపోవునట్లుచేసి, పెద్ద వంశద్రోహము కావించినంత సులభము కాదు (మౌసల పర్వగాథ). లెమ్ము! శత్రువులను సంహరింపుము.

**సీ॥ అవని మూఁడడుగు లిమ్మని వేఁడ, నిచ్చిన**
**బలి నణంచిన దేమి ప్రాభవంబు?**
**ఇనకుమారుని మది కిచ్చకంబుగఁ బొంచి**
**వాలిని జంపు టే వీలు నీకుఁ?**

గడు కాలయవనున కదలి యా ముచుకుందు
పాలి కేతెంచు టే పౌరుషంబు?
భువి జరాసంధుతోఁ బోరాడగా లేక
ద్వారకఁ జేరు టే ధైర్యవృత్తి?
తే॥ యౌర! నిజమాడ నిష్ఠురంబౌ నటంద్రు!
కాక రోషంబు గలిగినఁ గఠిన యవన
సేన నిర్జించి, యీయాంధ్ర సృష్టి నిల్పు,
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 24

**అర్థములు:–** అవని = భూమి; ఇచ్చకము = ఇష్టము; నిర్జించు = ఓడించు; ఆంధ్రసృష్టి = ఆంధ్రజాతి.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! నీవు కోరినట్లుగానే మూడడుగుల భూమిని దానమిచ్చిన బలిచక్రవర్తిని అణగద్రొక్కితివి. అది న్యాయమా? సుగ్రీవునకు మేలు చేయుటకు ఆతని అన్నయైన వాలిని చెట్టుచాటుగా నుండి చంపితివి? అది ధర్మమా? కాలయవనునికి భయపడి పరువెత్తికొనిపోయి, అతనిని ముచికుందుని కంటిమంటలో బూడిద గావించితివి – అదేనా పౌరుషము? జరాసంధునితో పోరాడలేక ద్వారకలో దాగికొనినావు. అది ధైర్యమా? నిజమాడినచో నిష్ఠురము కదా! రోషము కలిగినచో ఈ యవనసైన్యమును జయించి ఆంధ్రదేశమును కాపాడుము!

సీ॥ "నీరు హుక్కా పకడ్డొరె గద్దా"యని
యాహితాగ్నుల నెత్తులణఁచకుండ,
"పాము దోనేకు తుం పాని లా (వ్) రే" యని
తివిరి శ్రోత్రియుల మర్దింపకుండ,
"ఘాసులారే అరే గాండూ" అనుచు శిష్ట
తతులపైఁబడి వడిఁదన్నకుండ,
"కులితీ పకాపురే జలీదీ" యటంచు మా
ధ్వుల మెడ వడిఁబట్టి త్రోయకుండ,
తే॥ బహుల హాలా మదానిల పరుష యవన
రాజి నిర్జింపు, నీవంటి ప్రభువుగల్గ

బ్రాహ్మణుల కిన్నిపాట్లు రారాదు గాదె?
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 25

**కొన్ని ఉర్దూ పదములకు అర్థములు:–** "పకడ్ దౌరె" = పట్టుకొనిరా!; "గద్దా (<గధా)" = గాడిదా!; "పాము (<పావ్ఁ)" = పాదాలు; "దోనేకో (<ధోనేకో)" = కడుగుకొనుటకు; "లారే/రావ్‌రే" = తీసికొనిరా!; "ఘాసు (<ఘాస్)" = పచ్చగడ్డి; "గాండూ" = తురకభాషలో ఒక తిట్టు; "కులితీ" = ఉలవలు; "పకావ్‌రే" = ఉడకబెట్టు; "జలిదీ (<జల్దీ)" = త్వరగా;

**కొన్ని తత్సమ పదములు:–** అహితాగ్నులు = అగ్నిని పూజించువారు; శ్రోత్రియులు = ఆచారవంతులు; శిష్టతతులు = సజ్జన సమూహము; బహుళ–హాలామద + ఆవిల = మిక్కిలిగా కల్లు తాగిన మత్తుచే పాపులైన; (హాల = సారాయి, కల్లు).

**భావము:–** ఓ! సింహాద్రి నారసింహప్రభూ! 'హుక్కా పట్టుకురండిరా' అని ఆహితాగ్నులను నెత్తిమీద కొట్టకముందే; 'కాళ్లు కడుక్కోవడానికి నీళ్లు పట్టుకురా' అని శ్రోత్రియులను బాధింపకముందే; 'అరే, దుర్మార్గుడా! మా గుఱ్ఱాలకు పచ్చగడ్డి పట్టుకురా' అని సజ్జనులను తన్నకముందే; 'త్వరగా ఉలవలు ఉడకబెట్టరా! అని మాధ్వులను మెడబట్టి తోయకుండా – ఈ తప్పతాగి పరుషవచనములు పలుకు తురుష్కులను పారద్రోలుము. నీవంటి పరిపాలకుడుండగా బ్రాహ్మణులకు ఇన్నిపాట్లు రాకూడదు!

సీ॥ అగ్రజ పీడితుండైన విభీషణు
 లీవి మున్ దయఁజూచినావు గావొ?
అల మునిభీతుఁడౌ నంబరీషుని యార్త
 నాదంబు మున్ను విన్నావు గావొ?
బహు బాధితుండైన ప్రహ్లాదునకును ము
 న్నీవు ప్రత్యక్షమైనావు గావొ?
ధ్రువముఖ్యులైన భక్తులనెల్ల మున్ను సం
 తసమున రక్షించినావు గావొ?
తే॥ నాఁటి మది లేదొ కరుణ? నన్ గనవు, వినవు,
రావు, ప్రోవవువేగ, పురాణపురుష!

**తాతతాతవు, ముది మదిఁదప్పినావొ?**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 26**

**అర్థములు:–** అగ్రజుడు = అన్న; ధ్రువముఖ్యులు = ధ్రువుడు మొదలగు; తాతతాతవు = బ్రహ్మదేవుని తండ్రివి; ముది = ముదిమి, ముసలితనము; మది = మతి, బుద్ధి.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహస్వామీ! రావణునిచేత నొప్పింపబడిన విభీషణుని ముందుగానే దయతో రక్షించినావు కదా? దుర్వాసునివలన భయపడిన అంబరీషుని ఆర్తనాదము విని రక్షించినావు కదా? తండ్రివలన ఎన్నో బాధలు పడిన ప్రహ్లాదునికి ప్రత్యక్షమై అతనిని కాపాడినావు కదా? ధ్రువుడు మొదలైన భక్తులనందరిని పూర్వం సంతోషంతో రక్షించావు కదా? ఆనాటి కరుణ ఇప్పుడేమైనది? మమ్ము చూచుటకు రావు, మా మొఱ ఆలకింపవు. మమ్ము వేగముగా కాపాడవు. బ్రహ్మదేవునికే తండ్రివైన నీకు ముసలితనమువలన మతితప్పినదా ఏమి? ("పురాణ పురుషుడు" అనుమాటను కవి ఇక్కడ చమత్కరించాడు.)

**సీ॥ గ్రామంబులన్నియుఁ గాల్చి దీపారాధ**
**నలు చేసి రౌర! యానందముగను;**
**వడి సాధుజనుల సర్వస్వమ్ముఁ గొని శఠ**
**గోపంబుఁ బెట్టిరి గురుతరముగ;**
**పట ఘటాదులు పోవ బ్రతిమాలువారి కే**
**మియ్యక ఘంటవాయించి రహహ!**
**పెద్దలకడ దుడ్డుపెట్టి ప్రసాదంబు**
**వడ్డించి తగఁ బరాభవముఁజేసి**

**తే॥ రపుర! యవనార్చకులు నీకు నాప్తులైరి**
**భూసురులు సేయు పూజలు పొసఁగవొక్కొ?**
**అకట! యిదియేమి? పాపమునకు వెఱవవు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 27**

**అర్థములు:–** దీప + ఆరాధన = దీపములతో పూజ; శఠగోపము పెట్టు = మోసగించు; ఘంట వాయించు = పూర్తిచేయు; దుడ్డుపెట్టి ప్రసాదము వడ్డించుట = కఱ్ఱతో కొట్టుట; (ఇవి జాతీయములు. నిజమైన అర్థమున గాక అన్యార్థములో ప్రయోగింపబడినవి).

పటఘటాదులు = వస్త్రములు, కుండలు (పాత్రలు) మొదలగునవి (పటము = వస్త్రము, ఘటము = కుండ).

**భావము:–** ఓ! సింహాద్రి నరసింహస్వామీ! యవనసేనలు అనెడి పూజారులు, గ్రామాలు కాల్చి, దీపారాధనలు ఆనందముగా చేయుచున్నారు. సాధుజనుల సర్వస్వమును దోచుకొని, వారి నెత్తిన శఠగోపములు పెట్టుకున్నారు. వస్త్రాలు వంటగిన్నెలు కూడ లాగుకొని, బ్రతిమాలు కొన్ననూ ఇయ్యక, గంటవాయించుచున్నారు. పెద్దలనికూడా చూడకుండా వారిని అవమానించి, దుడ్డుకర్రప్రసాదములు పెట్టుచున్నారు. ఈ 'యవనార్చకులు' నీకు ఆప్తులయినారా? బ్రాహ్మణులు చేయు పూజలు నచ్చలేదా? అయ్యో! పాపానికి కూడ భయపడకుండ ఉంటివే!

ఇక్కడ కవి కొన్ని మాటలను జాతీయములు (నుడికారములు – పలుకుబడులు –Idioms)గా ప్రయోగించినాడు. శబ్దములలోని అర్థములకున్న, వేరొక అర్థమును ధ్వనింపజేయునది జాతీయము! "దీపారాధన చేయు" = "దేవుని దగ్గర దీపమును వెలిగించు" అని మామూలు అర్థము. కాని ఇక్కడ "తగులబెట్టు" అని ధ్వని. (2) "శఠగోపము పెట్టు" = గుడిలో పూజారి భక్తుని తలపై శఠగోపమునుంచుట" అని సామాన్యార్థము. కాని ఇక్కడ ''మోసము చేయు'' అని ధ్వన్యర్థము. (3) "ఘంటవాయించు" = "దేవుని దగ్గర గంటవాయించుట" – సామాన్యార్థము. "ఎగవేయుట" అని ధ్వని. (4) "దుడ్డుపెట్టి ప్రసాదము వడ్డించు" = "ధనము పుచ్చుకొని ప్రసాదమును పెట్టుట" – సామాన్యార్థము. "దుడ్డు కఱ్ఱతో కొట్టుట" అని ధ్వని.

**సీ॥ వాసవు పిడుగుల వానకు వెఱవవు –**
**కడు ఫిరంగీ గుండ్ల కడలనేల?**
**వెఱవవు భీష్మాది భీష్మబాణాళికి –**
**బాణాలకేటికి భయపడంగ?**
**దవవహ్ని దిగమ్రింగితివిగాని జంక, వీ**
**యళుకేల యీ యరబ్బులకు నీవు?**
**గణియింప కధిక రాక్షసుల శిక్షించి, తీ**
**మ్లేచ్ఛుల నణుఁచు టేలెక్క నీకు?**
**తే॥ నీ కడిమి నీ వెఱుంగవు గాక, లోక**
**కర్తవగు నీకొక యసాధ్య కార్యమేది?**

పామరులు నవ్వకుండగఁ బరులఁ దఱుము!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 28

**అర్థములు:–** వాసవుఁడు = ఇంద్రుడు; వెఱచు, అడలు = భయపడు; భీష్మ + బాణ + ఆళికి = భయంకరమైన – బాణముల – పంక్తికి (వరుసకు); దవవహ్ని = దావాగ్ని; అళుకు = భయము; కడిమి = శక్తి; పరులు = శత్రువులు.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహస్వామీ! ఇంద్రుడు కురిపించిన పిడుగులవానకు భయపడని వాడివి, ఈ ఫిరంగి గుండ్లకు భయపడనేల? భీష్మాది మహావీరులు వేయు బాణముల పరంపరకు వెఱవని నీవు, తురకల బాణాలకు భయపడుచుండుట ఎందులకు? కార్చిచ్చు మ్రింగుటకు జంకని నీవు, ఈ అరబ్బు సైన్యమునకు ఎందుకు జంకుచున్నావు? గొప్పగొప్ప బలాఢ్యులైన రాక్షసులను చంపిన నీకు, ఈ మ్లేచ్ఛులు అనగా ఒక లెక్కా? నీ బలము నీకు తెలియదు. లోకకర్తవైన నీకు అసాధ్యమేదియును లేదు. ప్రజలు నవ్వకొనక ముందే శత్రువులను తరిమివేయుము!

సీ॥ సమధిక ప్రేమచే శబరి యెంగిలిఁ జేసి
యొసఁగిన పండ్లెల్ల మెసఁగి మెసఁగి,
చెలఁగి కుచేలుండు జీర్ణచేలంబునఁ
బొదవు ముక్కటుకులు బొక్కి బొక్కి,
వనములోఁ బాంచాలి వండిన శాకభాం
డములోని బలుసాకు నమలి నమలి,
పొంచి యా దుగ్గన బోయని పోటిలో
కొఱ్ఱగింజలు కొన్ని కొఱికి కొఱికి,

తే॥ పొందితిప్పుడు భక్తుల పుణ్యముననుఁ
భోగమో యప్ప! యీ తెప్ప బోర్లపడిన
యేమి తినియెద? వరుల యుద్వృత్తి నడఁపు !
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 29

**అర్థములు:–** మెసఁగు = తిను; జీర్ణచేలము = చినిగిన గుడ్డ; పొదవు = దొరికిన, లభించిన; బొక్కు = ఏదేని నోటినిండ వేసికొని తిను; పాంచాలి = ద్రౌపది;

శాకభాండము = కూరకుండ; పోటిలో (పోడు + లో)–పోడు = చిఱువేరుపైరగు నేల (అడవిని నఱికి ఏర్పరచిన పొలమునకు 'పోడు' అని పేరు); తెప్ప = నావ; అరుల = శత్రువులు; ఉద్వృత్తి = దుష్ప్రవర్తనము.

**"బోయ దుగ్గన కథ":–** దుగ్గన ఆటవికుడు (బోయవాడు). దేవాలయ సమీపమున కొఱ్ఱలు పండించుకొనేవాడు. స్వామి వరాహరూపములో పోయి కొఱ్ఱలు తినేవాడు. చేను పాడగుచుండుట తెలిసి, దుగ్గన విల్లంబులతో మాటువేసి యుండెను. యథాప్రకారముగా వరాహస్వామి చేలో (పోటి–పోడు వ్యవసాయక్షేత్రంలో) ప్రవేశింపగా, దుగ్గన బాణము వదిలెను. స్వామికి అది ప్రక్కలో గ్రుచ్చుకొనెను; గాయమయ్యెను. ఆ వరాహము పారిపోగా, దుగ్గన వెంటబడి తరిమెను. ప్రస్తుతము నరసింహస్వామి కొలువైయున్న చోటువరకు ఆతడు వెంబడించెను. స్వామి అంతలో అదృశ్యమయ్యెను.

ఇది యొక లీల! ఈ అప్పన్న యనిన గిరిజనులకు ఇప్పటికీ ప్రాణాధికమైన ప్రేమ.

దుగ్గన బాణము చేసిన గాయము ఇప్పటికీ చెమర్చుచుండునని, స్వామికి చందనము ఒలిచిన సమయమున అట్లు కన్పించునని అర్చకస్వాములు నమ్ముచుందురు.

**భావము:–** ఓ! సింహాద్రి నారసింహస్వామీ! మిక్కిలిప్రేమతో శబరి ఇచ్చిన యెంగిలి పండ్లను తినినావు. కుచేలుడు చిరిగిన వస్త్రమున కట్టుకొని పట్టుకొని వచ్చిన ముక్కిపోయిన అటుకులను బొక్కితివి. అరణ్యవాస సమయమున ద్రౌపది వండిన కూరగిన్నెలోని బలుసాకు రుచిచూచితివి. "దుగ్గన" అను బోయవాని పొలములో దొంగతనముగా కొఱ్ఱగింజలను తినినావు. ఇప్పుడు మాత్రము భక్తుల పుణ్యమువలన అనేక భోగములను పొందుచున్నావు. ఈ వైభవము తలక్రిందులైనచో ఏమి తిందువు? కావున శత్రువుల విజృంభణమును అణచివేయుము.

**సీ॥ తనుదానె కౌగిలించెను నిన్ను రుక్మిణి,**
**యల సత్యయును పొలయలుక మానె;**
**క్షణమైనఁ బాయదు జాంబవతీదేవి,**
**మేనుమేనదియించె మిత్రవింద;**
**భద్రయు భవదూరు భద్రపీఠిక నెక్కె,**
**వదలకుండె సుదంత వామకరము;**

కాళింది నిజపాదకమల మొత్తుచునుండె,
లక్షణ మెయితీఁగె లాగుచెసఁగె;
తే॥ రాగనోపవొ! పాశ్చాత్యరాడ్బలంబు
సాధుతతిఁగొట్టి దోఁచగా చకితులయిరి!
తుది పనికివచ్చెలే నీకు తురక గుద్దు!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 30

**అర్థములు:–** పొలయలుక = ప్రణయకోపము; భవత్ + ఊరు = నీతొడ; పాదకమలము = పద్మమువంటి పాదము; పాశ్చాత్య – రాట్–బలము = పశ్చిమదేశీయరాజుల సైన్యము (తురకదండు).

**భావము:–** ఓ! సింహాద్రి నరసింహస్వామీ! రుక్మిణి తనంతట తానే నిన్ను కౌగిలించు కొన్నదనియు, సత్యభామకు అలుక తగ్గినదనియు, జాంబవతీదేవి ఒక్కక్షణమైన వదలక ప్రక్కనే నిలుచున్నదనియు, మిత్రవింద నీకు అతిసమీపమున నిల్చినదనియు, భద్రాదేవి నీతొడపై కూర్చున్నదనియు, సుదంత కుడిచేయి పట్టి వదలకున్నదనియు, కాళింది నీ పాదకమలము లొత్తుచున్నదనియు, లక్షణ మనోహరముగ చేరువున నున్నదనియు– రాలేకపోవుచున్నావా? శత్రువులు సాధుజనులను హింసించుచుండగా, దోచుకొను చుండగా, నీవిట్లు ఊరకుండుట భావ్యమా? చివరకు నీకు కూడ తురకగుద్దు పనికివచ్చునట్లున్నది!

సీ॥ తపనీయ కశిపుండు దండించు తరువాతఁ
గాని ప్రహ్లాదునిఁ గావలేదు,
కురురాజు పాంచాలి కొప్పు పట్టీడిపిం
చిన వెన్కఁగాని రక్షింపలేదు,
కరిరాజు మొసలిచేఁ గడు కష్టపడిన పి
మ్మటఁ గాని వేంచేసి మనుపలేదు,
పాండవుల్బాధలఁ బడిన యనంతరం
బునఁగాని సిరులిచ్చి ప్రోవలేదు,
తే॥ భక్తులిప్పుడు కొన్ని యాపదలఁబడక
ముందు పోషింప, వట్లయొ, కొందఱికిని

మును శిశువు నేడిపింపక ముద్దురాదు!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 31

**అర్థములు:-** తపనీయము = బంగారు, హిరణ్యము; తపనీయ కశిపుండు = హిరణ్యకశిపుడు; కురురాజు = దుర్యోధనుడు; కరిరాజు = గజేంద్రుడు.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహస్వామీ! హిరణ్యకశిపుడు ఎంతో శిక్షించిన తరువాత కానీ, నీవు ప్రహ్లాదుని రక్షించలేదు. దుర్యోధనుడు ద్రౌపది కొప్పుపట్టి సభకు ఈడిపించిన తరువాత కానీ, నీవు ఆమెను కాపాడలేదు. గజేంద్రుడు మొసలిచే ఎన్నో బాధలు పడిన పిమ్మటకానీ, నీవు వేంచేయలేదు. పాండవులు ఎన్నో క్లేశములు అనుభవించిన అనంతరముకానీ, వారికి భాగ్యములు ప్రసాదించలేదు. భక్తులు ఆపదలు పడిన తర్వాత కానీ, వారిని రక్షించవు. అంతేలే! కొందరికి ముందుగా పిల్లలను ఏడిపించకపోయినచో ముద్దురాదు!

సీ॥ జడవిప్పి జులపాలు సవరింపు మిరువంక,
బలు కిటికీదారు పాగcజుట్టు;
బొట్టు నెన్నుదుటిపై బొత్తిగాc దుడుచుకో,
పోగులూడ్పుము, చెవుల్పాడ విడువు;
వడిగ నంగీ యిజార్తొడుగు, దట్టీ జుట్టి
కైజారుదోపు, డాల్కత్తిc బట్టి;
బీబినాంచారిని బిలిపింపు వేగమే,
తుదకభ్యసింపుమీ తురకభాష!

తే॥ శక్తిలేకున్న నిట్టి వేషంబుc బూను
మన్న సరి, లోక వంద్యుcడవైన నీవు
నీచులకును సలామ్ సేయ నే సహింప!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 32

**అర్థములు:-** జులపాలు=పొడవైన జుట్టు; బలు=పెద్ద; కిటికీదారు=రహస్యద్వారమునకు కాపలాదారుడు; పాగ = తలపాగా; పోగులు = కర్ణాభరణములు; అంగి = మీcగాళ్ళc

దాక జాఱుగల చొక్కాయ; ఇజారు = చల్లడము, లాగు; కైజారు = బాకు; డాల్కత్తి (డాలు + కత్తి)= తళతళ మెఱయునట్టి కత్తి (డాలు=కాంతి).

**భావము:–** ఓ సింహాద్రి నారసింహస్వామీ! నీ జడవిప్పి ఇరువంకలా జులపాలు పెంచుకో! మంచితలపాగా ధరించుము. నెన్నుదుటిపై నామమును తుడుచుకో! చెవుల మకరకుండలాలు తీసివేయుము. పొడుగుపాటి చొక్కా, లాగు తొడిగికొని, బాకు నడుమున దోపుకొని, చేత డాలుకత్తి ధరించుము. బీబీనాంచారును పిలిపించి, త్వరగా తురకబాషను నేర్చుకొమ్ము. శక్తి లేకపోయినచో ఇట్టి తురకవేషము వేసిన సరిపోవును. లోకవంద్యుడవైన నీవు నీచులకు సలాముచేయుట నేను సహింపలేకపోవుచున్నాను.

**సీ॥ గోవర్ధన నగంబు గొడుగుగాఁబట్టిన**
**నాఁడు కేలున నొప్పి నాఁటెనొక్కొ!**
**సరిదెబ్బలాడుచో జాంబవంతుని గ్రుద్దు**
**కోరెక్కలోఁ గుట్లు పోరె నొక్కొ!**
**నరుని సారథివైననాఁడు భీష్మునిచేతి**
**కఱకుటమ్ముల తొమ్ము కవిసె నొక్కొ!**
**దుగ్గన బోయని తూపు నాఁటిన ప్రక్క**
**గాయ మిప్పటికిఁ బోదాయె నొక్కొ!**
**తే॥ యొక్కట యవనరాట్సేనఁ జక్కుచేసి**
**యుక్కణఁప వెందుచేత? నీవోపలేవు!**
**పేదవడుటెల్ల బయలను బెట్టవలయు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 33**

**అర్థములు:–** గోవర్ధన నగము = గోవర్ధన పర్వతము; కేలు = చేయి; సరిదెబ్బలాడుచో = ద్వంద్వయుద్ధము చేయునప్పుడు; కోరెక్కలో = రెక్కగూడులో(?); కుట్లు = నొప్పులు; (కుట్టునొప్పులు = చురుక్కున పొడుచు నొప్పులు); పోరు = పీడించు; కఱకు + అమ్ములు = కఱకుటమ్ములు = కఠినమైన బాణములు; కవియు = కమియు, నలఁగు, మాఁగు, కవులు, కందు; తూపు = బాణము; చక్కుచేసి = ఖండించి, ముక్కలు చేసి; ఉక్కు = దారుణము, క్రౌర్యము; ఓపలేవు = చాలలేవు, సరిపోలలేవు (ఓపు = చాలు); పేదవడు = దైన్యమును పొందు. ("బోయ దుగ్గన" కథకొఱకు 29వ పద్యము దిగువ చూడవలెను.)

**భావము:-** ఓ సింహాద్రి నారసింహస్వామీ! గోవర్ధన పర్వతమును గొడుగుగా పట్టి ఎత్తినప్పుడు, నీచేయి నొప్పిపుట్టినదా? జాంబవంతునితో ద్వంద్వయుద్ధము చేయునప్పుడు, అతని గుద్దుకు రెక్కలో బాధకలిగినదా? అర్జునునకు రథసారథియైనవేళ, భీష్మని బాణాలు నాటిన నీ ఱొమ్ము కంది పోయినదా? దుగ్గన బోయడు వేసిన బాణపు గాయము ఇప్పటికిని తగ్గలేదా? ఎందువలన యవనులసైన్యమును నాశనము చేయుటకు కదలిరాకుంటివి? నీవు వారిని ఎందువలన ఎదుర్కొన లేకున్నావు? నీవు దైన్యమునొందుటకు గల ఆ రహస్యము ఇప్పుడు బయటపెట్టుము!

**సీ॥ కనిపించుకోవుగా - ఖలులు మార్గస్థులఁ**
**గొంకక ముక్కులు గోయునపుడు,**
**ఆలకింపవుగదా - యయ్యయో! ప్రజఘోష**
**ధూర్తులు వడి నిళ్ళు దోఁచునపుడు,**
**జాలిగాదాయెగా - చటుల తురుష్కులు**
**భామినులను చెఱల్పట్టునపుడు,**
**అలుక రాదాయెగా - యవనులు "సత్ప్రభు"**
**వసుమతి ముట్టుకో వచ్చునపుడు,**
**తే॥ మంకుతనమేమి? మాతండ్రి! మఱచినాఁడ,**
**మానునే గొల్లపాల్ ద్రావ మందబుద్ధి?**
**దేవకీదేవి పాల్ద్రావఁ దెలివి రాదె?**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 34**

**అర్థములు:-** ఖలులు = దుర్మార్గులు; కొంకక = సందేహింపక; ధూర్తులు = మోసగాండ్రు; "సత్ప్రభువు" = మంచిరాజైన పూసపాటి విజయరామరాజు (విజయనగర ప్రభువు); వసుమతి = భూమి; మంకుతనము = మొండితనము.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహప్రభూ! ఈ యవనులు బాటసారుల ముక్కులు కోసి హింసించునపుడు ప్రత్యక్షము కావు. దుర్మార్గులు ఇళ్లు దోచుకొనుచుండగా ప్రజలు పెట్టు ఘోష నీచెవికి ఎక్కించుకొనవు. తురుష్కులు స్త్రీలను చెఱపట్టుచుండగా నీకు జాలి కలుగుటలేదు. సత్ప్రభువైన విజయరామగజపతి రాజ్యమును యవనులు ఆక్రమించుచుండగా నీకు కోపము వచ్చుట లేదు. ఇట్టి మంకుతనము ఎక్కడ నేర్చితివి?

ఆc! మరచిపోయితిని! గొల్లపాలు త్రావగా మందబుద్ధి రాకపోవునా? ఆ దేవకీదేవి పాలు త్రాగియుండినచో, నీకు తెలివి వచ్చియుండెడిది!

**సీ॥ అల విప్రభార్యయౌ నదితిపాల్ ద్రావుట-**
**బలియాచనావృత్తి పాదుకొనియె,**
**క్షత్రియకన్యయౌ కౌసల్యపాల్ ద్రావ -**
**రావణాదులc ద్రుంచి ప్రబలినావు,**
**గొల్లయౌ నందుని కులసతిపాల్ ద్రావc -**
**బసులc గాచెడి బుద్ధి పట్టువడియె,**
**నిసుమంత విసపురక్కసిపాలు చవిచూడc**
**గాcబోలు మాపట్ల కఠినవృత్తి!**

**తే॥ పాలకాగ్రణియైన గోపాలబాల!**
**పాలబుద్ధులు మాని, మాపాలc గలిగి,**
**పాలనమొనర్పవయ్య కృపాలవాల!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 35**

**అర్థములు:-** విప్రుడు = బ్రాహ్మణుడు; పాదుకొను = స్థిరపడు; పాలక + అగ్రణి = పాలించువారిలో ప్రథముడు; పాలబుద్ధులు = తేలిక ఆలోచనలు; కృపా + ఆలవాల! = దయకు స్థానమైనవాడా!

**భావము:-** ఓ సింహాద్రి నారసింహస్వామీ! బ్రాహ్మణుని భార్యయైన అదితిపాలు త్రాగుటవలన- బలిని యాచించుటకు పోవలసివచ్చినది (వామనావతారము). క్షత్రియ స్త్రీ అయిన కౌసల్యపాలు త్రావి, రావణాదులను వధించితివి (శ్రీరామావతారము). నందుని భార్యయైన యశోదపాలు త్రాగుటవలన -పసులను కాచు బుద్ధి పట్టుబడినది (కృష్ణావతారము). పూతన ఇచ్చిన విసముపాలు కొంచెము రుచిచూసినందువలన కాబోలు, మా పట్ల కఠినాత్ముడవైతివి. గోపాలబాల! పాలించువాడవు నీవే! ఇప్పటికైననూ తేలిక తలపులుమాని, మా పక్షమున నిలిచి, మమ్ము కాపాడుము!

**సీ॥ “బేగీ అరే అరబ్బీ పడోరే”యని**
**బోడి సన్యాసులc బొడుచువారు,**

"మ(త్రఖో మూపరుమాటీ" యనుచు వైష్ణ
వుల బొట్లు దుడువగఁ బోవువారు,
"పత్తరు కాయకు బందియారే చోదు
దే" వని శైవులఁ దిట్టువారు,
"కాలటీకా తూ నికాల్దే" వటంచు మా
ధ్వులఁ బ్రల్లదములాడి త్రోయువారు

తే॥ నగుచు, యవనులు మమ్ము నిట్లడలఁ జేయు
నట్టివాంద్రకు ద్విజులెంతయౌగద? గుడి
మ్రింగువానికి లింగ మూర్బిండి వడెము!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 36

**అర్థములు:-** "బేగీ" = త్వరగా; "అరే" = ఒరే; "పడోరే" (పఢోరే) = చదవరా; "మ(త్రఖో" (మత్ + రఖో) = పెట్టుకోవద్దు; "మూపర్" = ముఖము మీద; "మాటీ" = బొట్టు (నామము); "పత్తరు" ("పత్తర్") = ఱాయి, లింగము; "కాయకు" ("కైకో") = ఎందుకు; "బందియారే" = కట్టుకుంటావు?; "చోదుదేవ్" ("చోడ్‌దేవ్") = వదిలెయ్యి!; "కాలటీకా" (కాలాటీకా") = నల్లబొట్టు; "తూ" = నీవు; "నికాల్దేవ్" = తీసివేయుము!; వైష్ణవుల బొట్లు = నామాలు; ప్రల్లదములు = దూషణలు; ద్విజులు = బ్రాహ్మణులు; ఊర్బిండివడెము = ఊరుఁబిండితో చేసిన వడియము (ఊరుఁబిండి = (ఊరు + పిండి) = పచ్చడి).

**భావము:-** ఓ సింహాద్రి నారసింహస్వామీ! "అరే! త్వరగా అరబ్బీభాష చదవరా!" అని సన్యాసులను పొడుచుచున్నారు. "ముఖముపై ఆ నామమును పెట్టుకోవద్దు" అని వైష్ణవస్వాముల నామములను తుడిచివేయుచున్నారు. "రాతిని (లింగమును) కట్టుకుంటావెందుకురా? (పూజించడమేమిటిరా!) తీయండి!" అని శివభక్తులను తిట్టుచున్నారు. "ముఖంమీద నల్లని బొట్టులు (కస్తూరి బొట్టులు) చెరపండి" అని మాధ్వులను తిట్టుచున్నారు. ఈ విధముగా యవనులు చెలరేగుచున్నారు. నిన్నే భయపెట్టుచున్నవారికి బ్రాహ్మణులనగా లెక్కయా? గుడిని మింగువానికి, లింగము ఊరుబిండివడియము కదా!

సీ॥ విషవహ్నిఁ బ్రజకెల్ల వెతఁజేయఁ గాళీయు
పడగలు వడిఁద్రొక్కు పటిమయేది?

వడిగ బిడౌజుండు పిడుగులు వర్షింప
శైలమెత్తిననాఁటి శక్తియేది?
దుర్యోధనాదులు దొరలించుకొనువేళ
విశ్వరూపముఁజూపు వింతయేది?
ముర నరకాది ముష్కర దుష్కరాదుల
మర్దించి చెలఁగు నీ మహిమయేది?

తే॥ ఇట్లు ఖలులేఁచ దీనుల నెన్నఁటికిని
గరుణఁ జూచెదు? కలవాఁడు గాదెఁదీయుఁ
దనుక బీదల ప్రాణముల్ తాళుటెట్లు?
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 37

**అర్థములు:–** విషవహ్ని = విషమను అగ్ని; బిడౌజుఁడు = ఇంద్రుడు; శైలము = కొండ; దొరలించుకొనువేళ = ఎదిరించు సమయమున; ముష్కరులు = కుటిలురు; దుష్కరులు = చేయకూడని పనులు చేయువారు; ఖలులు + ఏఁచన్ = దుర్జనులు బాధించగా.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహస్వామీ! విషాగ్ని జ్వాలలు ప్రజలను మాడ్చుచుండగా, కాళీయుని పడగలపైకెక్కి త్రొక్కిన శక్తి ఏమైనది? ఇంద్రుడు పిడుగులతో రాళ్లవాన కురిపింపగా, గోవర్ధనమెత్తిన నీ శక్తి ఏది? కురసభలో దుర్యోధనాదులు నిన్ను బంధించుటకు చూడగా, విశ్వరూపము చూపిన ఘనత ఇప్పుడు ఏమయ్యెను? మురాసుర నరకాసురులను సంహరించిననాటి నీ గొప్పతనము నేడు కనుపింపదేమి? శత్రువులు దుర్మార్గులై, ప్రజలను బాధించుచుండగా, ఎప్పటికి వారిని రక్షింతువు? ఉన్నవాడు గాదెలు తీయునప్పటివరకూ పేదల ప్రాణాలు నిలుచునా?

సీ॥ ఆభీరగృహముల నారఁగాఁగిన పాల
మీఁగడ ల్వడి దిగ్రమింగఁగలవు!
తల్లి యిచ్చిన చల్ది తగ బ్రహ్మ వచ్చిన
వెనుకఁ జూడక వేగ విసరఁగలవు!
రాధికా మధురాధరామృతధారలు
గుటుకు గుటుక్కునఁ గ్రోలఁగలవు!

భక్తులెల్లరుఁ దిరుపణ్యారము లొసంగఁ
జెలఁగి లోలోన భక్షింపఁ గలవు!

తే॥ కాని యవనులపై వడిఁ బూనలేవు,
కబళమన నోరుఁ దెఱతువు, కళ్లెమన్న
మోముఁ ద్రిప్పు హయగ్రీవమూర్తి వహహ!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! **38**

**అర్థములు:–** ఆభీర గృహములన్=గొల్లల యిండ్లలోని; ఆరఁగాఁగు (ఆరన్ + కాఁగు) = పూర్తిగా కాఁగిన, బాగుగా కాఁగిన; మధుర + అధర + అమృతము = తీయని అధరామృతము; తిరుపణ్యారములు = పవిత్రములైన నైవేద్య పదార్థాలు; కబళము = ముద్ద; హయగ్రీవమూర్తి = గుఱ్ఱపుతల – మానవశరీరముతో నున్న విష్ణువు అవతారం.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! గొల్లల ఇళ్లలో బాగుగా కాగిన పాలు మీగడలు తినగలవు. తల్లి ఇచ్చిన చల్ది అన్నమును, బ్రహ్మ వచ్చిననూ పలుకరింపక తినగలవు. రాధికా మధుర అధరామృతములను గుటుకు గుటుకున గ్రోలగలవు. భక్తులు సమర్పించు పవిత్రములైన నైవేద్యములను ప్రీతిగా ఆరగించగలవు. కానీ యవనులపై పౌరుషముచూపి యుద్ధము చేయుటకు పోవు. అవునులే! కబళమునకు నోరు తెఱచి, కళ్ళెమునకు ముఖము త్రిప్పు హయగ్రీవుడవు (గుఱ్ఱపు తలగల స్వామివి) కదా!!

సీ॥ అల విభీషణు పల్కు లాదరించిన వాఁడె
యతిదుష్టుడౌ రావణాసురుండు?
వసుదేవ ముఖ్యుల వరబోధ వినియెనే
దుండగీఁడైన కంసుండు నాఁడు?
విదురాది బుధుల వివేకము ల్దెలిసెనే
క్రోధాత్ముఁడైన దుర్యోధనుండు?
భీష్మాదు లెంతచెప్పిన నిచ్చగించెనే
బాలిశుఁడగు శిశుపాలకుండు?

**తే॥ కొట్టకుండగ ధూర్తుల, వట్టి శాంతి**
**తాలిమేటికి? తురకలు తరిమి రాఁగ,**
**నొదిఁగి చూచెదు కలిబోయ నుట్లదిక్కు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 39**

**అర్థములు:–**దుండగీడు=దుష్టుడు; క్రోధ+ఆత్ముడు=కోపము కలవాడు; ఇచ్చగించు= ఇష్టపడు; బాలిశుఁడు=మూర్ఖుడు; ఒదిగి చూచు=ప్రక్కకు ఒంగి చూచు, ఒత్తిగిలిచూచు.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహస్వామీ! ఆనాడు విభీషణుడు చెప్పిన మాటలు దుష్టుడైన రావణుడు ఆదరించలేదు. వసుదేవుడు మొదలగు పెద్దలు చెప్పిన బోధలను దుండగీడైన కంసుడు చెవినిబెట్టలేదు. విదురుడు మొదలగు నీతిమంతులు చెప్పిన హితోక్తులను దుర్యోధనుడు వినలేదు. భీష్మాదులు ఎంత చెప్పినను శిశుపాలుడు శాంత భావమును పూనలేదు. ఒక ప్రక్క తురకలు తరుముకొనివచ్చుచుండగా ఓర్మి వహించుట మంచిదికాదు. ఇది దోసిటిలో గంజిపోయుచుండగా, ఉట్లకేసి చూచునట్లున్నది! ధూర్తులను వేంటనే శిక్షింపుమయ్యా!

**సీ॥ నిదురించినావొ నిర్నిద్ర భద్రాకార**
**కలిత భోగీంద్ర భోగంబుమీఁద?**
**శయనించినావొ శైశవమూర్తితోఁ బయః**
**పాథోధి పటు వటపత్రసీమఁ?**
**బవళించినావొ శ్రీభామినీ దోర్మూల**
**కూలంకష స్తనకుంభ యుగళిఁ?**
**బడక గావించితో భక్తసమ్రాణ్మన**
**స్సంకల్పితానల్ప శయ్యయందు?**
**తే॥ నిబిడ పాశ్చాత్య భీతులై నిఖిల జనులు**
**కదిసి మొఱవెట్ట నీకెట్లు నిదురపట్టె?**
**లెమ్ము నాసామి! జాగేమి? చిమ్ము రిపుల!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 40**

**అర్థములు:–** నిర్నిద్ర = జాగరూకత; భద్ర + ఆకార = శుభాకార; భోగి + ఇంద్ర = ఆదిశేషుడు; భోగము = పడగ; పయఃపాథోధి = పాలసముద్రము; వటపత్రము =

మఱ్ఱియాకు; శ్రీభామిని = లక్ష్మీదేవి; కూలంకష = క్రిక్కిఱిసిన; స్తనకుంభయుగళి = కుండలవంటి పాలిండ్ల జంట; భక్త సమ్రాట్ + మనస్ + సంకల్పిత + అనల్ప + శయ్య = గొప్ప భక్తులు (భక్త చక్రవర్తులు) తమ మనస్సులో ఊహించుకొనిన విశాలమైన శయ్య; జాగు = ఆలస్యము; చిమ్ము = వెడలగొట్టు; రిపులన్ = శత్రువులను.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహస్వామీ! శుభాకారమైన ఆదిశేషుని పడగలపైన జాగ్రత్తగా నిద్రించుచున్నావా? శిశువువై పాలసముద్రమున మఱ్ఱాకుపై పవళించియున్నావా? లక్ష్మీదేవియొక్క క్రిక్కిరిసిన కుండలవంటి చనుదోయిపై పవళించితివా? భక్తులు మనస్సులో సంకల్పించి భావించుకొనిన విశాలమైన శయ్యపై నిద్రించితివా? పాశ్చాత్య యవన సేనకు భయపడి ప్రజలు నీకు మొఱపెట్టుచుండగా నీకెట్లు నిద్రపట్టినది? లెమ్ము! ఇకనైనన శత్రువులను పారద్రోలుము! జాగుచేయవలదు!

**సీ॥ నినుఁ బూజగావింప ఘనవిప్రు లేటికిఁ?**
**గొదవగాకుండ సయ్యదులె కలరు!**
**వినుతింప శాస్త్రజ్ఞ విద్వాంసు లేటికి?**
**వీలుఁగావించు మౌల్వీలె కలరు!**
**ఆత్మకీర్తనఁజేయ హరిభక్తు లేటికిఁ?**
**గేకలువేయు పకీర్లె కలరు!**
**పూతాత్ములగు ననుష్ఠాతలు నీకేల?**
**తఱుచుగా పీరుజాదాలె కలరు!**

**తే॥ వట్టి యాసల నిటు మెడవట్టి త్రోయఁ**
**జూరుఁ బట్టుక వ్రేలాడినార, మిట్టి**
**ముచ్చటకె నీవు పశ్చిమ ముఖుఁడవౌట!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !** **41**

**అర్థములు:-** "సయ్యద్లు – మౌల్వీలు – ఫకీర్లు – పీర్జాదాలు" = తురకల మసీదులలో వారు చేయు వృత్తులనుబట్టి వచ్చిన పేర్లు (హిందువులదేవాలయములలోని పూజార్లు వేదపండితులు–వంటివారు). పకీర్లు = బైరాగులు; కొదవ = కొఱఁత, లోపము; వినుతించు = స్తుతించు, పొగడు; శాస్త్రజ్ఞ విద్వాంసులు = శాస్త్రజ్ఞానముగల పండితులు; వీలున్ + కావించు = అనుకూలము చేయు; పూత + ఆత్ములు = పవిత్రమైన

మనస్సుకలవారు; అనుష్ఠాతలు = వ్రతమును పాటించువారు; పశ్చిమముఖుడు = పడమటికి తిరిగి నిలిచినవాడు (విముఖుడు). (తురకలు పడమటి దిక్కువైపు తిరిగి ప్రార్థనలు చేయుదురు. నరసింహస్వామి వారిపై అభిమానము చూపుచు, తాను కూడ పశ్చిమ ముఖముగానున్నాడని కవి ధ్వనిగర్భితముగా నిందించుచున్నాడు.)

**భావము:-** ఓ సింహాద్రి నారసింహప్రభూ! నిన్ను పూజించుటకు గొప్పబ్రాహ్మణు లెందులకు? అందుకు 'సయ్యద్'లు ఉన్నారు. ఉపచారములు చేయుటకు మాల్వీలుండగా, నిన్ను స్తుతించుటకు శాస్త్రజ్ఞులు విద్వాంసులు ఎందులకు? పీర్‌జాదాలు ఉండగా, పవిత్ర అనుష్ఠానములు చేయువారితో నీకు పని ఏమున్నది? నీపై ఆశపెట్టుకొని, మెడపట్టుకు త్రోయగా చూరుపట్టుకుని వ్రేలాడుచున్నాము. నీకు పాశ్చాత్యులపైనే ముచ్చటకలదు. అందుకే నీవు పశ్చిమ ముఖుడవైనావు! (సింహాచలమున స్వామి పటమటిముఖమై నిలిచియుండును. కావున కవి "నీవు పశ్చిమ ముఖుడవు" అని చమత్కరించెను.)

**సీ॥ "జయ విజయీభవ! జగదవనాసక్త!**
**జయ విజయీభవ! శౌర్యయుక్త!**
**జయ విజయీభవ! శాశ్వతకల్యాణ!**
**జయ విజయీభవ! నయధురీణ!**
**జయ విజయీభవ! సర్వంకషప్రజ్ఞ!**
**జయ విజయీభవ! సన్మనోజ్ఞ!**
**జయ విజయీభవ! సాధుజనాధార!**
**జయ విజయీభవ! భయవిదూర!"**

**తే॥ యనుచు జయవాక్యముల జనుల్వినుతిసేయఁ**
**జక్రహస్తుఁడవై రిపుక్షయ మొనర్చి**
**ధరణిఁ బాలింపు మాచంద్రతారకముగ!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 42**

**అర్థములు:-** జగత్ + అవన + ఆసక్త! = ప్రపంచమును కాపాడుటయందు కోరికగలవాడా!; నయధురీణ! = నీతిమార్గమును వహించినవాడా!; సర్వంకష ప్రజ్ఞ! = సర్వతోముఖమైన ప్రతిభకలవాడా! (గొప్ప తెలివిగలవాడా!); సత్ + మనోజ్ఞ! =

శ్రేష్ఠమైన (సత్యమైన) సౌందర్యము కలవాడా!; సాధుజన + ఆధార! = సజ్జనులకు ఆధారమైనవాడా!; భయవిదూర! = భయములేనివాడా!; రిపుక్షయము = శత్రునాశము; ఆచంద్రతారకముగ = చంద్రులు, చుక్కలు ఉన్నంతకాలము (శాశ్వతముగా).

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! "జగద్రక్షకా! శౌర్యము కలవాడా! నీకు జయమగుగాక! శాశ్వతకల్యాణా! నీతి మార్గమున చరించువాడా! నీకు జయమగుగాక! గొప్ప ప్రజ్ఞకలవాడా! అందగాడా! నీకు జయము! శిష్టజనులకు ఆధారమైనవాడా! భయమెరుగనివాడా! నీకు జయము–" అని నీకు భక్తులు జయవాక్యములు పలుకుచుండగా, చక్రముతో శత్రువులను సంహరించుము. ఆచంద్రతారకముగా భూమిని పరిపాలించుము!

**సీ॥ చాటకపోఁజుమీ! చాలఁబ్రోవక యున్న–**
**నాఁటి వ్రేపల్లెలో ఱోటిమాట!**
**ప్రకటింతుఁజుమి! మమ్ము రక్షింపకుండినఁ–**
**దగ గొల్లచెలుల వస్త్రములమాట!**
**దాఁచనుజుమి! మమ్ము దరిఁజేర్చకుండినఁ–**
**గొంకక మధురలోఁ గుబ్జమాట!**
**బైటబెట్టెదఁజుమీ! పాలింపకుండినఁ–**
**గాలయవనునాఁటి కానిమాట!**

**తే॥ మర్మమెఱిఁగిన వారితో మానువాదు,**
**బైసి పోగొట్టుకోకు, మాపాలఁ గలిగి**
**సాధురక్షణ దుష్టశిక్షణ మొనర్పు!**
**వైరిహరరంహా! సింహాద్రి నారసింహా! 43**

**అర్థములు:–** బ్రోవకయున్నన్ = రక్షింపకున్నచో; కొంకక = భయపడకుండ (కొంకు = భయము, సందేహము); కానిమాట = కూడనిమాట; బైసి = గౌరవము, పుట్టుపూర్వోత్తరము, సిగ్గు.

**భావము:–** ఓ సింహాచల నారసింహప్రభూ! నీవు మమ్ములను రక్షించకుండినచో – నిన్ను యశోద ఱోటికి కట్టిన సంగతి చాటి చెప్పెదను సుమా! మమ్ము రక్షింపకుండినచో

– గొల్లకన్యల వస్త్రములు దొంగిలించిన విషయము అందరికిని చెప్పెదను. నీవు మమ్ము ఒడ్డుచేర్పనిచో– మధురలో కుబ్జతో చేసిన రాగమును దాచకుండా అందరికిని చెప్పెదను. మమ్ముకాపాడకున్నచో– నీవు కాలయవనునికి భయపడి పారిపోయిన వృత్తాంతము బైటపెట్టెదను. నీ రహస్యములు (పుట్టుపూర్వోత్తరములు) అన్నియును తెలిసిన మాతో గొడవపెట్టుకొనవలదు. అందువల్ల నీకు అపఖ్యాతియే! కావున వేంటనే దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయుము!

**సీ॥ ఖల వధార్థమునందు నిలయమొందితివంటి–**
**నల వెన్న దొంగిలి తనుటలేదు!**
**లక్ష్మియౌ రుక్మిణీలలనఁ గూడితివంటి–**
**నలరాధ మరగితి వనుటలేదు!**
**అవనిఁ బాలింపగా నవతరించితివంటిఁ–**
**బశుపాలకుఁడవని పలుకలేదు!**
**దుష్టులౌ రాజదైత్యుల హరించితివంటి–**
**నల నరసారథి వనుటలేదు!**

**తే॥ అయ్య! యెదఁగాఁడ నామాట లనకమున్నె**
**ఖలుల వధియించి నీ సిగ్గు నిలుపుకొమ్ము,**
**పరులు నవ్వఁగ నపకీర్తి పాలుగాక!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 44**

**అర్థములు:–** ఖల–వధ+అర్థము = దుష్టులను సంహరించు నిమిత్తము; నిలయమొందు (నిలయము+ఒందు)=అవతరించు; దుష్టులౌ రాజదైత్యులు= దుర్మార్గులగు రాక్షసరాజులు; నరసారథి = అర్జునునకు సారథి (పార్థసారథి); సిగ్గు = స్తుత్యాదులచే కలిగెడు మనస్సంకోచము (ఇక్కడ "గౌరవము" అని చెప్పుకొనవలెను.)

**భావము:–** ఓ సింహాద్రి నారసింహస్వామీ! దుష్టులను సంహరించుటకే పుట్టితివని అంటిని కానీ, వెన్నదొంగవని అనలేదు. లక్ష్మీ అవతారమైన రుక్మిణిని పెండ్లియాడితి వంటిని కానీ, రాధతో గడిపినావు అని అనుటలేదు. భూమిని పాలింపగా అవతరించినావంటిని కానీ, పశుపాలన చేసినావని పలుకలేదు. దుష్టులైన రాక్షసరాజులను ఖండించితివని చెప్పితిని కానీ, అర్జునునకు సారథివని అనుటలేదు.

స్వామీ! నీ మనస్సునకు నొప్పికలుగునట్లు ఆ మాటలు నేను అనకముందే – రమ్ము – శత్రువులను వధించుము. ఇతరులు నవ్వగా అపకీర్తిపాలు గాకుండ రమ్ము!

**సీ॥ గ్రామదాహకకర్మగతి మానుపు మటన్న-**
**వెస నదే మఱియుఁ గావించె దీవు,**
**పథికుల దోపించు పగ మానుపు మటన్న-**
**వెస నదే మఱియుఁ గావించె దీవు,**
**చెఱలుఁ జూఱలుఁ బట్టు సేగి మాన్పు మటన్న-**
**వెస నదే మఱియుఁ గావించె దీవు,**
**బహుసస్య నాశనార్భటి మానుపు మటన్న-**
**వెస నదే మఱియుఁ గావించె దీవు,**

**తే॥ వేడుకొనుకొద్ది లావాయె, వెట్టివాఁడ!**
**యోడముంచకు మనురీతి యొనరె మాకు!**
**బుద్ధిఁతెచ్చుకో! యవనుల పొంకమణఁచు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 45**

**అర్థములు:–** గ్రామ–దాహక–కర్మ = గ్రామములను – తగులబెట్టుట–అను పని; వెసన్ = శీఘ్రముగా; పథికులు = బాటసారులు; చెఱలు (పట్టు) = స్త్రీలను చెఱపట్టుట; చూఱలుపట్టు = (ప్రజలను) దోచుకొనుట; సేగి = ఆపద, కీడు; బహు–సస్య–నాశన + ఆర్భటి = పలు విధముల–పంటలను – నాశనము చేయుటలోని – విజృంభణము; లావు+ ఆయె = అతిశయము ఎక్కువైనది; పొంకము =గర్వము, వృద్ధి.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! యవనసైన్యము గ్రామములకు నిప్పు పెట్టుచుండుట మానిపింపుమని కోరగా, వేగముగా అదే పని మరల జరిపించుచున్నావు. స్త్రీలను చెఱపట్టుట– ధనమును దోచుటలు అను ఆపదలు మానిపింపుమని వేడుకొనగా, వడిగా ఆ పనులనే మరల జరిపించుచున్నావు. యవనులు పంట చేలను ధ్వంసముచేయుట ఆపుమని ప్రార్థింపగా, శీఘ్రముగా అదే దుష్కార్యము మరల జరిపించుచున్నావు. బ్రతిమాలుచున్నకొలదీ నీకు అతిశయము ఎక్కువగునట్లున్నది. “వెట్టివాడా! ఓడ ముంచకుము” అను సామెతగా నున్నది నీ వ్యవహారము. ఇప్పటికైనను బుద్ధితెచ్చుకొని, యవనుల గర్వమణచుము.

**సీ॥ మామిడి చిగురు సొంపేమి లక్ష్యంబన**
**కరచరణాంబుజకాంతి వెలుఁగఁ,**
**గలకలనవ్వు చక్కని ముద్దునెమ్మోము**
**పద్మసౌభాగ్యంబుఁ బరిహసింప,**
**వెలిదమ్మిరేకుల వెలవెలఁ బోఁజేయు**
**సోగకన్నుల చూపు చోద్యపఱుప,**
**నిద్దంపు నునుఁ జెక్కుటద్దంబులందు నీ**
**మొలక నవ్వుల తేట ముద్దుగులుక,**
**తే॥ నపుడుఁ బుట్టిన పసిబిడ్డఁడనఁగఁ, బాల**
**కడలి మఱ్ఱాకుపైఁ బండి, కరుణ జగముఁ**
**బ్రోతువఁట! మమ్ము గావవిప్పు డిదియేమి?**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 46**

**అర్థములు:-** సొంపు=అందము, సౌందర్యము; కర-చరణ+అంబుజ-కాంతి = చేతులు -పాదములు-(అనెడి) పద్మముల-కాంతి; నెమ్మోము=నిండైన మోము; వెలిదమ్మి= తెల్లతామర; సోగకన్నులు=పొడవుగానుండు అందమైనకన్నులు; చోద్యము= ఆశ్చర్యము; నిద్దంపు = నినుపైన; చెక్కుటద్దములు = అద్దములవంటి చెక్కిళ్ళు; పండి =పండుకొని.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహప్రభూ! మామిడి చిగురుకంటె కాంతికలిగిన కాలుసేతులతో, కలకలనవ్వు చక్కని ముద్దుమొగము పద్మముకన్న మిన్నగా ప్రకాశింపగా, తెల్లతామరపూలకంటె ప్రకాశముగల సోగకన్నులతో, నున్నని అద్దములవంటి చెక్కిళ్ళయందు చిఱునవ్వు ముద్దులు మూటకట్టుచుండగా, అప్పుడే పుట్టిన శిశువువలె మఱ్ఱాకుపై పరుండి, లోకములను రక్షించెదవట! ఇప్పుడు మమ్ములను రక్షింపవేమి?

**సీ॥ పుడమిపై నడుగిడి నడువనేరనివారి**
**తీవ్రతఁ బరువు లెత్తించినావు,**
**పైమీఁది దుప్పటి బరువనువారిచే**
**మించైన మూట మోయించినావు,**

గడపదాటని కులకాంతామణుల పృథ్వి
నెల్లెడఁ గలయఁ ద్రిప్పించినావు,
షడ్రసోపేతాన్న సంభోక్తృ జనపరం
పర బలుసాకు పాల్పఱచినావు,
తే॥ భళిర! యఘటన ఘటన ప్రభావమెల్ల
దీనజనులందె చూపితి, తెలిసివచ్చె,
"నయ్య సామెల్ల నింటనే" యన్నమాట!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 47

**అర్థములు:–** పుడమి = నేల; మించు + ఐన = పెద్దదియైన; కులకాంతామణులు = మంచి ఇల్లాండ్రు; పృథ్వి = భూమి; షట్+రస+ఉపేత+అన్న+సంభోక్తృ+జనపరంపర = ఆరు రుచులతో కూడిన భోజనమును చక్కగా తినెడి జనసమూహము; అఘటనఘటనము = జరుగని పనులు జరుపుట; ప్రభావము = మాహాత్మ్యము.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహస్వామీ! సరిగా నిలబడి నడువలేని పసివాళ్లచే పరుగులు పెట్టించితివి. పైమీది దుప్పటికూడ బరువగు వృద్ధులచే మూటలు మోయించినావు. గడపదాటని ఇల్లాండ్రను ఊళ్లు తిరుగునట్లు చేయించినావు. షడ్రసాన్నములు తినువారిచే బలుసాకు తినిపించినావు. నీ అఘటన ఘటనా ప్రభావమునంతయు దీనులపైనే చూపించినావు. 'అయ్య సామంతయు ఇంటిలోనే' అన్న సామెత నిజము చేసితివి. (యవనుల దాడిలో ప్రజలు పడుచున్న కష్టములను కవి ఈ పద్యమున తెలిపినాడు. క్రీ.శ. 1707లో ఔరంగజేబు మరణించిన తరువాత కూడ హిందువుల బాధలు పరిసమాప్తము కాలేదు. తరువాత కూడ కొనసాగినవని ఈ శతకమునందలి ఇటువంటి పద్యములు చాటుచున్నవి – సంపాదకుడు)

సీ॥ భవదీయ ముఖభవ బ్రాహ్మణోత్తములకా
యవనులచేత నాయాసపడుట?
భవదీయ బాహుసంభవ రాజవరులకా
మ్లేచ్ఛనాథుల గెల్వలేకయుంట?
భవదూరుసంభవ బహువైశ్యకోటికా
తురకలచే నిట్లు దోఁపుఁబడుట?

భవదీయ పాదసంభవ శూద్రజనులకా
కుమతులౌ తురకల వెట్టిచేత?
తే॥ మాకుఁ జెప్పకు, మెట్లైన మంచిదిగద!
లోకకర్తకు నపకీర్తి నీకువచ్చు
వలదు నాయన్న! యికనైన ఖలుల నణఁచు!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 48

**అర్థములు:–** భవదీయ = నీయొక్క; ముఖభవ = ముఖమునుండి పుట్టిన; బాహుసంభవ = భుజములనుండి పుట్టిన; భవత్ + ఊరు – సంభవ = నీ తొడలనుండి పుట్టిన; ఖలులు = దుర్జనులు, క్రూరులు, నీచులు.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! నీ ముఖమునుండి పుట్టిన బ్రాహ్మణులు యవనులచే బాధింపబడుచున్నారు. నీ భుజములనుండి ఉద్భవించిన రాజశ్రేష్ఠులు ఈ మ్లేచ్ఛులను జయింపలేక పోవుచున్నారు. నీ తొడలనుండి పుట్టిన వైశ్యజాతి తురకలచే దోచుకొనబడుచున్నది. నీ పాదములనుండి పుట్టిన శూద్రజనులు, దుర్మార్గులగు తురకలకు వెట్టిచాకిరి చేయుచున్నారు. ఏమైననూ మంచిదే! ఇది నీకే అపకీర్తి కలిగించును. ఆలస్యము చేయవలదన్నా! దుష్టశిక్షణ సేయుము.

సీ॥ రాఘవ! మముఁబ్రోవ రావయ్య ఖగయాన !
రాకున్న మీ దశరథుని యాన!
శీఘ్రంబు మమ్ము రక్షింపు శేషశయన!
జాగుచేసినను గౌసల్య యాన!
మది కఠినతమాని మనుపుము మా యాన!
మనుపకున్న వశిష్ఠమౌని యాన!
పాలింపు మమ్ము నీ పరమసత్కృప యాన!
పాలింపకున్న శ్రీభామ యాన!
తే॥ యానఁబూన సమర్థుఁడ వఖిలజగము
నానఁదప్పక పోషింపుమా నతారి!
తగవుఁ దప్పి నటింపగా ధర్మమగునె?
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 49

**అర్థములు:–** ఖగయాన! = పక్షిని (గరుత్మంతుని) వాహనముగా కలవాడా!; ఆన = ఒట్టు; శేషశయన = ఆదిశేషునిపై పవళించినవాడా!; మనుపుము = రక్షింపుము; శ్రీభామ = లక్ష్మీదేవి; ఆన తప్పక = ప్రతిజ్ఞ తప్పకుండ; నత + అరి = నీ పాదములపైకి వంగిన శత్రువులు కలవాడా! (శత్రువులందరును నీ పాదములపైబడి వేడుకొను చున్నారు), లొంగిపోయిన శత్రువులు కలవాడా!

**భావము:–** ఓ సింహాద్రి నరసింహస్వామీ! గరుడవాహన! రామయ్యా! మమ్ము రక్షించుటకు రావయ్యా! రాకున్నచో మీ తండ్రి దశరథునిపై ఒట్టు సుమీ! శేషశయన! మమ్ము శీఘ్రముగా రక్షించుము. ఆలస్యము చేసినచో మీయమ్మ కౌసల్య పై ఒట్టు! నీ మనసులో మాపై కఠినభావము మాని, మాపై ఆనగా మమ్ములను రక్షింపుము. రక్షింపకున్నచో మీ కులగురువులు వసిస్ఠులపై ఒట్టే! నీ జాలిగుండె ఆనగా, మమ్ములను రక్షింపుము. పాలింపకున్నచో లక్ష్మీదేవిపై ఒట్టు! ప్రతిజ్ఞాపాలనము చేయు సమర్థుడవు. ఓ శత్రుంజయా! సమస్త జగమును ఆజ్ఞతప్పక పోషింపుము. ఆడినమాట తప్పుట ధర్మముకాదు కదా! (దుష్టశిక్షణ – శిష్టరక్షణ – ధర్మసంస్థాపన – అనునవి స్వామి ప్రతిజ్ఞావచనములు).

**సీ॥ అరులఁగొట్టక సింహగిరిగుహ డాఁగిన–**
**నవని నిన్ బిఱికివాఁడందురయ్య!**
**నీవు రక్షింపక నీలాద్రికేఁగిన–**
**నవని నిన్మొండివాఁడందురయ్య!**
**పోషింపఁగాలేక శేషాద్రికేఁగిన–**
**నతిలోభివనుచు నిన్నందురయ్య!**
**తగనాదరింప కంతర్వేదికేఁగిన–**
**నత్యుగ్రుఁడంచు నిన్నందురయ్య!**

**తే॥ నాథ! ఇటు లోకనటనంబొనర్చు నీకు**
**నహహ! నిందలువచ్చు, నీ వవియు విడిచి**
**యొద్దుకొనఁబోకు, వెసఁబ్రోవు మర్విజనుల,**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 50**

**అర్థములు:–** అరులన్ = శత్రువులను; డాఁగు = దాఁగు; అవని = భూమి; అతి +

ఉగ్రుడు = మిక్కిలి కోపము గలవాడు; లోకనటనము = లోకముకొఱకు నటనము; ఒడ్డుకొనcబోకు = తప్పించుకొనవద్దు; వెసన్ + బ్రోవు = త్వరగా రక్షింపుము.

**భావము:–** ఓ సింహాద్రి నరసింహ ప్రభూ! శత్రువులను జయింపకుండ, సింహాచల గుహలలో దాగిన, నిన్ను పిఱికివాడందురు. మమ్ము రక్షింపకుండ, నీలాచలమునకు వెళ్లినచో, నిన్ను మొండివాడందురు. భక్తజనులను పోషింపగాలేక, నీవు శేషాద్రికి పోయినచో, నీకు అతిలోభివను నింద తప్పదు. మమ్మాదరింపకుండ నీవు అంతర్వేదికి పోయినచో, నిన్ను 'ఉగ్రు'డందురు (అంతర్వేదిలో ఉగ్రనరసింహావతారము కలదు). స్వామీ! ఈ విధముగా నటించినచో నీకు నిందలు వచ్చును. ఈ నిందలన్నియు విడిచిపెట్టి, తప్పించుకొనవలెనని చూడవద్దు. త్వరగా వచ్చి ఈ ప్రజలను రక్షింపుము.

**సీ॥ అరిసైన్యధూళి సూర్యాక్రాంతమై మించె,**
**నిcకనేమి దయcజూచెదీవు మమ్ము?**
**పరభేరి భాంకృతు ల్పగిలించె దిశల, నిం**
**కేమి నామొఱ వినియెదవు నీవు?**
**ధర శత్రుహరిఖుర దళితమయ్యె ,నికేcమి**
**వచ్చెదవయ్య బ్రోవంగ మమ్ము?**
**వైరితేజశ్శిఖి జ్వలియించె, నింకేమి**
**మొగమునc జూచెదు జగతి జనుల?**

**తే॥ నీ పయికి వచ్చునప్పుడు నీ వెఱుంగ**
**వేమి? మసలకు మింక దిక్కేది మాకు?**
**జాగరూకుండవై రిపుక్షయమొనర్పు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 51**

**అర్థములు:–** అరిసైన్యధూళి = శత్రుసేనలు వచ్చినప్పుడు చెలరేగెడి దుమ్ము; సూర్య + ఆక్రాంతము + ఐ = సూర్యమండలము ఆక్రమించినదై; పరభేరి భాంకృతులు = శత్రువుల భేరీ భాంకారములు; శత్రు–హరి–ఖుర–దళితము = శత్రువుల– గుఱ్ఱముల– డెక్కలచే – చీల్చబడినది; మసలకుము = తడవు (ఆలస్యము) చేయవలదు; రిపుక్షయము = శత్రునాశము.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహప్రభూ! శత్రుసైన్యమువలన చెలరేగిన ధూళి సూర్యమండలమువరకు కప్పివేసినది; ఇంక నీవు దయచూచుటన్నది కల్ల! శత్రుసైన్యములు మ్రోగించిన భేరీభాంకారములు దిక్కులను పగలగొట్టుచున్నవి; ఇంక మా మొర ఏమి వినెదవు? శత్రువుల గుఱ్ఱాల డెక్కలచే భూమి బ్రద్దలగుచున్నది; ఇంక మమ్మేమి రక్షింతువు? శత్రువుల శౌర్యాగ్ని వెలుగుచుండగా, ఇంక మా మొగమేమి చూచెదవు? శత్రువులు నీ పయికి వచ్చునప్పుడు నీకు తెలియదా? ఇక జాగరూకుడవై శత్రువులను నశింపజేయుము!

**సీ॥ ప్రజలెల్ల విసికిరి - పాశ్చాత్యరాట్చమూ**
**భీతులై మిమ్ములఁ బిలిచిపిలిచి;**
**జనులు వేసారిరి - సమద తురుష్కుల**
**వెతలచే మిమ్ముల వేడివేడి;**
**నరులెల్ల స్రుక్కిరి - నానాయవనహృత**
**రుక్ములై మిమ్ముల మ్రొక్కిమ్రొక్కి;**
**ప్రాణిసంతతి భంగపడియె - ఖానులు సేయు**
**దరిలేని వెత మిమ్ముఁ దలఁచితలఁచి;**

**తే॥ యిందుఁగల దందులేదను సందియంబుఁ**
**జెందవలదను వేదవాగ్బృందమెల్ల**
**నెందు వెదకినఁ గానరావేమి యిపుడు?**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 52**

**అర్థములు:-** పాశ్చాత్య రాట్ + చమూ - భీతులు = పశ్చిమదేశ రాజసైన్యమునకు భయపడినవారు; వేసారు = శ్రమపడు, నొచ్చు, విసుగు, విచారము పొందు; స్రుక్కు = భయపడు, దుఃఖించు; హృతరుక్ములు = (తమదగ్గరున్న) బంగారము దొంగిలింపబడినవారు; వేదవాక్ + బృందము = వేదవాక్కుల సమూహము.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహప్రభూ! పాశ్చాత్యసైన్యమునకు భయపడి ప్రజలు నిన్ను పిలిచిపిలిచి విసిగిపోయిరి. తురుష్కులుపెట్టు కష్టములను పోగొట్టుమని నీకు

మొఱపెట్టిపెట్టి జనము వేసారుచున్నారు. వారి సంపదలను యవనులు దోచుకొను చుండగా ప్రజలు నీకు మ్రొక్కిమ్రొక్కి అలసిపోయినారు. సమస్త ప్రాణులు ఆపదలో పడి నిన్ను తలచితలచి భంగపడినవి. హరి ఎక్కడ చూచిన అక్కడే కలడని వేదములు వక్కాణించుచుండగా, ఇప్పుడు నీవు ఎక్కడ వెదికిననూ కనుపించుటలేదు!

**సీ॥ బహుఫణాదీప్తుఁడౌ ఫణిరాజుపైఁ బండి**
**గాలివారకయుండఁ గాచెదీవు,**
**వరగరుద్విస్ఫురద్గరుఁడునిపైఁ జెంది**
**చిరసుఖగతుల రక్షించెదీవు,**
**వేత్రాధిగత జగద్వితతి విష్వక్సేను**
**దరిఁజేర్చి బలయుక్తిఁ దనిపెదీవు,**
**ఘనభుజాబలవంతు హనుమంతు నెదఁజేరి**
**యెలమి బ్రహ్మానందమిచ్చె దీవు,**
**తే॥ పొసఁగ నీరీతిఁ దలపోయ పొడుగుచేతి**
**వాని పణ్యారమాయెగా! దీనపాల**
**పృథుబిరుదులిల నేమూలఁ బెట్టినావు?**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 53**

**అర్థములు:–** బహుఫణాదీప్తుఁడౌ=అనేక పడగలచే ప్రకాశించువాడైన; ఫణిరాజు = ఆదిశేషుడు; వర–గరుత్ + విస్ఫురత్ + గరుడునిపైన్ + చెంది = గొప్ప ఱెక్కలతో ప్రకాశించు గరుత్మంతునిపై నివసించి; వేత్ర + అధిగత = బెత్తమునకు లోబడిన; జగత్+వితతి = లోకసమూహముగల; తనుపు = తృప్తిపడునట్లు చేయు, కాపాడు; పణ్యారము = భక్ష్యము.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! చాలపడగలుగల ఆదిశేషునిపై పరుండి, ఆయనకు చలిగాలి తగులకుండా రక్షించెదవు. గొప్ప ఱెక్కలుగల గరుత్మంతునికి చిరతర సుఖములిచ్చి గాచుచుందువు. బెత్తముపట్టుకొని నీకు రక్షణగా నిలిచిన విష్వక్సేనునికి మిక్కిలి బలమునిచ్చి సంతోషపెట్టెదవు. మహాబలశాలియైన

హనుమంతుని హృదయములోనుండి, ఆయనకు బ్రహ్మానందము నిచ్చెదవు. చూడగా చూడగా నీవు పొడుగుచేతులవాని చేతనున్న భక్ష్యమైనట్లున్నావు. (పెద్దలకే కాని నీ దయ సామాన్యులకు లభించదని-నింద). నీకున్న "దీనపాలుడు", ("కరుణా సముద్రుడు") మొదలైన గొప్పబిరుదులు ఏమూలపెట్టితివి?

**సీ॥ మా మొఖాసాకు గ్రామంబు లిమ్మనలేదు-**
**కొంపలు గాల్పింపc గూడదంటిc!**
**గరిహయాదుల మేము గాక్షింపcగాలేదు-**
**గోవధ మాన్పించి ప్రోవుమంటి!**
**మాకు మిమ్ములను సామ్రాజ్యమిమ్మనలేదు-**
**జనులను దోcపింపc జనదటంటి!**
**స్వామి! మాకొఱకేమి కామింపc గాలేదు-**
**క్షితిలోనc బ్రజల రక్షింపుమంటిc!**

**తే॥ జెలcగి నీ పదసేవలు సేయు మాకు**
**వేఱె కోరిక లేటికి? వెన్నగలుగ**
**నహహా! నేతికి నేటికి నంగలార్చ?**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ! 54**

**అర్థములు:-** "మొఖాసా" = చిన్న జమీందారి, పన్నులేని భూమి మాన్యము, (అగ్రహారము); కరి-హయ+ఆదులు = ఏనుగులు, గుఱ్ఱములు మొదలగునవి; కామించు=కోరు; క్షితి=భూమి; చెలcగి=మిక్కిలి ఉత్సహించి; అంగలార్చు = దుఃఖించు.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహప్రభూ! మా అగ్రహారమునకు గ్రామములిమ్మనలేదు; కొంపలుకాల్చుట నివారించుమన్నాను. గోవధ మానిపించుమని కోరితిని కానీ, ఏనుగులను గుఱ్ఱాలను ఇప్పించమనలేదు. ప్రజలకు జరుగుచున్న దోపిడీని ఆపుమని ప్రార్థించితినికానీ, మీ సామ్రాజ్యము ఇమ్మనలేదు. స్వామీ! ప్రజలను రక్షింపుమయ్యా అని అడిగితిమి కానీ, మా కొఱకు ఏమియూ కోరలేదు! నీ పాదపద్మములను సేవించు భాగ్యముగల మాకు వేరే కోరికలెందుకు? వెన్న ఉండగా నేతికొఱకు ఎవడు అంగలార్చును?

సీ॥ భక్త సంరక్ష! కృపాపర! జలజాక్ష!
నరహరి! గోవింద! హరి! ముకుంద!
సంసార తారక! సజ్జనాధారక!
సత్యసంకల్ప! శేషాహితల్ప!
నీలాంబుదశ్యామ! నిఖిలదైవ లలామ!
సర్వపాప వినాశ! జగదధీశ!
శ్రీరమానాయక! శ్రితఫలదాయక!
శృంగార దరహాస! చిద్విలాస!
తే॥ భవదచలపాదగతులైరి యవనులయయొ!
అలుకమానక తరుము వాండ్రంద సికయు
నందకుండినఁ గాల్బట్టుకొందురయ్య!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 55

**అర్థములు:–** జలజ + అక్ష! = పద్మములవంటి కన్నులు కలవాడా!; సంసార తారక = సంసారమును దాటించువాడా!; శేష + అహి – తల్ప = ఆదిశేషుడను సర్పమును శయ్యగా కలవాడా!; నీల + అంబుద – శ్యామ = నల్లని మేఘము వంటి శ్యామల వర్ణము కలవాడా!; నిఖిలదైవ–లలామ! = అందరిదేవతలలోను శ్రేష్ఠుడైనవాడా!; జగత్ + అధీశ! = లోకమునకు నాయకుడా!; చిత్ + విలాస = జ్ఞానముచేత అందగించినవాడా!; భవత్ + అచల పాద–గతులైరి = నీ కొండ మొదటికి వచ్చినారు; అలుక = కోపము.

**భావం:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! భక్తులను రక్షించువాడా! దయగలవాడా! పద్మాక్ష! నరసింహా! గోవింద! హరి! ముకుందా! సంసారమునుండి తరింపజేయువాడా! సాధువులకు ఆధారమైనవాడా! సత్యసంకల్ప! శేషుడను పాముపై నిద్రించువాడా! నల్లని మేఘమువంటి కాంతికలవాడా! అన్ని దైవములలోనూ శ్రేష్ఠమైనవాడా! అందరి పాపములను నాశనము చేయువాడా! జగమునకు నాయకుడా! శ్రీ లక్ష్మీనాయకుడా! ఆశ్రితులకు వరాలిచ్చువాడా! అందమైన చిఱునవ్వు కలవాడా! చిద్విలాస! అయ్యయ్యో! ఇప్పటికే యవనులు నీ కొండసమీపమునకు వచ్చియున్నారు. వారిని తరిమివేయుము! వారు కపటులు–అందినచో జుట్టు, అందకున్నచో కాళ్లు పట్టుకొనెడి స్వభావము కలవారు!

సీ॥ దశకంఠకంఠ మర్దన దుర్దమాటోప
రామనామకమౌ ఫిరంగిదెబ్బ,
తత మేఘనాద భేదక మోద లక్ష్మణ
ప్రకట నామకమౌ ఫిరంగిదెబ్బ,
ఖల హిరణ్యాక్ష శిక్షక రూక్ష నిజ నృహ
ర్యక్షనామకమౌ ఫిరంగిదెబ్బ,
కుంభినీ భరణ విజృంభణ శ్రీకూర్మ
రమ్య నామకమౌ ఫిరంగిదెబ్బ,

తే॥ తగిలి వచ్చియుఁ జావక ధరణిఁ దిరిగె
యవనబలము, సుదర్శనాహత మహోగ్ర
రాహువన నట్లు గాకుండ, రహి జయింపు!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 56

**అర్థములు:–** దశకంఠుఁడు = రావణుఁడు; దుర్దమ + ఆటోపము = మిక్కిలి పరాక్రమము; తత = వ్యాపించిన; మేఘనాదుఁడు = ఇంద్రజిత్తు; మోదము = సంతోషము; ఖల = క్రూరుడైన; రూక్ష = కఱకైన; నిజ = నీయొక్క; నృ–హర్యక్ష–నామకము = నరసింహుడను పేరుగలది; కుంభిని = భూమి; సుదర్శన + ఆహత = సుదర్శన చక్రపు దెబ్బ; తగులు = తాఁకు; మహా + ఉగ్ర = మిక్కిలి భయంకరమైన; రహిన్ = తెలివిగా.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! రావణాసురుని సంహరించిన మహాబలముగల రాముడనే ఫిరంగిదెబ్బ; మేఘనాదుని సంహరించిన గొప్పదైన లక్ష్మణుడను పేరుగల ఫిరంగిదెబ్బయు; దుష్టుడగు హిరణ్యాక్షుని చీల్చి చంపిన నరసింహరూపమైన ఫిరంగిదెబ్బ; మరియు భూమండలము మోయుటకు సమర్థమైన శ్రీకూర్మనాథుడను ఫిరంగిదెబ్బ – ఇన్ని దెబ్బలు తినియున్ననూ దుర్మార్గులు నశింపలేదు. ఇప్పుడు యవనుల రూపమున దండెత్తి వచ్చుచున్నారు. నీ సుదర్శనాయుధమున వీరిని ఖండించుము. మరల రాహువును చంపినట్లు చేయకుము సుమా! తెలివిగా జయింపుము! (శ్రీహరి రాహువు తలను ఖండింపగా, నతడు అమృతమును రుచిచూచి నందున ఆ తల గ్రహణవేళలలో సూర్యచంద్రులను మ్రింగుచున్నది. ఆ విధముగా కాకుండా నిశ్శేషముగా శత్రునిర్మూలన చేయుము – అని భావం)

**సీ॥ గ్రామముల్ నీర్ధూమ ధామమ్ము లాయెను,**
**సస్యంబులెల్ల నాశనముఁ జెందె;**
**దొడ్లలో శాకముల్ దుంపశుద్ధిగఁ బోయె,**
**దోఁచిరి సర్వంబు గోచిదక్క;**
**చెట్టొక పిట్టయై చెదరిరి దిక్కులఁ,**
**బలువెతఁ బడరాని పాట్లుబడిరి;**
**యన్న మందఱకును నమృతోపమంబయ్యె,**
**వరుసగా నటమీఁద వానలేదు;**

**తే॥ ప్రజల పసతీరె, నిఁక మొదల్పదిలమయ్యె,**
**దరిదరికి వచ్చెనిదె మెండు తురకదండు,**
**చిత్తమునఁ జూచుకోవయ్య శీఘ్రబుద్ధి!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 57**

**అర్థములు:–** నిర్ధూమ ధామములు = (పొగలేని మంటలు) పూర్తిగా తగులబెట్టబడినవి; దుంపశుద్ధి = సంపూర్ణ నాశనము; పస = సారము, సమృద్ధి; ఇఁక = దీనితో; మొదలు = మూలకారణము; పదిలమయ్యె = స్పష్టమైనది; దరిదరికి = దగ్గఱదగ్గఱకు; శీఘ్రబుద్ధి = చుఱుకు బుద్ధి.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! ఇప్పటికే గ్రామములన్నియు ఖాళీ అయినవి. పంటలు నాశనమైనవి. కూరలు దుంపనాశనమైనవి. ప్రజలకు గోచీతప్ప ఏమియూ మిగలకుండ దోచుకున్నారు. జనులు చెట్టుకొక పిట్టగా పారిపోయి, పడరానిపాట్లు పడుచున్నారు. అన్నం అమృతంతో సమానమైనది (దొరకుటలేదు). పైగా అనావృష్టి యొకటి! ఇంక ప్రజల పని అయిపోయినది. దీనితో నీవు ప్రజలను రక్షింపకపోవుటకు గల మూలకారణము స్పష్టమైనది. (తురకలను ఎదిరించలేక నీవు కూడ పారిపోవలెనని చూచుచున్నావు!) తురకల దండు ఇప్పుడు నీపైకి మరలినది. శీఘ్రబుద్ధివి కదా! ఏమి చేయవలయునో ఆలోచించుకొనుము! ("శీఘ్రబుద్ధేః పలాయనమ్"– అన్నట్లు "పారిపోవుట మంచిదేమో" అని వ్యంగముగా కవి ఎత్తిపొడుచుచున్నాడు.)

**సీ॥ శ్రీదేవి మఱి తనుఁ జేరరానీదని**
**భూదేవి వదలక పొదివె ననఁగ,**

**మోక్షధనంబని మునులు మహాపేక్ష**
**చేతి నిక్షేపంబుఁ జేసిరనఁగ,**
**భక్తాగ్రగణ్యుడౌ బలి పూజసేయఁగా**
**బలిసద్మముననుండి వెలసెననఁగ,**
**బ్రహ్మాది హృదయ సారసములతోడి దాఁ**
**గుడుమూఁత లాడుచుండెదు ననంగ,**
**తే॥ ధరణి గుప్తములయిన పాదములతోడఁ**
**బాఱిపోలేవు నీకేది బ్రతుకు త్రోవ?**
**పౌరుషము చాలదు తురుష్కబలముఁ ద్రుంప!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 58**

**అర్థములు:–** పొదువు = కవియు, క్రమ్ము, పైబడు; మహా+అపేక్ష = గొప్ప కోరిక; నిక్షేపము = భూమిలో పాతిన నిధి; బలిసద్మము = బలిచక్రవర్తి గృహము (పాతాళము); సారసములు = పద్మములు (తామరలు); ధరణి గుప్తములయిన = భూమిలో దాగిన (పాతుకొనిపోయిన).

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! లక్ష్మీదేవి తనవద్దకు రానీయుట లేదని, భూదేవి నీ పాదములను పట్టి వదలుట లేదేమో! నీవు మోక్షము నిచ్చువాడవని మునులు నిన్ను తమ నిక్షేపముగా గావించిరేమో! భక్తుడైన బలిచక్రవర్తి పాతాళమున పూజచేసి నీ పాదములను కదలనీయడేమో! బ్రహ్మాది దేవతల హృదయపద్మములతో నీ పాదద్వంద్వము దాగుడుమూతలాడుచున్నవేమో! భూమిలో దిగబడిన పాదములతో పారిపోలేవు. నీకు బ్రతుకుత్రోవ ఏది? తురుష్కులను గెల్చుటకు నీ పౌరుషము చాలుటలేదు!

**సీ॥ నిఖిల విశ్వంబును నీయందణఁగియుండు**
**విశ్వంబులో నీవు వెలసినావు!**
**విశ్వరూపకుఁడవు, విశ్వమయుండవు,**
**విశ్వసాక్షివి, విశ్వవిభుఁడవీవు!**
**విశ్వసర్గస్థితి విదళనకరుఁడవు,**
**విశ్వంబునకు నీవు వేఱుకాదు!**

కినుక విశ్వద్రోహ మొనరించు దుష్టుల
శిక్షించి ప్రజల రక్షింపవేమి?

తే॥ యింత బతిమాల మాకేల? యెట్టులైన
గాని శుభకంద! "కందకులేని దూల
బచ్చలికి నేలగల్గు?"నో పరమ పురుష!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! **59**

**అర్థములు:–** సర్గ–స్థితి–విదళన = సృష్టి–స్థితి–లయములు; శుభకంద! = శుభములకు మూలమైనవాడా!

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! సమస్త విశ్వము నీయందున్నది. నీవు విశ్వములో నున్నావు. విశ్వమే నీ రూపము! నీవు విశ్వమయుడవు, విశ్వసాక్షివి, విశ్వప్రభుడవు. విశ్వము నీయందు పుట్టినది, పెరిగినది, నశించినది. విశ్వమును నీవును ఒక్కటే! మరి విశ్వద్రోహముచేయు దుష్టులను శిక్షించి, ప్రజలను రక్షించవెందులకు? ఇంత బతిమాలుకొనుటకు మాకేమిపని? శుభప్రదమైనవాడా! ఓ పురుషోత్తముడా! కందకులేని దురద బచ్చలికి ఎందులకు?

సీ॥ ఉరమున శ్రీదేవి యొఱపైన మెఱపుగా,
గంభీర వాగ్ధార గర్జితముగ;
హార మౌక్తిక కళ లల వడగండ్లుగా,
భ్రూలత హరిచాపలీల మెఱయఁ;
గోరిక భక్తమయూరముల్ నటియింప,
దీన చాతక పంక్తి తృప్తిఁజెందఁ;
దనువదన ప్రభ దశదిశల్ నిండగాఁ,
బృథివీస్థలిని కృపావృష్టి నించి;

తే॥ సత్ప్రజా సస్య సంరక్ష సలుప నిదియె
సమయమోయయ్య! ఇఁక మాను జాగుసేయ,
నన్నుఁ గన్నయ్య! రక్షింపు నల్లనయ్య!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! **60**

**అర్థములు:–** ఉరము = వక్షస్థలము; ఒఱపు = సౌందర్యము, అందము; మౌక్తికము = ముత్యము; భ్రూలత = లతవంటి కనుబొమలు; హరిచాపము = హరివిల్లు, ఇంద్రధనుస్సు; మయూరము = నెమిలి; చాతకము = వానకోయిల; తను–వదన – ప్రభ = శరీరము–ముఖముల–కాంతి; పృథివీస్థలిని = భూమిమీద; కృపావృష్టి = దయ అనువర్షము; సత్ + ప్రజా – సస్య-సంరక్ష = మంచి – ప్రజలనెడి – పంటలను – రక్షించుట; జాగు = ఆలస్యము.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహ ప్రభూ! నీ హృదయముననున్న శ్రీదేవి మెఱుపుతీగ కాగా–నీ వాక్కులు ఉరుములు, కంఠముల వ్రేలాడు ముత్యాలహారములు వడగండ్లు, నీకనుబొమలు ఇంద్రచాపములు కాగా – భక్తులు అను నెమళ్లు ఆనందముతో నాట్యము సేయుచుండగా – చాతకపక్షులవంటి వారైన దీనులు తృప్తిపడుచుందురు. నీ శరీర ముఖకాంతులు దశదిశలూ నిండగా, లోకమున నీ దయావర్షమును కురిపించి, ప్రజలు అను పంటను రక్షింపవలసిన సమయమిదే! ఇక ఆలస్యము చేయవద్దు! నన్ను కన్నతండ్రీ! నా నల్లనయ్య! రక్షింపుము!

**సీ॥ నిడుద కడానిశాల్ నడుమున బిగియించి,**
**తీరైన గండపెండేర మూని;**
**రమణీయ మణిశిరస్త్రాణ మౌదలఁబూని,**
**స్ఫుట వజ్రమయమైన జోడుఁదొడిగి;**
**తూణంబు లిరువంకఁ దోరణంబుగఁ గట్టి,**
**విలసిత శరమైన విల్లుబట్టి;**
**పరవైరి హరమైన తరవారి ధరియించి,**
**దాపల చికిలి కటారి చెక్కి;**

**తే॥ రామవేషంబుతో, సుమిత్రాసుతుండు**
**నీవు, రణరంగమున నిల్చి, నిబిడ శత్రు**
**జాలముల నేలపాల్సేయు, లీల నెఱపు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 61**

**అర్థములు:–** నిడుద = పొడవైన; కడాని = బంగారు; గండపెండేరము = ఎడమ కాలికి వేసికొనెడి బంగారు కడియము; శిరస్త్రాణము = యుద్ధమునందు తలను

రక్షించుకొనుటకు ధరించెడి ఉక్కుటోపి; ఔదల = నడితల; జోదు = (శరీర) కవచము; తూణములు = అమ్ముల పొదులు; శరము = బాణము; తరవారి = పెద్దకత్తి, పట్టాకత్తి; దాపల = ఎడమవైపు; చికిలి = తుడిచి చక్కచేసిన; కటారి = బాకు; నిబిడ–శత్రు – జాలములు = దట్టమైన–శత్రువుల – సమూహములు; లీలన్ + నెఱపు = లీలను నెరవేర్చుము (ప్రదర్శించుము).

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! పొడవైన బంగారు శాలువా నడుమున బిగించుము. కాలికి గండపెండేరము ధరింపుము. మణులు పొదిగిన శిరస్త్రాణమును తలకు పెట్టుకొనుము. వజ్రములు తాపించిన కవచమును ధరించుము. అమ్ముల పొదులు రెండు భుజములకును కట్టుకొనుము. విల్లును చేపట్టుము. ఒకచేత శత్రువులను సంహరించునట్టి పొడవైన కత్తిని ధరించుము. ఎడమ వైపున పదునైన బాకును చెక్కుకొనుము. నీవు రాముడవై, లక్ష్మణుడు వెంటరాగా, ఆనాడు రాక్షసులను సంహరించినట్లు, ఈ దట్టమైన శత్రుసమూహములను నేలపాలు చేయుము! నీ లీలను నెరవేర్చుము (ప్రదర్శించుము).

**సీ॥ గాధేయయజ్ఞ విఘ్నకరాసురావళిఁ**
**జక్కుచేసినయట్టి శౌర్యనిధివి!**
**పరవీర భీకర పరశురాముని పరా**
**క్రమము బెండుగఁజేయు ఘనభుజుఁడవు!**
**పదునాల్గువేల దుర్మద రాక్షసులతోడ**
**ఖరుని మర్దించిన వరబలుఁడవు!**
**బంతులాడినరీతి పంక్తికంఠుని తలల్**
**ఖండించు చండప్రచండ రుచివి!**

**తే॥ నీకు నొక దొడ్డకార్యంబె నీచయవన**
**సేన నిర్జించుపని? ప్రజల్చేసికొనిన**
**కర్మమున నీదు చిత్తంబు కరఁగదాయె!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 62**

**అర్థములు:–** గాధేయ – యజ్ఞ – విఘ్నకర + అసుర + ఆవళిన్ = విశ్వామిత్రుని – యజ్ఞమును–పాడుచేసెడి – రాక్షసుల – సమూహమును; చక్కుచేసిన = ఖండించిన

– ముక్కలు చేసిన; దుర్మద = గర్విష్ఠులైన; పంక్తి కంఠుఁడు = రావణుడు; చండప్రచండ = తీవ్రమై మిక్కిలి సహింపరాని; రుచి = కాంతి, తేజస్సు.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహస్వామీ! విశ్వామిత్రుని యజ్ఞమును విఘ్నమొనరించెడు రాక్షసులను చంపిన శూరుడవు నీవు! మహావీరుడైన పరశురాముని పరాక్రమమును తేలికపరచిన బలశాలివి నీవు! పదునాలుగు వేల రాక్షసులతో పోరి, ఖరాసురుని సంహరించిన మహాబలుడవు నీవు! బంతులాట ఆడినట్లు రావణుని తలలను ఖండించిన చండప్రచండ వీరుడవు నీవు! అట్టినీకు ఈ నీచయవనులను జయించుట ఒక పెద్దపనా? ప్రజలు చేసుకొన్న ఏ కర్మమో కాని నీ మనస్సు కరుగకున్నది!

**సీ॥ కోటి సూర్యోజ్జ్వలత్ కోటీర మణులతో,**
**రమణీయ మణికుండలములతోఁడ;**
**శంఖచక్రగదాసి శార్ఙ్గాయుధములతోఁ,**
**బ్రస్తుతప్రభ కౌస్తుభంబుతోఁడ;**
**వలిపె బంగరువల్వ వలెవాటు నీటుతోఁ,**
**బొక్కిలి తామరపువ్వుతోఁడ;**
**గంగను గన్న చక్కని పదాబ్జములతో–**
**మిసిమి చామనచాయ మేనితోఁడఁ;**

**తే॥ బక్కిగుఱ్ఱంబుమీదను నెక్కి, నాదు**
**మ్రొక్కుఁగైకొని, శౌర్యంబు పిక్కటిల్ల,**
**నొక్కట యవనరాట్సేనఁ జక్కుచేయు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 63**

**అర్థములు:–** సూర్య + ఉజ్జ్వలత్ + కోటీర – మణులు = సూర్యునివలె – ప్రకాశించు – కిరీటపు – మణులు; గద + అసి = గద – కత్తి; శార్ఙ్గము = విష్ణువు ధనుస్సు పేరు; ప్రస్తుత – ప్రభ – కౌస్తుభంబుతోడ: ప్రస్తుత = మిక్కిలిగా స్తుతింపదగిన (పొగడదగిన), ప్రభ = కాంతితో కూడిన, కౌస్తుభంబుతోడ = "కౌస్తుభము" అను పేరుగల రత్నముతో కూడి; వలిపెము = సన్నని తెల్లవస్త్రము; పొక్కిలి = బొడ్డు, నాభి; మిసిమి = నూతన కాంతితో కూడిన; చామనచాయ = నల్లని; మేనితోడ =

శరీరముతో; పక్కిగుజ్జము = పక్షివాహనము (గరుత్మంతుడు); పిక్కటిల్లు = అతిశయించు, వ్యాపించు; చక్కుచేయు = చంపు, ఖండించు.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహస్వామీ! కోటి సూర్యప్రకాశముగల కిరీటముతో, అందమైన మణికుండలములతో, శంఖ-చక్ర-గదా-ఖడ్గ-ధనురాది ఆయుధములతో, మిక్కిలి స్తుతింపదగిన కౌస్తుభమణి కాంతులతో, పలుచని బంగారు వస్త్రముతో, బొడ్డున తామరపూవుతో, గంగనుకన్న పాదములతో, మెఱపుగల చామనచాయ మేనితో - గరుత్మంతునిపై నెక్కి, శూరుడవై రావయ్యా! ఈ యవనసేనను నాశనము చేయుము.

**సీ॥ దండంబు నీకు నుద్దండతేజశ్చండ!**
**జోహారు భక్తదుర్మోహనాశ!**
**మ్రొక్కెదఁ గొను జలముక్కాయరుక్కాంత!**
**వందనంబిదె చిదానందకంద!**
**నుతిఁజేతు శతధృతిస్తుతియుతోన్నతచర్య!**
**ప్రణుతిఁజేసెద మునిప్రణుతచరణ!**
**సాష్టాంగమిదె నీకు సాష్టాపదాంబర!**
**కేలుమోడ్చెద జగత్కేళిలోల!**

**తే॥ వలదు వలదు పరాకు భావమ్ము నీకు,**
**దీనజనములఁ గృపఁబ్రోవ దిక్కు నీవ!**
**దుష్టుల వధించి పోషింపు శిష్టజనుల!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 64**

**అర్థములు:-** ఉద్దండ - తేజస్ + చండ! = మిక్కిలి - తేజస్సుచే - తీక్షణమైనవాడా! (చూడశక్యముకాని తేజస్సు కలవాడా!); భక్త - దుర్ + మోహ - నాశ! = భక్తులలోని - దుష్టమైన - మోహమును - నాశనము చేయువాడా!; జలముక్ + కాయ - రుక్ - కాంత! = నల్లని మేఘమువంటి - శరీర-కాంతిచేత-ప్రకాశించువాడా!; చిత్ + ఆనంద - కంద! = జ్ఞానమనెడి - ఆనందమునకు - మూలమైనవాడా!; శతధృతి = బ్రహ్మ లేదా ఇంద్రుడు; ప్రణుతి = మిక్కిలిగా పొగడుట; స+అష్టాపద+అంబర = బంగారముతో కూడిన వస్త్రమును (పీతాంబరమును) ధరించినవాడా!; నుతి = స్తుతి, స్తోత్రము, పొగడిక.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! చూడశక్యముకాని గొప్పతేజస్సుగలవాడా! నీకు దండము! భక్తుల దుష్టమోహమును నాశమొనర్చువాడా! నీకు జోహారు! నీలమేఘమువంటి శరీరకాంతి కలవాడా! నీకు మ్రొక్కుచుంటిని! చిదానందమునకు మూలకారణమైనవాడా! నీకు వందనము! బ్రహ్మచే (లేదా ఇంద్రునిచే) స్తుతులు గైకొన్న మహోన్నతమైనలీల కలవాడా! నిన్ను నేను స్తుతిస్తాను. మునులచే కొనియాడబడిన పాదపద్మములు కలవాడా! నీకు నా ప్రణతులు! బంగారు కటిచేలము ధరించినవాడా! నీకు సాష్టాంగనమస్కారము! విశ్వమును ఆటగా భావించువాడా! నీకు నమస్కారములు. ఇకనైనను పరాకువలదు. దీనులకు నీవే దిక్కు! దుష్టశిక్షణ చేసి, శిష్టులను రక్షింపుము!

**సీ॥ గరుడాచలంబుపైఁ గడఁకతో వసియించి,**
**సత్యభామా తటిచ్ఛాయ నలరి;**
**వరచాప మనియెడి హరిచాప మమరించి,**
**వివిధ భక్తులఁ గృపావృష్టి ముంచి;**
**అమర మయూరవారము మోదమందించి,**
**దీనచాతకములఁ దృప్తినించి;**
**క్షత్రకన్యాకామ సస్యముల్పండించి,**
**జగములఁ జల్లనై నెగడఁ జేసి;**

**తే॥ నవఘన స్ఫూర్తిచే ముర నరక ధేను**
**ఖర దవానల మార్చిన కడఁక నిపుడు**
**రిపుల శిక్షించి రక్షించు పృథివి జనుల!**
**వైరిహరరంహా! సింహాద్రి నారసింహా! 65**

**అర్థములు:–** కడకతో = ఉత్సాహముతో; తటిత్ + చాయన్ = మెఱుపుకాంతితో; అలరి = ఒప్పి; హరిచాపము = ఇంద్రధనుస్సు; కృపావృష్టి = దయావర్షము; అమర – మయూర–వారము = దేవతలనెడు నెమళ్ళ గుంపు; క్షత్రకన్యా–కామ– సస్యముల్ = రాజకన్నెల కోరికలనెడి పంటలు; నవఘనస్ఫూర్తిచే = క్రొత్తమబ్బువంటి ప్రకాశముతో; ముర–నరక–ధేను–ఖర–దవానలము = మురాసురుడు – నరకాసురుడు – ధేనుకుడు – ఖరుడు అను రాక్షసులనెడి కార్చిచ్చును; ఆర్చిన కడకన్ = ఆర్పిన

ధైర్యముతో; రిపులన్ = శత్రువులను.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహప్రభూ! గరుడుడు ఒక పర్వతముకాగా, అందు నీవు ఉత్సాహముతో వసించి, సత్యభామ మెఱపుతీగ వలె వెంటరాగా, నీ చేతిలోని విల్లు హరివిల్లుకాగా, కోట్లభక్తులపై కృపావర్షము కురియుచుండగా, దేవతలను నెమళ్లపిందు ఆనందింపగా, దీనులనెడి చాతకములను తృప్తిపరచి, రాజకన్యల కోరికలనెడి సస్యములను పండించి, లోకాలను చల్లబరచి, గొప్ప నవనీలమేఘమువలె వచ్చి, మురాసుర - నరకాసుర - ధేనుకాసుర - ఖరాసుర ప్రతాపమను కార్చిచ్చును అర్పినట్లు, ఇప్పుడుకూడ ధైర్యముతో దుష్టశిక్షణ చేసి ప్రజలను రక్షింపుము. (ఇక్కడ స్వామివారిని వర్షాకాల మేఘముతో పోల్చినాడు కవి.)

**సీ॥ నీ పాదరజమున నిమిషంబు లోపల**
**బాపురే! సతియయ్యె చాపఱాయి!**
**నీ బాహుబలమున నిలువక పెళ్ళున**
**ముక్కంటి చాపంబు ముక్కలయ్యె!**
**నీ యాజ్ఞచే గిరుల్ నీటఁ దెప్పునఁదేలె,**
**కడకు సముద్రంబు గట్టువడియె!**
**నీ ప్రతాపాగ్నిచే నిఖిల రాక్షసకోటి**
**మాడి దోమలపోల్కి మడిసిపోయె!**

**తే॥ బాగులే! యిట్టి నెరవైన ప్రాపుఁ గల్గి**
**యల్పులకు లొంగి తిరుగలేమయ్య మేము,**
**కర్మమా మాకు గజమెక్కి కంతదూర?**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 66**

**అర్థములు:-** పాదరజము = కాలి దుమ్ము; చాపఱాయి = విశాలమైన ఱాయి; ముక్కంటి = శివుడు; మడియు = చచ్చు (మడిసిపోయె = చచ్చిపోయెను); నెరవైన = అధికమైన, యుక్తమైన; ప్రాపు = రక్షణము, ఆశ్రయము.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహస్వామీ! నీ పాదధూళిచే రాయి స్త్రీగా (అహల్యగా) మారినది. నీ బాహుబలము ముందు శివునిధనుస్సు నిలువక ఫెళ్లున విరిగిపోయినది.

నీ ఆజ్ఞవలన రాళ్లు పర్వతములు నీటిలో తేలినవి. సముద్రమునకే వారధి కట్టబడినది. నీ పరాక్రమమను అగ్నిలో రాక్షసులు అందరూ దోమలవలె మాడిపోయిరి. నీవంటివాని రక్షణ కలిగియుండి – ఏనుగుపై నెక్కి కంతలో దూరినట్లు – ఇప్పుడు యవనులకు లొంగి తిరుగలేమయ్యా! మాకేమి కర్మము?

**సీ॥ మున్ను తాటక ప్రాణముల్గొన్న బాణంబు,**
**మెఱసి సుబాహుఁదున్మిన విశిఖము;**
**మించి విరాధు ఖండించిన ప్రదరంబు,**
**ఖరదూషణాది సంహరణ శరము;**
**మాయల మారీచు మదమణంచిన తూపు,**
**ఘోరకబంధుని గూల్చు చిలుకు;**
**వాలి మహాబలశాలిఁ గూల్చిన కోల,**
**జలధి నింకించిన సాయకంబు;**
**తే॥ రావణాది మహాసురరాజి నణఁచు**
**చండకాండంబు లేమాయెఁ? జటుల యవన**
**ఖండనము సేయ నయ్యంబకములఁ బఱపు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 67**

**అర్థములు:–** "బాణము–విశిఖము – ప్రదరము – శరము – తూపు – చిలుకు–కోల–సాయకము – కాండము – అంబకము" – ఈ పది పదములును "బాణము" అను పదమునకు పర్యాయపదములు. మహా + అసుర – రాజి = గొప్ప రాక్షసుల సమూహము; చటుల = అధికమైన, దట్టమైన.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! పూర్వము తాటక ప్రాణములు తీసిన బాణము, సుబాహుని చంపిన బాణము ఏమైనవి? విరాధుని ఖండించిన బాణము, ఖరదూషణులను సంహరించిన బాణము ఏవి? మారీచుని గర్వమణచిన బాణము, కబంధుని కూల్చిన బాణము ఇప్పుడెచ్చటనున్నవి? మహాబలశాలియైన వాలిని వధించిన బాణము, సముద్రమును ఇంకింపజేసిన బాణము ఏవి? రావణాది మహారాక్షసులను మట్టుబెట్టిన బాణములు ఏమైనవి? వాటిని ఈ తురుష్కసేనపైకి ఎక్కుపెట్టుము!

**గమనిక:–** మొదటి పద్యమునుండి ఈ 67వ పద్యము వరకును గోగులపాటి కూర్మనాథ కవి తురకల దండయాత్రవలన ప్రజలు పడుచున్న అష్టకష్టములను సింహాద్రి నారసింహస్వామికి విన్నవించుకొనినాడు. భక్తులను రక్షించుట లేదని అధిక్షేపించినాడు. తరువాత ఆ స్వామి ఏదియో మహిమను చూపి శత్రువులను పారద్రోలినట్లుగా 68వ పద్యమును బట్టి, 69వ పద్యమును బట్టి మనము ఊహించుకొనవచ్చును. (ఆ మహిమ ఏమిటో *ఇట్టి పూలగుర్తులున్న సీసపద్యములోను, తరువాతనున్న "పద్యగీతము" లోను వివరముగా నున్నది. కాని ఈ రెండు పద్యములును ప్రక్షిప్తములని పండితుల భావన.) స్వామిమహిమను గ్రహించినకవి 70వ పద్యమునుండి తన్ను క్షమింప వలసినదిగా వేడుకొనుచున్నాడు.

**సీ॥ ఖల హిరణ్యాక్ష ముఖ్యులనెల్ల ఖండించి,**
**దేవతాతతిఁ బ్రోచు దివ్యమహిమ;**
**రావణ కుంభకర్ణ ప్రముఖులనెల్లఁ**
**గొట్టి, మౌనులఁ బ్రోచు దిట్టతనము;**
**శిశుపాలకాది దుశ్శీలురఁ బరిమార్చి,**
**క్షితి దీనజనుల రక్షించు కడఁక;**
**కంసాది దుష్ట విధ్వంసనం బొనరించి,**
**ధరణిఁబాలించు నుదారకరుణ;**

**తే॥ వినుటయేకాని కన్నులఁ గనుటలేదు,**
**కంటి మిప్పుడు యవనుల గర్వమణఁచి**
**ప్రజల రక్షించు నీదు ప్రభావమెల్ల!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 68**

**అర్థములు:–** ఖల = దుష్టుడైన; దేవతా తతి = దేవతల సమూహము; మౌనులు = మునులు; దిట్టతనము = ధైర్యము; దుశ్శీలురు = చెడ్డనడవడిక కలవారు; పరిమార్చు = చంపు; కడఁక = ఉత్సాహము, ధైర్యము.

**భావం:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! నాడు దుర్మార్గులైన హిరణ్యాక్షుడు మొదలగువారిని ఖండించి, దేవతలను రక్షించిన నీ మహిమ విన్నాము కాని చూడలేదు.

రావణుడు, కుంభకర్ణుడు మొదలైన ప్రధాన రాక్షసులను చంపి, మునులను రక్షించిన నీ ధైర్యమును విన్నాము కాని చూడలేదు. శిశుపాలాది దుర్మార్గులను సంహరించి, దీనులను కాపాడినావని విన్నాము కానీ చూడలేదు. కంసుడు మొదలైన దుష్టులను చంపి భూమిని బ్రోచినావని విన్నదే కానీ, కళ్ళతో చూచినదిలేదు. ఇప్పుడు ఈ యవనులను తరిమి, ప్రజలను రక్షించిన నీ ప్రభావమును కనులార చూచుచున్నాము.

***సీ॥ కారుణ్య దృష్టిచేఁ గని మమ్ము రక్షింప**
**నీరజేక్షణ! నేఁడు నీవు పంపఁ**
**బారసీకుల దండుపైఁ గొండలో నుండి**
**గండు తుమ్మెదలు నుద్దండలీలఁ**
**గల్పాంతమున మిన్నుఁ గప్పి భీకరమైన**
**కారుమేఘంబులు గవిసినట్లు**
**దాఁకి, భోరున రక్తదారలు గురియఁగాఁ**
**గఱచి, నెత్తురు పీల్చి, కండలెల్ల**

**తే॥ నూడిపడ, నుక్కుమూతుల వాఁడి మెఱసి,**
**చించి చెండాడి వధియించెఁ జిత్రముగను,**
**నొక్కొకని చుట్టుముట్టి బల్ మిక్కుటముగ,**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!**

**అర్థములు:-** నీరజ + ఈక్షణ! = పద్మములవంటి కన్నులు కలవాడా!; ఉద్దండలీలన్ = భయంకరమైన విధముగా; కల్పాంతమున = ప్రళయకాలములో; కారుమేఘములు = నల్లని మబ్బులు; కవిసినట్లు = ముసురుకొనినట్లు.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహస్వామీ! మాపై దయతో నీవు గండుతుమ్మెదలను పంపగా, అవి కల్పాంతమున ఆకాశమును కప్పిన కాలమేఘములవలె, కొండలోనుండి బయలువెడలి, యవనుల సైన్యము పైకి దూకినవి. ఆ సైనుకులను కండలూడునట్లు కఱచి రక్తధారలు కారునట్లు చేసినవి. ఉక్కుమూతులతో ఒక్కొక్కని పట్టుకొని గాయపరచినవి. పద్మాక్షా! శ్రీహరీ! నీకు నమస్కారములు!

*పద్యగీతము

**అరులఁ బరిమార్చి, వైశాఖపురి సమీప**
**గిరిబిలంబున డాఁగె బంభరములెల్ల,**
**అది మొదలె "తుమ్మెదల మెట్ట"యంద్రు దాని,**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!**

**అర్థములు:-** అరులన్ = శత్రువులను; పరిమార్చి = చంపి; వైశాఖపురి = విశాఖ పట్టణము; గిరిబిలమున = కొండగుహలో; బంభరములు = తుమ్మెదలు.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహస్వామీ! శత్రువులను చంపి, తుమ్మెదలు, విశాఖపట్టణము సమీపమునందలి ఒక కొండగుహలో దాగినవి. అప్పటినుండియే ఆ కొండను "తుమ్మెదల మెట్ట" అని పిలుచుచున్నారు.

**సీ॥ జయమాయె! యవనరాట్సంతమసము బాసె**
**భవదీయ భాస్వత్ప్రభాబలమున;**
**భువన జాతంబులు పొలుపుచేఁ జెన్నొందె,**
**దిక్చక్రములు చాల తెలివి నొందె;**
**కమలజాదుల నుతుల్గణనసేయని నీవు**
**లీల నా మనవి చెల్లించినావు;**
**బ్రహ్మాండభాండ సంభరణ లీలాఘను**
**నిల నిన్ను మెచ్చి యేమియ్యఁ గలను?**

**తే॥ తోఁచదిక నెట్లు, లిదె నాకుఁ దోఁచినట్లు**
**తులసిదళ మొక్కటిత్తు సంతోషమొందు,**
**మదియె యగణిత పూజగా నవధరింపు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 69**

---

* ఈ పూలగుర్తులున్న సీసపద్యము, తరువాతనున్న "పద్యగీతము" – ఈ రెండును ప్రక్షిప్తములని కొందరు విమర్శకుల భావన. ఇవి గోగులపాటి కూర్మనాథకవి శైలిలో లేవనియు, తరువాత ఎవరో కవి రచించి, యిచ్చట చేర్చినాడనియు వారి తలంపు. (–సంపాదకుడు)

**అర్థములు:–** యవనరాట్ + సంతమసము = తురకరాజులనెడి కటిక చీఁకటి; భాస్వత్ + ప్రభా = ప్రకాశించెడి వెలుగు; భువన జాతములు = లోక సమూహములు; పొలుపుచేన్ + చెన్నొందె = ఒప్పుగా (చక్కగా) అందగించెను; దిక్ + చక్రములు = దిక్కుల సమూహము; తెలివినొందె = ప్రకాశించెను; కమలజ + ఆదులు= బ్రహ్మ మొదలైనవారు; సంభరణము = చక్కగా భరించుట; అగణిత = లెక్కలేని (గొప్ప).

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! నీ శౌర్యమువలన యవనసైన్యమనెడు చిమ్మచీకటి తొలగిపోయెను. భువనము లన్నియు శాంతినొందినవి. దిక్కులు ప్రకాశించుచున్నవి. బ్రహ్మాదుల స్తుతులను లెక్కింపని నీవు, నామనవిని నెరవేర్చితివి. బ్రహ్మాండ భాండములను భరించు ఘనుడవు, నిన్ను మెచ్చి నీకేమి ఈయగలను? ఏదో నా బుద్ధికి తోచినట్లు తులసీ దళమును సమర్పించుకొనుచున్నాను. ఇదియే గొప్ప పూజగా చేకొనుము!

**సీ॥ అపరాధి నపరాధి నార్తరక్షణదక్ష!**
**యపరాధి నపరాధి నంబుజాక్ష!**
**యపరాధి నపరాధి నద్భుతగుణధుర్య!**
**యపరాధి నపరాధి నధికశౌర్య!**
**యపరాధి నపరాధి నంభోధిగంభీర!**
**యపరాధి నపరాధి నత్యుదార!**
**యపరాధి నపరాధి నానంద పరిపూర్ణ!**
**యపరాధి నపరాధి నభ్రవర్ణ!**

**తే॥ నేర్చియైనను, మిక్కిలి నేరకైన,**
**నిష్ఠురోక్తులు పల్కితి నిన్ను, నాదు**
**తప్పుసైరించి దాసుని దయఁదలంపు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 70**

**అర్థములు:–** అపరాధిన్ = తప్పుచేసినవాడను; అంబుజ + అక్ష = పద్మములవంటి కన్నులుకలవాడా!; అద్భుత గుణధుర్య = గొప్పగుణములు కలిగినవాడా!; అంభోధిగంభీర = సముద్రమువలె లోతైనవాడా!; అతి + ఉదార = మిక్కిలి దయగలవాడా!; అభ్రవర్ణ = మేఘమువంటి (నల్లని) రంగు కలవాడా!; నిష్ఠుర + ఉక్తులు = కఠినమైన మాటలు.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహప్రభూ! ఆర్తరక్షణదక్షా! పద్మాక్షా! అపరాధినైన నన్ను దయచూడుము. అద్భుత గుణములు కలవాడా! అధికశౌర్యముగల దేవా! నా అపరాధములు మన్నింపుము. సముద్రగంభీరా! మహోదారా! ఆనందరూపా! నీలవర్ణుడా! తెలిసి తెలియక నిన్ను అనేక నిష్ఠురోక్తులు పలికినాను. ఈ దాసుని తప్పును సైచి – క్షమింపుము!

**సీ॥ వీరాధివీరుఁడవై రాజిలెడు నిన్నుఁ**
**బిఱికి వాఁడంటిని భీతిలేక,**
**జగదేక వితరణాశ్రయమూర్తివగు నిన్ను**
**బహులోభివనుచును పలికినాఁడ,**
**పరిపూర్ణ కరుణాస్వభావుండవగు నిన్ను**
**నిర్దయుండంచు నిందించినాఁడ,**
**నద్భుతానంద కల్యాణ గుణుండవౌ**
**నినుఁగూర్చి పలికితి నిర్గుణుఁడని,**

**తే॥ యలుక జనియించి దుష్టుల నణఁచుకొఱకుఁ**
**బడుచుఁదనమున నిటులంటి భక్తవరద!**
**మదపరాధ సహస్రముల్ మది క్షమింపు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 71**

**అర్థములు:–** రాజిలెడు (రాజిల్లెడు) = ప్రకాశించెడు; వితరణ + ఆశ్రయ – మూర్తి = దానగుణమునకు నెలవైన స్వరూపము; నిర్గుణుడు = గుణములు లేనివాడు; మత్ + అపరాధ – సహస్రముల్ = నా వేనవేల తప్పులు.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహప్రభూ! వీరాధివీరుడవైన నిన్ను పిఱికివాడవని అన్నాను. ప్రపంచమునకు అన్ని భాగ్యములు ప్రసాదించు నిన్ను లోభివని అంటిని. సంపూర్ణ కరుణాహృదయుడవైన నిన్ను, కఠినాత్ముడవని నిందించితిని. ఆశ్చర్యపరచు అనేక శుభగుణములు గల నిన్ను, నిర్గుణడవని పలికితిని. నీవు దుష్టశిక్షణచేయుదువని కోపముతో అట్లు కటువుగా పలికితిని. నా అపరాధ సహస్రములను క్షమింపుము.

సీ॥ పరమ మోహాంధుండ, పాపస్వభావుండ,
దుశ్శీలపరుఁడను, దుర్మదుండ;
దుష్కామయుక్తుండ, దుర్మార్గసక్తుండఁ,
గ్రోధాంతరంగుండ, కుటిలమతిని;
లోభిని, నింద్రియలోలుండఁ, జపలుండ,
దంభవృత్తుండ మాత్సర్యయుతుఁడ;
దుష్టుండ, దుస్సంగదూష్యుండ, శమదమ
హీనుఁడ, శౌర్యవిహీనపరుఁడ;

తే॥ నైన శరణొందితిని, నన్ను నాదరింపు,
సజ్జనునకైన మిగుల దుర్జనునకైన
సౌఖ్యమొసఁగదె కల్పవృక్షంబు నీడ?
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 72

**అర్థములు:–** మోహ + అంధుండు = మోహముచేత గ్రుడ్డివాడు; దుర్ + మదుండు = చెడ్డ గర్వము కలవాడు; దుష్ + కామయుక్తుండు = చెడ్డ కోరికలతో కూడినవాడు; దుర్మార్గ – సక్తుండు = చెడ్డదారిలో ఆసక్తికలవాడు; క్రోధ + అంతరంగుఁడు = కోపముతో కూడిన మనస్సు కలవాడు; కుటిలమతి = వక్రబుద్ధి కలవాడు; దంభవృత్తుండు = కపటముతో కూడిన నడవడిక కలవాడు; మాత్సర్యయుతుఁడు = అసూయతో కూడినవాడు; దస్సంగ దూష్యుఁడు = చెడ్డ వారితో చెలిమిచేయుటవలన దూషింపదగినవాడు; శమము = కామక్రోధాదులు లేకుండ అణగియుండుట; దమము = ఇంద్రియ నిగ్రహము.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! నేను మోహాంధుడను, పాపస్వభావుడను, దుశ్శీలుడను, అహంకారిని, చెడుకోరికలు కలవాడను, చెడుదారులలో ఆసక్తి కలవాడను. నేను మనస్సులో కోపము గలవాడను, వక్రబుద్ధికలవాడను, ఇంద్రియలోలుడను, లోభుడను. చాపల్యము, కపటము, మాత్సర్యము కలవాడను. శమదమాదులు లేనివాడను. శౌర్యము లేనివాడను. ఐననూ నిన్నేశరణుపొందితిని. నన్ను క్షమింపుము. సజ్జనునికైనను, దుర్జనునికైనను కల్పవృక్షము ఒక విధముగానే నీడనిచ్చునుకదా!

**సీ॥ "తే నమో! రక్షిత దేవతాయ, సురేంద్ర**
**సేవితాయ, మునీంద్ర భావితాయ;**
**తే నమో! నిత్య సుధీరతాయ, సుమేరు**
**ధీరతాయ, యశుభ వారణాయ;**
**తే నమో! నిర్జిత దీనతాయ, భృతాప్త**
**మానవాయ, దళిత దానవాయ;**
**తే నమో! జ్ఞానసుధీహితాయ, స్మరాయి**
**తాకృతాయ, బుధోరరీకృతాయ;**

**తే॥ పాహిమాం! పాహిమా! మన్యథాహి నాస్తి!**
**శరణ మరుణాబ్జ దృక్కోణ కరుణ!" యనుచు**
**వందనముఁజేసి కొలుతు భావమున నిన్ను!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 73**

**ప్రతిపదార్థము:–** వైరి = శత్రువులను; హర = హరించుటయందు (సంహరించుట యందు); రంహ! = వేగము (వడి) కలవాడా!; సింహాద్రి = సింహాచలముపై వెలసిన; నారసింహ! = ఓ నారసింహప్రభూ!

రక్షిత దేవతాయ = దేవతలను రక్షించువానికి; సురేంద్ర సేవితాయ= ఇంద్రునిచే సేవింపబడువానికి; మునీంద్ర = మునిశ్రేష్ఠులచే; భావితాయ = భావింపబడువానికి (తలపబడువానికి); తే = నీకు; నమః = నమస్కారము.

నిత్య = ఎల్లప్పుడును; సుధీ = మంచిబుద్ధిగలవారియందు; రతాయ = ప్రీతిగలవానికి; సుమేరు = మేరుపర్వతమువలె; ధీరతాయ = ధీరత్వము (ధైర్యము) గలవానికి; అశుభ = అమంగళమును; వారణాయ = తొలగించెడువానికి; తే = నీకు; నమః = నమస్కారము.

నిర్జిత = జయింపబడిన; దీనతాయ = దీనత్వముగలవానికి (భక్తుల దైన్యమును పూర్తిగా పోగొట్టువానికి); భృత + ఆప్త మానవాయ = ఆప్తులైన మానవులను ఆదుకొనువానికి; దళిత = ఖండింపబడిన; దానవాయ = దానవులు కలవానికి (రాక్షసులను చంపువానికి); తే = నీకు; నమః = నమస్కారము.

జ్ఞాన = జ్ఞానవంతులగు; సుధీ = మంచిబుద్ధిగలవారికి; హితాయ = మేలు చేయువానికి; స్మరాయిత + ఆకృతాయ = మన్మథునివలె ఆచరించుచున్న

(కనబడుచున్న) ఆకారముగలవానికి (మన్మథాకారునకు); బుధ + ఉరరీకృతాయ = దేవతలచేత పండితులచేత అంగీకరింపబడువానికి; తే = నీకు; నమః = నమస్కారము.

అరుణ + అబ్జ = ఎఱ్ఱతామరపూవులవంటి; దృక్కోణ = చూపుల కొనలయందు; కరుణ = దయగలవాడా!; శరణమ్ = (నీవే) దిక్కు; అన్యథా హి నాస్తి = వేరెవ్వరును (ఆదుకొనువారు) లేరు; పాహి మాం! పాహి మాం! = నన్ను రక్షింపుము! నన్ను రక్షింపుము (మాం = నన్ను; పాహి = రక్షింపుము); అనుచున్ = అని పలుకుచు; వందనమున్ + చేసి = నమస్కరించి; నిన్నున్ = నిన్ను; భావమునన్ = నా మనస్సులో; కొలుతున్ = ధ్యానింతును.

**తాత్పర్యము:–** శీఘ్రముగా శత్రునిర్మూలనము చేయువాడా! ఓ సింహాచల నరసింహస్వామీ! నేను ఎల్లప్పుడును నా మనస్సులో నిన్ను ధ్యానింతును.

దేవతలను రక్షించుచు, ఇంద్రునిచే సేవల నందుకొనుచు, మునీంద్రుల ధ్యానమున నిల్చు నీకు నా వందనము.

సద్బుద్ధి గలవారియందు ప్రీతిగలవాడవు నీవు. మేరుగిరివలె ధీరుడవు. అమంగళములను తొలగించువాడవు. అట్టి నీకు వందనము.

(భక్తుల) దీనత్వమును పోగొట్టి కృపచూపువాడవు నీవు. ఆపదలలో నుండు నీ ఆప్తులను (భక్తులను) ఆదుకొనువాడవు నీవు. రాక్షసులను తునుమాడువాడవు. అట్టి నీకు నమస్కారము.

జ్ఞానవంతులై సద్బుద్ధిగలవారికి నీవు మేలుచేసెదవు. నీవు మన్మథునివలె సుందరమైనవాడవు (మన్మథాకారుడవు). దేవతలు, పండితులు నిన్ను శిరసా వహింతురు. అట్టి నీకు నమస్కారము.

ఎఱ్ఱతామరలవంటి నీ కడగంటి చూపులలో దయ తొణకిసలాడును. నీ కంటె నాకు దిక్కెవ్వరును లేరు. నన్ను రక్షింపుము! నన్ను రక్షింపుము! నీకు వందనములు!! (ఈ పద్యమునకు ప్రతిపదార్థ తాత్పర్యములు రచించినవారు డా॥ కొడిమడుగు నాగేశ్వరశాస్త్రిగారు).

**సీ॥ స్నానసంధ్యాద్యనుష్ఠాన శక్తుఁడఁ గాను,**
**పరమ యోగాభ్యాస పరుఁడఁ గాను;**
**విమల దివ్యక్షేత్రగమన దక్షుఁడఁ గాను,**
**ఘన వరదాన సంగతుఁడఁ గాను;**

భవదీయ పదపద్మ భక్తియుక్తుఁడఁ గాను,
నిరుపమ జ్ఞాన మానితుఁడఁ గాను;
పరమోపకార సంభరిత చిత్తుఁడఁ గాను,
శమదమ సత్యనిశ్చలుఁడఁ గాను;
తే॥ వినుము దీనావన! యనాథజనుఁడనయ్య!
నేను మిక్కిలి తెలియఁగా నేరనయ్య!
దేవ! నిర్హేతుకృప నన్నుఁ బ్రోవవయ్య!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 74

**అర్థములు:–** సంధ్య + అనుష్ఠానము = సంజవేళలో చేయవలసిన ఆచారము (సంధ్యావందనము); విమల = పవిత్రమైన; గమనము = పోవుట; ఘన–వర–దాన–సంగతుఁడు = గొప్ప–శ్రేష్ఠమైన – దానములతో – సంబంధము గలవాడు; నిరుపము – జ్ఞాన – మానితుఁడు = సాటిలేని – జ్ఞానమువలన – గౌరవింపబడువాడు; దీన + అవన = దీనులను కాపాడువాడా!; నిర్హేతుకృప = కారణములేని దయ.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! స్నానము సంధ్యావందనాది క్రియలెఱుగను. యోగాభ్యాసమన నేమియో తెలియదు. దివ్యక్షేత్రములను సందర్శించుటకు శక్తిలేదు. దానములుసేయుస్థితి లేదు. నీ పాదములయందు సంపూర్ణభక్తి లేదు. భగవత్ జ్ఞానము ఏ మాత్రము లేనివాడిని. ఇతరులకు ఉపకారముసేయు హృదయము లేదు. శమ దమ సత్యాది గుణములు లేవు. నేను అనాథుడను. తెలియనివాడిని. నన్ను నిర్హేతుకమైన కృపతో రక్షింపుము స్వామీ!

సీ॥ ధరణి గుప్తంబైన చరణయుగ్మముతోడ,
నలరారు ప్రక్క గాయంబుతోడ;
రణీయమైన వరాహాననముతోడ,
ఘనతర ఫాలలోచనముతోడ;
నిగనిగలాడు బల్నిడుద కీల్జడతోడ,
నవ్య గోక్షీర వర్ణంబుతోడ;
మైనిండ నలఁదిన మంచిగందముతోడ,
నమిత భక్తానుగ్రహంబుతోడ;

**తే॥ నఖిల లోకావనము సేయ నవతరించి**
**యున్న, మిమ్ముల వినుతింప నోపలేరు**
**హిమకరకిరీట ముఖులు, నేనెంతవాఁడ!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 75**

**అర్థములు:-** ధరణి గుప్తంబైన = నేలలో దాగిన; చరణయుగ్మము = పాదములజంట; వరాహ + ఆననము = పందిమోము; ఫాలలోచనము = నుదుటిపైనున్న కన్ను; బల్ + నిడుద - కీల్ + జడ = మిక్కిలి - పొడవైన - వాలుజడ (కీలుజడ > కీల్జడ); మైనిండ = శరీరమునిండ; లోక + అవనము = లోక సంరక్షణము; హిమకర కిరీటుఁడు = చంద్రుని తలపై ధరించినవాడు (శివుడు); ముఖులు = మొదలగువారు.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహప్రభూ! భూమియందు దాగిన పాదములతో, ప్రక్కగాయముతో, రమణీయమైన వరాహముఖముతో, నుదిటి కన్నుతో, నిగనిగా మెఱిసిపోవు జడతో, తెల్లని ఆవుపాల వర్ణముతో, శరీరమునిండా అలదుకొన్న మంచిగంధముతో, భక్తులయెడ అనుగ్రహముతో - లోకములను కాపాడుటకు అవతరించిన స్వామివి. నిన్ను పరమేశ్వరాది దైవములు స్తుతించుటకు సరిపోరనగా, నే నెంతవాడను? (సింహాచలములోని వరాహలక్ష్మీనరసింహస్వామివారికి పాదములు భూములో దిగబడియుండును. పైకి కనబడవు. వరాహముఖము ఉండును. నుదుట కన్ను ఉండును.)

**సీ॥ సోమకాభిఖ్య రక్షోనేత ధృతిచేత**
**నామ్నాయ జాతము లపహరించి,**
**మధ్యే నదీనాథ మగ్నుఁడై దాఁగిన,**
**తత్ఖలుం దునిమి, వేదములు మఱల**
**ధాత కొసంగఁగాఁ దలఁచి, నీవల మత్స్య**
**మూర్తివౌటను, దపస్ఫూర్తి వేళఁ**
**దొడరి ధీవరులు సద్గుణ జాలముల నెంచి**
**నిలుపుదు రాత్మమందిరములందుఁ,**

**తే॥ గాన, నిను భక్తిరసపూర కలిత లలిత**
**మామకీన మనస్సరోమహితుఁ జేతు,**
**శీఘ్ర మిష్టమొసంగ వేంచేయుమయ్య!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 76**

**అర్థములు:–** సోమక + అభిఖ్య = 'సోమకు'డను పేరుగల; రక్షస్ + నేత = రాక్షసరాజు; ఆమ్నాయ జాతములు = వేదములు; నదీనాథుఁడు = సముద్రుడు; మగ్నుఁడు = మునిగినవాడు; ధాత = బ్రహ్మ; తపస్స్ఫూర్తి వేళ = తపస్సు పరిపూర్ణమగునప్పుడు; తొడరి=ప్రయత్నించి; ధీవరులు=జ్ఞానులు, బుద్ధిమంతులు(బెస్తలు); సద్గుణజాలములన్ = మంచి గుణముల సమూహముతో (మంచి దారముల వలలతో); మామకీన = నాయొక్క; ఇష్టము = కోరిక; మహితున్ చేతు=గొప్పవానినిగా చేయుదును.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! సోమకాసురుడు వేదములు దొంగిలించి, సముద్రమధ్యమున దాగగా, ఆతనిని చంపి, తిరిగి వేదములను బ్రహ్మకు ఈయదలచి, నీవు మత్స్యావతారము ధరించితివి. కావున ధీవరులు (బెస్తవారు–జ్ఞానులు) సద్గుణజాలములతో (మంచి దారములతో కూడిన వలలతో –మంచిగుణముల సమూహముతో) నిన్ను పట్టి, తమ మనోమందిరములయందు ఉంచుదురు. కావున ఓ ప్రభూ! నిన్ను భక్తిరసముతో నుప్పొంగుచున్న నామనస్సనెడు సరస్సులో గొప్పగా నిలిపెదను. శీఘ్రమే నా కోరిక నీడేర్చుటకు దయతో వేంచేయుము! (ఇది మత్స్యావతార వర్ణనము.)

**సీ॥ చలువగా పన్నీట జలకంబు లొనరించి,**
**విలువలేని కడాని వలువఁగట్టి;**
**కలికి మానికములఁ గులుకు గద్దియ నిల్పి,**
**తిలకంబు నొసటఁ జెన్నలర దిద్ది;**
**కలపంబు మైనిండ నలఁది బల్మగరాల,**
**తళతళలాడు సొమ్ములు ధరించి;**
**యలరు నెత్తావిదండలు వీలుగా వేసి,**
**కలిత రసాన్న మింపొలయఁ బెట్టి;**

తే॥ విడెమిడి, పదమ్ము లొత్తెద వేడ్క తోడఁ,
బవ్వళింపుము మన్మనఃపద్మశయ్య,
నల్ల రిపులనెల్ల మర్దించి యలసినావు,
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 77

**అర్థములు:-** కడాని - వలువ = బంగారు - వస్త్రము; కలికి - మానికముల = సుందరమైన మాణిక్యములతో కూడిన; కులుకు గద్దియ = విలాసవంతమైన సింహాసమనము; చెన్ను + అలరన్ = అందము ప్రకాశింపగా; కలపము = మంచి గంధము; పల్ + మగరాల = పెక్కు వజ్రములతో కూడిన; సొమ్ములు = ఆభరణములు, అలంకారములు; అలరు-నెత్తావి-దండలు = పూల పరిమళముతో కూడిన మాలలు; కలిత - రస + అన్నము = మనోహరమైన - ఆరు రుచులతోకూడిన - భోజనము; విడెమిడి = తాంబూలమునిచ్చి; మన్ + మనః-పద్మ - శయ్య = నా మనస్సు అనెడి తామరల పాన్పు; రిపులు = శత్రువులు.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహప్రభూ! స్వామీ! శత్రువులను చెండాడి అలసిపోయితివి, రమ్ము! చల్లని పన్నీటితో స్నానము చేయింతును. బంగారు వలువ కట్టబెట్టెదను. మాణిక్యముల ఆసనముపై కూర్చుండబెట్టి, నొసట కస్తూరితిలకము దిద్ది, నీ శరీరమంతయూ గంధము రాచి, వజ్రాల సొమ్ములు అలంకరించెదను. పూదండలు సమర్పింతును. ఇంపుగా నైవేద్యము పెట్టెదను. తాంబూలమిచ్చి, నీ పాదము లొత్తెదను. రమ్ము! నా మనఃశయ్యపై పవ్వళింపుము!

సీ॥ భువనముల్ కుక్షిలోఁ బూని రక్షింతువా,
భువనంబులో నిక్కముగఁ జరింతు;
పరమాణురూప విభ్రాజ మానుఁడవయ్యు,
తామేటి రూపంబుఁ దాల్పనేర్తు;
వసమ వైరాగ్య మానసుఁడవయ్యు, వినోద
గతితోన మందరాగము ధరింతు;
వతి నిర్భరాత్ముఁడవై వెలింగియు, నీవ
నంత రూపంబు ధరింతు వెప్పు

**తే॥ దనఁగ, లోకోపకారార్థ మవతరించి,**
**మించి యాక్రియ లొనరించి, మిగులఁ జెలఁగు**
**కూర్మనాయక! నన్నేలు కొనఁగదయ్య –**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 78**

**అర్థములు:–** భువనములు = లోకములు; కుక్షి = పొట్ట; విభ్రాజమానుఁడు = ప్రకాశించువాడు; తామేటి రూపము = తాఁబేలు రూపము; అసమ–వైరాగ్య మానసుఁడు = సాటిలేని విరాగము (విరక్తి) గల మనస్సు కలవాడు; మందర + అగము = మందర పర్వతము; అతి–నిర్భర+ఆత్ముఁడు = మిక్కిలి భరింపశక్యముకాని ఆత్మకలవాడు; అనంతరూపము = అంతములేని రూపము.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! స్వామీ! నీవు భువనములను కుక్షిలో పెట్టుకొని, రక్షించుచు, ఆ భువనములందే సంచరింతువు. పరమాణుసూక్ష్మరూపుడ వైననూ తాఁబేలురూపము ధరింపగలవు. గొప్ప వైరాగ్యభావము కలవాడవైనను, వినోదముకొఱకు మంథరపర్వతమును మోయుదువు. ఆత్మస్వరూపుడవై ప్రకాశించినవాడవైనను, అనంతరూపముతో ప్రకాశింతువు. ఇట్టివాడవయ్యును, లోకోపకారార్థము అనేకకార్యములు చేసి విజయముగొన్న కూర్మనాథుడా! నన్ను రక్షింపుము! (ఇది కూర్మావతార వర్ణనము.)

**సీ॥ అతి తిగ్మరుచిమండలాక్షియుగ్మచ్ఛాయ**
**వలయాద్రి దావాగ్నివలె వెలుంగ,**
**రిక్కింప తనురుహశ్రేణిఁ గాఁడిన యఖం**
**డాళి సూచ్యగ్ర ముక్తాంచితముగ,**
**గురు దిశాభేదక ఘుర్ఘురధ్వని క్షయ**
**స్తనయిత్ను గర్జకుం జదువు చెప్పఁ,**
**బదఘట్టనలఁ జిమ్ము ప్రళయోదకము నభ**
**స్థలము నామ్రేడితమ్ముఁ జేయఁ,**

**తే॥ గిటితనువుతో హిరణ్యాక్షు గీటణంచి,**
**క్షమ ధరించితి చర్వణసమయ లగ్న**

మేఘశకలంబుగతి దంష్ట్రమీద నదర!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 79

**ప్రతిపదార్థము:-** వైరి హరరంహ! = శత్రువుల విజృంభణమును శీఘ్రముగా అణచువాడా!; సింహ+అద్రి – నారసింహ! = సింహగిరి నరసింహస్వామీ!

అతి–తిగ్మరుచి మండల = సూర్యమండలమునకన్న కాంతిమంతములైన; అక్షియుగ్మచ్ఛాయ = కనుదోయి వెలుగు; వలయ+అద్రి = గుండ్రముగా నుండు చక్రవాళ పర్వతమునందలి; దావ + అగ్నివలెన్ = కార్చిచ్చువలె; వెలుంగున్ = ప్రకాశించుచుండగా–

తనురుహశ్రేణిన్ = వెండ్రుకల గుంపును; రిక్కింపన్ = నిక్కింపగా; కాఁడిన =గ్రుచ్చుకొనిన (నాటిన); అఖండ + అళి = సాంద్రమైన వృశ్చికరాశి (తేలు ఆకారములో నుండు చుక్కలగుంపు); సూచి + అగ్ర = సూదిమొనలమీద నిల్పిన; ముక్త + అంచితముగన్ = ముత్యమువలె అందగింపగా–

గురు = పెద్దగా; దిశాభేదక = దిక్కులను పగులగొట్టెడి; ఘుర్ఘుర ధ్వనులు = ఘుర్ ఘుర్ అను (వరాహ) ధ్వనులు; స్తనయిత్ను = మేఘముల; గర్జకున్ = గర్జనకు; చదువుచెప్పన్ = పాఠము నేర్పుచుండగా –

పదఘట్టనలన్ = (వరాహ) పాదముల త్రొక్కుడులచేత; చిమ్ము = పైకి రేగుచున్న; ప్రళయ + ఉదకము = ప్రళయకాలమందలి జలము; సభస్థలమున్ = గగన ప్రదేశమును; ఆమ్రేడితమ్మున్ – చేయన్ = ద్విగుణీకృతముగా చేయుచుండగా – (మరియొక ఆకాశమా! అనునట్లు చేయుచుండగా–)

కటితనువుతోన్ = వరాహదేహముతో; హిరణ్యాక్షున్ = హిరణ్యాక్షుడను రక్కసుని; గీటణంచి = చంపి; చర్వణసమయ = నమిలి తినెడి సమయములో; లగ్న = హత్తుకొని నిలిచిన; మేఘశకలంబు గతిన్ = ముస్తెదుంప తునక వలె (తుంగగడ్డ ముక్కవలె); దంష్ట్రమీదన్=కోరపంటిపై; అదరన్ = ఒప్పునట్లుగా; క్షమన్ = భూమిని; ధరించితి(వి) = మోచితివి.

**తాత్పర్యము:-** శత్రువుల విజృంభణమును శీఘ్రముగా అణచువాడా! ఓ సింహాద్రి నారసింహస్వామీ! వరాహావతారములో – సూర్యమండలముకన్న కాంతిమంతములైన నీ కనుదోయి వెలుగు, గుండ్రముగా నుండు చక్రవాళ పర్వతము నందలి కార్చిచ్చు వలె ప్రకాశించుచున్నది.

నీవు వెంద్రుకల గుంపును నిక్కింపగా, అవి సాంద్రమైన వృశ్చికరాశిలోని నక్షత్రములకు గ్రుచ్చుకొని, అవి (ఆ చుక్కలగుంపు) సూదిమొనలమీద నిల్పిన ముత్యములవలె అందగించినవి.

దిక్కులను పగులగొట్టునట్లుగా నీవు పెద్దగా చేయు ఘుర్ఘుర ధ్వనులు, మేఘ గర్జనలకు చదువు చెప్పుచున్నవి. (మేఘగర్జనల కన్న అధికముగా నున్నవి).

నీ పాదముల త్రొక్కుడుల చేత పైకి చిమ్ముచున్న సముద్రజలము, ప్రళయకాల జలమువలె ఆకాశమును ద్విగుణీకృతముచేయుచున్నది (మరియొక ఆకాశమా! – అనునట్లు చేయుచున్నది).

ఈ విధముగా నీవు వరాహదేహముతో, హిరణ్యాక్షుడను రాక్షసుని చంపి, భూమిని నీ కోరల మీద ధరించితివి! అప్పుడు ఆ భూమి, నీవు తుంగదుంపలను నమిలి తినెడి సమయములో నీ కోరపంటికి అంటుకొనిన ఒక తుంగదుంప ముక్కవలె ఒప్పినది! (ఇది వరాహావతార వర్ణనము. ఈ పద్యమునకు ప్రతిపదార్థ తాత్పర్యములు వ్రాసినవారు: డా॥ కొడిమడుగు నాగేశ్వరశాస్త్రిగారు).

**సీ॥ నతిఁజేతు నిదె నీకు నాసికా నిస్సృత**
**ఝుంఝూనిలోద్ధూత శైలజాత !**
**వందనం బిదె నీకుఁ బ్రహ్లాద శుక పరా**
**శర ధీర హృదయ గహ్వర విహార!**
**సాష్టాంగ మిదె నీకు స్వర్భాను హిమధామ**
**జేతృప్రతాప నృసింహరూప!**
**మ్రొక్కెద నిదె నీకు క్రూరసంహారక**
**సాగరపూరకోదార కరుణ!**

**తే॥ పాలన మొనర్చు నఖర కుద్దాల దళిత**
**కనక కశిపు దానవ ఘనతను విదళన**
**జాత కీలాల పరితృప్త భూతనివహ!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 80**

**ప్రతిపదార్థము: –** వైరి = శత్రువులను; హర = హరించుటయందు (చంపుటయందు); రంహ = వేగము (వడి) కలవాడా!

నాసికా = ముక్కులనుండి; నిస్సృత = వెలువడిన; ఝంఝా+అనిల+ ఉద్ధూత = తుపానుగాలిచేత ఎగురగొట్టబడిన; శైలజాత! = కొండల సమూహము కలవాడా!; ఇదె = ఇదిగో; నీకు = నీకు; నతిన్ + చేతున్ = నమస్కరించుచున్నాను.

ప్రహ్లాద – శుక – పరాశర = ప్రహ్లాద, శుక, పరాశరులనెడి భక్తుల; ధీర = గంభీరమైన; హృదయ = హృదయములనెడి; గహ్వర = గుహలలో; విహార! = విహరించువాడా!; ఇదె = ఇదిగో; నీకు = నీకు; వందనము = నమస్కారము.

స్వర్భాను = సూర్యుని; హిమధామ = చంద్రుని; జేతృ = జయించిన; ప్రతాప = పరాక్రమము కలిగిన; నృసింహరూప! = నృసింహావతార స్వరూపుడా!; ఇదె = ఇదిగో; నీకు = నీకు; సాష్టాంగము = సాష్టాంగ నమస్కారము.

క్రూర = క్రూరమైన వారిని (రాక్షసులను); సంహారక! = సంహరించువాడా!; సాగర – పూరక + ఉదార–కరుణ! = సముద్రములను నిండించునంతటి ఉదారమైన కరుణ కలవాడా!; ఇదె = ఇదిగో; నీకు = నీకు; మ్రొక్కెదన్ = మ్రొక్కుచున్నాను.

నఖర = గోళ్ళు అనెడి; కుద్దాల = గొడ్డలిచేత; దళిత = ఖండింపబడిన; కనకకశిపు = హిరణ్యకశిపుడు అను; దానవ = రాక్షసునియొక్క; ఘనతను = పెద్ద శరీరమును; విదళన = చీల్చుటచేత; జాత = పుట్టిన; కీలాల = రక్తముచేత; పరితృప్త = మిక్కిలి సంతోషించిన; భూతనివహా! = భూత బేతాళ సమూహము కలవాడా!; (నన్ను) పాలనము + ఒనర్పు = (నన్ను) రక్షింపుము.

**తాత్పర్యము:–** శత్రువులను వేగముగా (వెంటనే) సంహరించువాడా! ఓ సింహాద్రి నారసింహప్రభూ! నీ ముక్కులనుండి వెలువడిన గాలి, తుపానుగాలివలె భయంకరముగా నున్నది. అది కొండల గుంపులను ఎగురగొట్టుచున్నది. అట్టినీకు ఇదిగో నమస్కరించు చున్నాను!

ప్రహ్లాదుడు, శుకమహర్షి, పరాశరముని మొదలగు భక్తుల పవిత్ర హృదయములనెడి గుహలలో విహరించువాడా! ఇదిగో! నీకు నా వందనము!

సూర్యచంద్రులను జయించిన పరాక్రమము కలిగిన ఓ నృసింహావతార స్వరూపుడా! ఇదిగో! నీకు సాష్టాంగ నమస్కారము చేయుచున్నాను.

క్రూరులైన రాక్షసులను సంహరించువాడా! సముద్రములను నిండించునట్టి ఉదారమైన కరుణకలవాడా! (కరుణాసముద్రుడా!) ఇదిగో! నీకు మ్రొక్కుచున్నాను.

హిరణ్యకశిపుడనే రాక్షసుని పెద్దశరీరాన్ని నీ గోళ్ళగొడ్డలితో ఖండించి (వాని కడుపు) చీల్చగా పుట్టిన రక్తముచేత భూతబేతాళములను మిక్కిలి సంతోషింప

జేసినవాడా! నన్ను రక్షింపుము! (ఇది నృసింహావతార వర్ణనము. ఈ పద్యమునకు ప్రతిపదార్థ తాత్పర్యకర్త: సంపాదకులైన ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావుగారు.)

**సీ॥ దేవతాతతి కోర్కెc దీర్పcగా సమకట్టి,**
**జనకతార్థికిc గశ్యపునకుc బుట్టి;**
**యుదుటుగా నుదుట మృదూర్ధ్వపుండ్రముc బెట్టి,**
**కింశుక దండంబుc గేలc బట్టి;**
**పసుపు నిగ్గులు దేరు పచ్చ గోచియుc గట్టి,**
**మధ్యస్థలంబున మౌంజిc జుట్టి;**
**వర్ణనీయ ద్విజవర్ణివై పొడకట్టి,**
**బాలార్క శతశతాభc గనుపట్టి;**

**తే॥ ధరణి గగనము రెండు పాదముల మట్టి,**
**మతి తృతీయాంఘ్రి నబ్బలి మట్టునట్టి**
**వామనా! ప్రేమ నా మనస్సీమ నుండు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 81**

**అర్థములు:–** దేవతాతతి = దేవతల సమూహము; జనకత + అర్థి = తండ్రికావలెనని కోరినవాడు; ఉదుటుగా = విలాసముగా; ఊర్ధ్వపుండ్రము = నిలువుబొట్టు; కింశుక దండము = మోదుగుకోల; మధ్యస్థలము = నడుము; మౌంజి = దర్భలతో పేనిన మొలత్రాడు; ద్విజవర్ణి = బ్రాహ్మణ బ్రహ్మచారి; బాల+ అర్క – శతశత + ఆభన్ = వేయి బాలసూర్యుల కాంతితో; మట్టు = త్రొక్కు; తృతీయ+అంఘ్రి = మూడవ పాదము.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహ ప్రభూ! దేవతలు ప్రార్థించగా కశ్యపునకు కుమారుడవై జన్మించితివి. నుదుట ఊర్ధ్వపుండ్రములు దిద్దుకొని, మోదుగ దండమును చేతపట్టితివి. పసుపుగోచీ ధరించి, నడుమున దర్భత్రాడు కట్టుకొంటివి. వేయి బాలసూర్యుల కాంతితో, బ్రాహ్మణ బ్రహ్మచారివై కనిపించితివి. భూమ్యాకాశములను రెండు పాదములతో ఆక్రమించి, మూడవ అడుగు ఆ బలిచక్రవర్తి తలపైనుంచి, అతనిని మట్టుబెట్టితివి. వామనా! ప్రేమతో నామనస్సునందే నివసించవయ్యా! (ఇది వామనావతార వర్ణనము.)

సీ॥ కార్తవీర్యార్జున కరచయారణ్యంబు
దారుణాగ్ర కుఠార ధారc దునిమి,
చిరతర క్షత్రియ క్షేత్రముల్ సొంపుగా
భీమేషు హలముల బెగడ దున్ని,
తన్నృప మస్తకతతులు గుట్టలువైచి
మిగులc జిత్రంబుగా మెట్లుగట్టి,
తత్తను కీలాల ధారా సరిత్తుల
నవనవంబులుగc గాలువలు దిద్ది,

తే॥ ఘన యశస్సస్య మవని యాకసము నిండc
బ్రబలచేసితి వౌభళీ! పాదుకొనియె
భావి హలమూర్తి పరశురామావతార!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 82

**అర్థములు:-** కరచయ + అరణ్యంబు = చేతుల సమూహమనెడి - అడవి; దారుణ + అగ్ర - కుఠార - ధార = క్రూరమైన - శ్రేష్ఠమైన - గొడ్డలి - పదును; భీమ + ఇషు - హలములు = భయంకరమైన - బాణములు అను - నాగళ్ళు; బెగడు = భయము (బెగడ దున్ని = భయపడునట్లుగా దున్ని); కీలాల - ధారా - సరిత్తులు = రక్త-ధారల-నదులు; ఔభళీ! = (ప్రశంసను తెలుపు పదము); పాదుకొనియె = స్థిరపడెను.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహప్రభూ! కార్తవీర్యార్జునుని వేయితలలనెడు అరణ్యమును, వాడియైన గండ్రగొడ్డలిచే నరికి, దుష్టులగు క్షత్రియులనెడు పొలములను, భయంకర బాణములనెడు నాగళ్ళచే దున్నివైచితివి! ఆ రాజుల తలలను మెట్లుగా చేసి, వారి రక్తధారలను కాలువలుగా పారించితివి! నేల నింగి నిండిపోయి వ్యాపించునట్లుగా, కీర్తియను పంటను పండించితివి! ఔభళీ! భావికాలమున బలరాముడవైన ఓ పరశురామా! నీకు ప్రణామములు! (ఇది పరశురామావతార వర్ణనము.)

**సీ॥ మనువంశభూషణ మహిమచేఁ జెన్నొంది,**
**ఘన కళాసాంగత్య కలనఁజెంది;**
**సకల సాయక వర్ణసంగతి నింపొంది,**
**సద్గుణరీతిఁ బ్రశస్తినొంది;**
**యత్రాస పటల లీలాత్మతఁ జెలువొంది,**
**నిర్దోషగతులచే నెలవుఁ జెంది;**
**సకల జగన్నుత సంపదఁ జెన్నొంది,**
**సుకుమార రత్న సంశుద్ధినొంది;**

**తే॥ సరస దశరథపత్ని కౌసల్యగర్భ**
**మనెడు గనియందు హరినీలమన జనించి,**
**రామసంజ్ఞ మెలంగు నిన్ బ్రస్తుతింతు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 83**

**ప్రతిపదార్థము:–** (పై పద్యములో "రాముడు" – "ఇంద్రనీలమణి" అను రెండింటికిని శ్లేషాలంకారమున్నది. అందువలన పెక్కు పదములకు రెండేసి అర్థములిచ్చుచున్నాము) మనువంశము = 1. మనువంశ చక్రవర్తులు, 2. మానవజాతి; కళ = 1.విద్య; 2. శిల్పము; కలన = 1. ఎఱుఁగుట; 2. పొందుట; (1) సాయకము = ఆయుధము (శస్త్రాస్త్రములు); (2) శాయకము = శయనింపజేయునది (చీకటి); వర్ణము = 1.మంత్రాక్షరములు; 2. రంగు; సద్గుణము = 1. మంచిగుణము; 2. మంచిదారము (తీగ); త్రాసము = 1. భయము; 2. ఒకానొక రత్నదోషము; పటలము = 1.సమూహము; 2. ఒకానొక రత్నదోషము; లీల = 1. క్రీడ; 2. ఆకారము; నెలవు = 1. వ్యాప్తి (కీర్తి); 2. స్థానము (ఉనికి); సంపద = 1. గుణసంపద; 2. ధనసంపద; రత్నము= 1. శ్రేష్ఠుడు; 2. మణి; సంశుద్ధి = 1. పవిత్రముగా చేయుట; 2.సానపట్టి చక్కగా చేయుట; సరస = అనురాగవతియైన; హరినీలము = ఇంద్రనీలము; సంజ్ఞ = పేరు; మెలఁగు = వర్తించు; ఈ పద్యపాదములలో చివర వచ్చిన "చెన్నొంది (చెన్ను + ఒంది) – ఇంపొంది (ఇంపు + ఒంది) – "చెలువొంది" (చెలువు + ఒంది) – అను పదములకు "అందగించి" అని అర్థము.

**రాముని పరముగా తాత్పర్యము:–** శత్రువులను వేగముగా (వెంటనే) సంహరించువాడా! ఓ సింహాద్రి నారసింహ ప్రభూ! రామావతారములో నీవు మనుచక్రవర్తుల వంశమునకు

గొప్ప భూషణమై (అలంకారమై) అందగించినావు. గొప్ప కళలలోను, విద్యలలోను ఆరితేరినవాడవైనావు. పలురకముల అస్త్రములయొక్క మంత్రాక్షరముల సాంగత్యమును పొందినావు (శస్త్రాస్త్ర ప్రయోగమునందు నేర్పరివైనావు). సకల సద్గుణములతో కూడి ప్రశస్తికెక్కినావు. నిర్భయముగా అనేక లీలలను సుందరముగా ప్రదర్శించినావు. ఏ విధమైన దోషములు లేని ప్రవర్తనచేత కీర్తిని గడించినావు. సమస్త ప్రపంచము సన్నుతించిన సద్గుణ సంపదతో చెన్నొందినావు. దశరథుని సుపుత్రులలో శ్రేష్ఠుడవై పవిత్రతను పొందినావు. ఇట్లు సకల సద్గుణాభిరాముడవై, అనురాగవతియగు దశరథుని భార్యయైన కౌసల్యయొక్క గర్భమనెడి గనిలో, ఇంద్రనీలమణివలె జన్మించినావు. ఈ విధముగా ''రాము''డను పేరుతో వర్తించుచున్న నిన్ను ప్రస్తుతించెదను.

**ఇంద్రనీలమణి పరముగా తాత్పర్యము:–** ఇంద్రనీలమణి – మానవజాతి ధరించు ఆభరణములకు శ్రేష్ఠత్వము నిచ్చునది. గొప్ప శిల్పకళతో సంబంధము కలిగినది (అందమైన నగిషీపనితో కూడిన నగలలో పొదగబడినది). సమస్త ప్రాణులను నిదురింపజేయు చీకటివంటి రంగుతో అందగించినది. మంచి దారము (తీగ)తో కూర్చబడుటవలన ప్రసిద్ధికెక్కినది. "త్రాసము" – "పటలము" అను రత్నదోషములు లేనిది. ఏ విధమైన ఇతర దోషములును లేనిది. లోకమంతటిచేతను ప్రశంసింపదగిన ధనసంపదతో కూడినది (మిక్కిలి విలువైనది). అందమైన రత్నముగా సానపట్టబడి, నిర్మలత్వమును పొందినది. రత్నాల గనిలో పుట్టినది.

**విశేషాంశము (శ్లేషాలంకార వివరణ):–** కవి యిచ్చట ప్రకృతమైన రాముని గుణములను, అప్రకృతమైన ఇంద్రనీలమణి గుణములను పోల్చి శ్లేషాలంకారముతో వర్ణించినాడు. కాబట్టి యిది "ప్రకృతాప్రకృత (ప్రకృత + అప్రకృత) శ్లేష" అనబడును.

మనువంశ భూషణ మహిమ= 1. మనుచక్రవర్తుల వంశములో శ్రేష్ఠత్వమును పొందిన గొప్పతనము (రాముడు)
2. మానవజాతి ధరించు నగలకు గొప్పతనము నిచ్చుట (ఇంద్రనీలము)

ఘనకళాసాంగత్య కలన = 1. గొప్ప విద్యలతో సంబంధమును తెలిసికొని (రాముడు)
2. గొప్ప శిల్పకళతో సంబంధమును పొంది (ఇంద్రనీలము)

సకల 'సాయక' వర్ణ సంగతి= పలురకముల అస్త్రములయొక్క మంత్రాక్షరముల సాంగత్యము (రాముడు)

సకల 'శాయక' వర్ణ సంగతి= సమస్తమును (సమస్త ప్రాణిలోకమును) నిదురింప జేయు చీకటిరంగును (నలుపును) కలిగి యుండుట (ఇంద్రనీలమణి)

(శ్లేషాలంకారములో "స–శ"లకు అభేదము పాటింపబడును)

సద్గుణరీతి ప్రశస్తి = 1. సుగుణముల పద్ధతివలన వచ్చిన కీర్తి (రాముడు)
2. మంచిదారముతో (తీగతో) సంధింపబడుటవలన వచ్చిన ప్రసిద్ధి (ఇంద్రనీలము)

అత్రాస పటల లీలాత్మత = 1. నిర్భయముగా అనేక లీలలను ప్రదర్శించుట (రాముడు)
2. "త్రాసము" – "పటలము" అను రత్నదోషములు లేని ఆకారము (ఇంద్రనీలము)

నిర్దోషగతులచే నెలవు = 1. దోషములులేని ప్రవర్తనచేత వ్యాప్తి (కీర్తి) (రాముడు)
2. ఏ విధమైన దోషములును లేని ఉనికి (ఇంద్రనీలము)

సకల జగన్నుత సంపద = 1. లోకమంతటి చేతను ప్రశంసింపబడిన గుణసంపద (రాముడు)
2. లోకమంతటి చేతను ప్రశంసింపబడిన ధనసంపద (ఇంద్రనీలము)

సుకుమార రత్న సంశుద్ధి = 1. మంచి కుమారులలో శ్రేష్ఠుడైన పవిత్రత (రాముడు)
2. కోమలమైన (అందమైన) రత్నముగా సానపట్ట బడిన నిర్మలత్వము. (ఇంద్రనీలము)

ఈ విధముగా కౌసల్య గర్భమనెడు గనిలో, రాముడను ఇంద్రనీలము పుట్టెను. (ఇది రామావతార వర్ణనము–1. ఈ పద్యమునకు ప్రతిపదార్థ తాత్పర్యములు, శ్లేషాలంకార వివరణ చేసినవారు: సంపాదకులైన ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు.)

సీ॥ ఫణిరాజ శయ్యపైఁ బవ్వళించెడు నీవు-
పండితి కౌసల్య పక్కలోన!
బ్రహ్మాండ గోళముల్ బ్రాఁకి యాడెడు నీవు-
రహిఁ బ్రాఁకితివి దశరథుని యింట!
బహువేదశాస్త్ర ప్రభావుండవౌ నీవు-
నవ్యక్త వాక్యమ్ము లాడినావు!
సకల చరాచర సంచారివగు నీవు -
మహిఁ దప్పటడుగుల మసలినావు!

తే॥ తల్లి భాగ్యముననొ, తండ్రి తపముగతినొ,
పురజనంబుల తొల్లిఁటి పుణ్యముననొ,
భూవ్రతంబుననో, యిట్లు పుట్టితీవు!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 84

**అర్థములు:-** ఫణిరాజు = ఆదిశేషుడు; రహి = ఆనందము, అందము; అవ్యక్త వాక్యములు = ముద్దుమాటలు.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహస్వామీ! నీవు బాలరాముడవై కౌసల్యకు పుట్టితివి. ఆదిశేషునిపై పవళించెడు నీవు, ఆమె ప్రక్కలో పరుండినావు. బ్రహ్మాండగోళములకు ప్రాకు నీవు, దశరథుని ఇంట ఆనందముగా ప్రాకితివి. అనేక వేదశాస్త్రజ్ఞానముగల నీవు, అచ్చట ముద్దుమాటలు ఆడితివి. సకల చరాచర జగత్తులో సంచరించెడు నీవు, నేలమీద తప్పటడుగులు వేయుచు తిరిగినావు. కౌసల్య భాగ్యము వలననో, దశరథుని తపస్సు వలననో, అయోధ్యప్రజల పుణ్యమువలననో, భూదేవి చేసిన వ్రతమువలననో, రాముడవై పుట్టినావు. నీకు ప్రణామములు! (ఇది రామావతార వర్ణనము-2)

సీ॥ చిఱుత కూఁకటి ఘటించిన రావిరేక ము
త్యములు నెన్నొసటిపై దుముకుచుండ,
నిద్దంపు చెవులఁ జెందిన పెద్ద మగఱాల
మద్దికాయలజత ముద్దుఁగులుకఁ,
బులిగోరు నాటిన బలు పద్మరాగంపు
హార మక్కున తళుక్కనుచు మెఱయఁ,

**గంకణధ్వని, మొలఘంటల రొదయు, కిం**
**కిణి రావములును, నేకీభవింప,**

**తే॥ భరత లక్ష్మణ శత్రుఘ్ను బాలకేళిఁ**
**దనరు నినుఁ గన్న తల్లిదండ్రు లనఘు లెన్న,**
**చిన్న రామన్న! నన్ను రక్షింపుమన్న!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 85**

**అర్థములు:–** చిఱుత కూఁకటి = పిల్లజుట్టు; రావిరేక = బిడ్డలకు కొండెయందు కట్టెడు రావియాకువంటి పతకము (కొండె = వెండ్రుకల ముడి, తలముందు సిగ); నిద్దంపు = నున్నని; మగఱాలు = వజ్రములు; మద్దికాయలు = బాలకుల చెవి తమ్మెల నుంచెదు భూషణ విశేషములు; అక్కు = గుండె; కంకణము = చేతికడియము; కింకిణి రావములు = గజ్జెల ధ్వనులు; తనరు = అతిశయించు, ఒప్పు; అనఘులు = పుణ్యాత్ములు.

**భావం:–** ఓ సింహాద్రి నారసింహ ప్రభూ! పిల్లజుట్టుపై పెట్టిన రావిరేకయొక్క ముత్యాలు నుదుటిపై ఆడుచుండగా; చెవుల తమ్మెలయందున వజ్రాల మద్దికాయలు ముద్దుగా కనుపించగా; పులిగోరునుంచిన పద్మరాగముల హారము తళుక్కుమని వక్షస్థలమున మెరయగా; కంకణముల ధ్వనులు, మొలగంటల నాదము, గజ్జెల ఉలివులు ఒక్కటై మ్రోగుచుండగా; బాలరాముడవై; భరత లక్ష్మణ శత్రుఘ్నులతో ఆటలాడు నిన్ను చూచిన ఆ తల్లిదండ్రులు ఎంత ధన్యులో కదా! బాలరామా! నన్ను రక్షింపుమయ్యా! (ఇది రామావతార వర్ణనము–3.)

**సీ॥ రత్న కీలిత తనుత్రాణంబు ధరియించి,**
**కస్తూరికా తిలకంబు దిద్ది;**
**బాణాసన సబాణతూణీరమును దాల్చి,**
**యందంపుజాతి ఱాగందమలఁది;**
**మొసలివా నెఱబాకు మొలఁ జక్కఁగాఁ జెక్కి,**
**కలికి బంగరురంగు కాసెఁగట్టి;**
**భీకరంబుగ గండపెండేరములు బూని,**
**నవరత్నమయ భూషణములు దాల్చి;**

**తే॥ వీర శృంగార రసములు వెలయ నీవు**
**కౌశికునితోఁ జనుట - తాటకావధంబు**
**సలిపి, జానకిఁ బెండ్లాడఁ దలఁచియె కద!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 86**

**అర్థములు:-** రత్నకీలిత = రత్నములు పొదగబడిన; తనుత్రాణము = కవచము; బాణాసనము = ధనుస్సు; తూణీరము = అమ్ములపొది; జాతి = శ్రేష్ఠమైన; ఱాగందము = ఱాతి గందము; మొసలి-వా-నెఱ-బాకు = మొసలి-నోటివంటి - పదునైన - బాకు; కాసె = పంచె; కౌశికుఁడు = విశ్వామిత్రుడు.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహప్రభూ! రత్నములు తాపడంచేసిన కవచము ధరించి, నొసట కస్తూరీ నామము దిద్దుకొన్నావు. విల్లు - బాణములు- అమ్ముల పొదులను దాల్చి - చక్కని రాతి గంధము అలదుకొన్నావు. మొసలినోటివంటి ఆకారముతోనున్న చక్కని బాకును మొలయందు నుంచి, అందమైన బంగారు వస్త్రమును కాసెకట్టితివి. గండపెండేరములు ధరించి, శరీరమున నవరత్నమయమైన ఆభరణములు ధరించితివి. ఇట్టి వీర-శృంగార రసములతో ప్రకాశించుచు, విశ్వామిత్రుని వెంటనడచి వెళ్ళుట-తాటకను చంపిన తరువాత సీతమ్మను పెండ్లాడుటకే కదా! (ఇది రామావతార వర్ణనము-4.)

**సీ॥ శిలదాసినప్పుడె - చికురభావము తోఁచెఁ-**
**బదపద్మకలిత షట్పదము లనఁగ!**
**నడుగిడునప్పుడె - యాననం బేర్పడె-**
**నఖతారగతి నిశానాథుఁ డనఁగ!**
**నంజవేయఁ - గుచద్వయము గనుపట్టెను-**
**రతియుక్త కోకదంపతు లనఁదగి!**
**కలయఁ గ్రుమ్మరువేళఁ - గాంత యయ్యెఁ - దనూజ**
**నొసఁగ నల్లుని జూచు నుర్వి యనఁగ!**

**తే॥ నంతఁ గౌతమునతివ యహల్య యగుచు**
**నతిథి సత్కారములు సల్పెనఁట! త్వదంఘ్రి**

**రజము నుతిసేయఁ దరమె శ్రీరామచంద్ర!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 87**

**అర్థములు:**–డాయు=సమీపించు; చికుర భావము = జుట్టువలె తోచుట; పదపద్మకలిత = పాదపద్మములను పట్టుకొనిన; షట్పదములు = తుమ్మెదలు; ఆననము = ముఖము; నఖతారగతి = చుక్కలవంటి కాలిగోళ్ళ దారిలో; నిశానాథుఁడు = రాత్రికి భర్త (చంద్రుడు); కుచద్వయము = పాలిండ్ల జంట; రతియుక్త = అనురాగముతోకూడిన; కోక దంపతులు = జక్కవపక్షుల జంట; కలయన్ + క్రుమ్మరువేళన్ = అంతటను తిరిగెడి సమయములో; తనూజ = కూతురు; ఉర్వి = భూమి; త్వత్ + అంఘ్రి – రజము = నీ – కాలి – దుమ్ము.

**భావము:**– ఓ సింహాద్రి నారసింహప్రభూ! విశ్వామిత్రునితో వెళ్లునప్పుడు, గౌతమాశ్రమమున నీవు శిలను సమీపించునప్పుడే, ఆ శిలయందు నీ పాదములనెడి పద్మములను పట్టుకొనిన తుమ్మెదలవలె, తలవెంట్రుకలు కనిపించినవి! ఆయిపై నీవు అడుగు పెట్టినంతనే, నీ కాలిగోళ్ళనెడి నక్షత్రముల త్రోవలో ఉదయించిన చంద్రబింబమువంటి స్త్రీ ముఖము కనిపించినది! అడుగు వేసినంతలో, ఆ స్త్రీమూర్తి కుచములు అనురాగముతోకూడిన జక్కవపక్షుల జంటవలె కనబడెను! ఆ మరుక్షణమున తనకు కాబోవు అల్లుడైన నిన్ను చూచుటకు భూదేవియే వచ్చెనో అన్నట్లు స్త్రీమూర్తిగా నిలబడెను! ఆమెయే గౌతముని భార్యయగు అహల్య! నీకామె అతిథి సత్కారములు సల్పి పూజించెనట. నీ పాదధూళి మహిమను వర్ణింపగలమా శ్రీరామా! (ఇది రామావతార వర్ణనము–5.)

**సీ॥ జనకరాజన్య సంసన్మధ్యమున నుండి**
**గొబ్బున లేచి, వే నిబ్బరముగ,**
**మణి లసత్కంకణ మంజుల ధ్వనులచే**
**రాజన్యమనములు రగులఁజేసి,**
**సామిలంబుగ కంఠసరములు దాలిచి,**
**యీశ్వరచాపంబు నెత్తి, హస్తి**
**హస్తాగ్రమున బిసమ్మువలీలఁగొను లీలఁ**
**గొని, నారిఁ దివియ, ఫెళ్ళునను విఱిగె!**

**తే॥ విఱిగె రాఘవ తద్ధ్వనిఁ దరులు గిరులు,**
**విఱిగె నృపతుల మనములు, విఱిగె రిపుల**
**నడుము ఫెళ్ళున, నీ భుజౌన్నత్యగరిమ!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 88**

**అర్థములు:–** రాజన్యుఁడు = పట్టభద్రుఁడైనరాజు, క్షత్రియుఁడు; సంసత్ + మధ్యమున = సభామధ్యమున; గొబ్బున = శీఘ్రముగా, ఆకస్మికముగా, హఠాత్తుగా; నిబ్బరముగ =ధైర్యముగా; రాజన్యులు=రాజశ్రేష్ఠులు; సామిలంబుగ=తళతళలతో కూడిన; హస్తి –హస్త+ అగ్రము=ఏనుగు– తొండము–చివర; బిసము=తామరతూడు; నారిన్– తవియన్ = నారిని లాగగా; తరులు = చెట్లు; గిరులు=కొండలు; రిపులు=శత్రువులు.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! జనకమహారాజుగారి సభామధ్యములో దిగ్గున లేచి నిలబడి, చేతుల కంకణధ్వనులచే రాజకుమారుల మనస్సులు రగిలించి, తళతళమని ప్రకాశించెడి కంఠహారములు ధరించిన రాముడు – తామరతూడును ఏనుగు తన తొండముతో ఎత్తు చందమున – శివధనుస్సును తన చేతితో ఎత్తి, నారి లాగగా, ఆ ధనుస్సు ఫెళ్లున విరిగిపోయినది! ఆ మహాధ్వనికి కొండలు చెట్లు కూలిపోయినవి. రాజుల మనస్సులు విరిగిపోయినవి. వారి నడుములు విరిగినవి. నీ భుజబలమువలననే ఇది అంతయును సాధ్యమయ్యెను శ్రీరామా! (ఇది రామావతార వర్ణనము–6.)

**సీ॥ కనక శలాక, శృంగార తరంగంబు,**
**రాజమరాళి, సామ్రాజ్యలక్ష్మి,**
**మదనబాణము, నవమాలిక, మాణిక్య**
**వల్లరి, చంచలావల్లి, చంద్ర**
**కళ, ధగద్ధగిత నక్షత్రంబు, నవరత్న**
**మంజరి, కందర్ప మదగజంబు,**
**లావణ్య సరసి, విలాస పేటిక, మనో**
**జ వనవాటిక, ఘనసార ఘుటిక,**

**తే॥ జాతరూప సమేత, భూజాత, జనక**
**జాత, దృగ్జిత నవ వనజాత, సీతఁ**

బరిణయంబగు నీమూర్తిఁ బ్రస్తుతింతు!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 89

**అర్థములు:–** కనక శలాక = బంగారు తీగ; శృంగార తరంగము = అందాల కెరటము; రాజమరాళి = రాజహంసి; మదనబాణము = మన్మథుని బాణము; నవమాలిక = క్రొత్తపూలదండ; మాణిక్య వల్లరి = మాణిక్యములనెడి పూలతోకూడిన తీగ; చంచలావల్లి = మెఱపుతీగ; నవరత్నమంజరి = నవరత్నములనెడి పూలగుత్తి; కందర్పమదగజము = మన్మథుని మదపుటేనుగు; లావణ్యసరసి=ముఖకాంతుల సరస్సు; విలాస పేటిక = విలాసములకు పెట్టె; మనోజ–వనవాటిక=మన్మథుని ఉద్యానవనము; ఘనసార ఘుటిక = కర్పూరపుటుండ; జాతరూప–సమేత=బంగారు (ఆభరణముల)తో కూడినది; జనక జాత = జనకుని కూతురు; దృక్+జిత–నవ–వనజాత = చూపులతో జయించిన – క్రొత్త – తామరపూవులు కలది. అనగా–"క్రొత్త తామరపూలను జయించిన చూపులు కలది" అని అర్థము.

**భావము:–** (ఈ పద్యములో సీతాదేవి అత్యద్భుతసౌందర్యమును కవి వర్ణించుచున్నాడు.) ఓ సింహాద్రి నారసింహప్రభూ! బంగారు తునుక – శృంగారపు కెరటము – రాజహంసిని పోలినది – సామ్రాజ్యలక్ష్మి – మన్మథుని బాణము – క్రొత్త పూలదండ – మాణిక్యముల తీగ – మెఱపుతీగ – చంద్రకళ – ధగధగ మెరిసే నక్షత్రము – నవరత్నహారము – మన్మథుని మదపుటేనుగు, లావణ్యసరసి, విలాసపేటిక, మన్మథుని ఉద్యానవనము – కర్పూరపుటుండ – బంగారు ఆభరణములతో కూడినది – భూదేవి కుమార్తె – జనకుని కూతురు – అప్పుడే వికసించిన తామరపూలను జయించిన కంటిచూపులు కలిగినది – అయిన సీతమ్మను పెండ్లియాడు నీ రూపమును ప్రస్తుతింతును. (ఇది రామావతార వర్ణనము–7.)

**సీ॥ కల్యాణ వేదిక కౌతుకంబులు దాల్చి,**
**యందపు మైగంధమలఁది ప్రేమ;**
**తెరవైచి బాసవాల్ తెరవలు దీవింప,**
**లోలోనఁ జూచు మేల్జూపు సొగసు;**
**తోరంపు ముత్యాలు దోసిళ్ళఁ గీలించి**
**తలఁబ్రాలు పోయు బిత్తరపు కోపు;**

**మంగళసూత్ర సంబంధవేళాన్యోన్య**
**పులకిత స్విన్నాంగముల మెఱుంగు;**
**తే॥ చెట్టపట్టులతో నల సీత నీవు**
**గురువులకు వందనముసేయు కూర్మిభక్తి,**
**రంగుమీఱంగ మిథిలాపురంబు నందుఁ**
**జూచు పుణ్యాత్మ లేనోము నోచినారొ!**
**భద్రయుతకీర్తి! శ్రీరామభద్రమూర్తి!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 90**

**అర్థములు:–** కౌతుకంబులు = పెండియందు చేతికి కట్టుకొనెడు తోరములు; బాసవాల్ – తెరవలు = దేవతాస్త్రీలు; బిత్తరపు కోపు = సరసముతో (శృంగార చేష్టతో) కూడిన అందము; స్విన్న+అంగములు = స్వేదముతో కూడిన శరీరములు; రంగుమీఱు = శోభ అతిశయించు; భద్రయుత కీర్తి! = శుభముతోకూడిన కీర్తికలవాడా!; శ్రీరామ భద్రమూర్తి! = మంగళప్రదమైన ఆకారముగల శ్రీరామా!

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! శ్రీరామచంద్రా! కల్యాణవేదికపై సంతోషముగా సీతయు నీవును కూర్చొనియుండగా, గంధపు పూతలతో దేహములు విలసిల్లుచుండగా–దేవతాస్త్రీలు మీకు తెరపట్టి నిల్చిరి. మీరు ఒకరినొకరు చూచుకొను చూపులు ఎంతయో సొగసుగా నున్నవి. తలబ్రాలు పోసుకొనునపుడు సీతమ్మ బెదురుచూపుల అందాలు, మంగళసూత్ర బంధనవేళ అన్యోన్యము మీ శరీరములు పులకించుటలు – స్వేదముతో కూడిన మీ శరీరముల మెఱుగులు – చేయిచేయి పట్టుకొని, నడిచి వచ్చి, భక్తితో గురువులకు వందనముచేయు రీతిని – కళ్లారాగాంచిన మిథిలాపుర ప్రజలు ఏ నోము నోచిరో కదా! (ఇది రామావతార వర్ణనము–8.)

**సీ॥ తమ్ములు నీవు నందమ్ములతోఁ బెండ్లి**
**కొడుకులై, సతులతోఁ గూడి చనుచుఁ,**
**బరశురాముని భంగపఱచి, యయోధ్య పు**
**రంబు వైభవము మీఱంగఁజేరి,**
**కోరికల్మీఱఁగా కొన్నాళ్ళు వసియింప,**
**దశరథేశుఁడు మీకు ధర్మనియతి**

యువరాజ్యపట్టణోద్యోగంబుఁ గావింపఁ,
గడుఁ జూడఁజాలక కైక మిమ్ము

తే॥ సకల లోకైక నిందకు జడియ కకట!
యడవులకు నేగుమనఁగ నోరాడెనెట్లు?
కైక ననేల? నీదు సంకల్ప మట్లు!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! **91**

**అర్థములు:–** భంగపఱచు = గర్వమును అణచివేయు; ధర్మనియతి = ధర్మనియమము.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహ ప్రభూ! నీవు నీ తమ్ములు పెండ్లి కొడుకులుగా సతులతో అయోధ్యకు బయలుదేరగా, మార్గమధ్యమున పరశురామునికి గర్వభంగము చేసినావు. అయోధ్యయందు మహావైభవముగా కొన్నాళ్ళు గడిపిన పిమ్మట, దశరథుడు నీకు యువరాజ పట్టాభిషేకముచేయ సంకల్పించెను. నీ పినతల్లి కైక, లోకనిందకు జడియక, నిన్ను అడవులకు వెళ్లుమనెను. అట్లు చెప్పుటకు ఆమెకు ఎట్లు నోరాడెను? అయినను అది నీ సంకల్పమే కదా! (ఇది రామావతార వర్ణనము–9.)

సీ॥ అంటినఁ గందెడు నడుగుదమ్ములతోడ
నడవి జానకి యెట్లు నడచెనయ్య?
పుడమి యేలుట మాని జడదారులగు మిమ్ము
తల్లి గన్గొని యెట్లు తాళెనయ్య?
యనుఁగుఁ దమ్ముఁడు సుమిత్రాత్మజుండొక డెట్లు
మిముగొల్చు వ్రతమూని మెలఁగెనయ్య?
నీదు పావలు రాజ్యనేతలుగాఁ గొల్చె
భరతుఁ దక్కట! యెంత భక్తుఁడయ్య!

తే॥ చిత్రకూటాద్రిఁ గడు తప్పుచేసినట్టి
చెడుగు కాకము మఱల రక్షించినావు!
రామ! నీవెంత కరుణాంబురాశివయ్య!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! **92**

**అర్థములు:-** జడదారులు = జడలు ధరించిన ఋషులు; సుమిత్ర + ఆత్మజుఁడు = సుమిత్ర కొడుకు (లక్ష్మణుడు); వ్రతము + ఊని = వ్రతమును అవలంబించి; పావలు = పావుకోళ్ళు; చిత్రకూట + అద్రి = చిత్రకూట పర్వతము; చెడుగు కాకము = క్రూరుడైన కాకాసురుడు; కరుణ + అంబురాశివి = కరుణా సముద్రుడవు.

**భావము:-** ఓ సింహాద్రి నారసింహప్రభూ! తాకినచో కందిపోవు తామరపూలవంటి పాదములుగల జానకి అడవిలో ఎట్లు నడచినదయ్యా? రాజ్యపాలనము పోయి, మునివేషమును పూనిన నిన్ను చూసి కౌసల్య ఎట్లు ఓర్చుకొనినదయ్యా? సోదరుడగు లక్ష్మణుడు మిమ్ములను సేవించు వ్రతమును అవలంబించి ఎట్లు గడిపినాడయ్యా? నీ పాదుకలు సింహాసమున నుంచి రాజ్యపాలనము చేసిన భరతుడు ఎంత భక్తుడయ్యా! చిత్రకూట పర్వతముపై తప్పుచేసిన కాకినికూడ శరణు అన్నచో రక్షించితివి! నీవెంత కరుణాసముద్రుడవయ్యా! (ఇది రామావతార వర్ణనము-10.)

**సీ॥ దండకారణ్య దైత్యావళిఁ బరిమార్చి,**
**సాపరాధు విరాధు రూపుమాపి;**
**మును హేతిఁ జుప్పనాతిని విరూపిని జేసి,**
**ఖరకృత్యు ఖరదైత్యు గండణంచి;**
**మాయావి నీచుని మారీచుఁ బరిమార్చి,**
**దుర్మదాంధుని గబంధుని వధించి;**
**తత వక్రశీలముల్ తాళముల్ ఖండించి,**
**వాలి దోర్బలశాలిఁ గూలనేసి;**

**తే॥ తొడరి సుగ్రీవ హనుమదాదులను గూడి**
**వనధి గర్వమడంచి, రావణుని ద్రుంచి,**
**ఘనవిజయ మొందు వీరరాఘవుఁడ వీవు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 93**

**అర్థములు:-** దైత్య + ఆవళి = రాక్షస సమూహము; పరిమార్చి=చంపి; స + అపరాధున్ = అపరాధముతో కూడిన వాడైన; మును = పూర్వము; హేతిన్ = కత్తితో; చుప్పనాతిని = శూర్పణఖను; ఖరకృత్యున్ = క్రూరమైన పనులు చేయువాడైన; ఖరదైత్యున్ = ఖరుడను రాక్షసుని; గండు + అణంచి = పౌరుషమును (బలమును) అణచి వేసి;

మాయావి = మాయచేయువాడు; తత్ – వక్రశీలముల్ – తాళముల్ = వ్యాపించిన – వంకరగానున్న – తాటి చెట్లను; దోః + బలశాలి = భుజబలము కలిగిన; వనధి = సముద్రము.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! శ్రీరామచంద్రా! దండకారణ్యమున రాక్షసులను సంహరించితివి. విరాధుని చంపితివి. శూర్పణఖను ముక్కుచెవులు కోసి విరూపను చేసితివి. క్రూరమైన పనులు చేయు ఖరుడను రాక్షసుని బలమును అణచివేసితివి. మాయావి యగు మారీచుని ఖండించితివి. కబంధుని వధించితివి. వంకరగల ఏడు తాడిచెట్లను ఖండించి, బలశాలియైన వాలిని ఒక్క బాణముతో కూలగొట్టితివి. సుగ్రీవుడు హనుమంతుడు మొదలగు కపివీరులు వెంటనడువగా, సముద్రముపై వారధి కట్టి, రావణుని సంహరించితివి. నీవు వీరరాఘవుడవయ్యా! (ఇది రామావతార వర్ణనము–11.)

**సీ॥ శాశ్వతంబుగ విభీషణునకు లంక ని**
**శ్చల కృప నొసఁగుటఁ దలఁచుకొన్నఁ–**
**జెఱఁబడ్డ సురసిద్ధ గరుడ గంధర్వ కాం**
**తల విడిపించుటఁ దలఁచుకొన్న–**
**నిఖిల లోకంబులు నిష్కంటకములుగా**
**నలరఁ బ్రోచిన వింతఁ దలఁచుకొన్నఁ–**
**గొలిచినవారికిఁ గొంగు బంగారమై**
**తగు కోర్కె లిచ్చుటఁ దలఁచుకొన్న–**

**తే॥ ముదము; కాని, ధరాసుత ముద్దరాలిఁ**
**బరమపావని వినరాని పలుకులాడి**
**యగ్నిఁ జొరఁ జేయుటకె మాకు నలుక పుట్టె!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!** **94**

**అర్థములు:–** చెఱఁబడ్డ (చెఱన్ + పడ్డ) = బందీలైన; నిష్కంటకములు = శత్రువులు లేనివి; ముదము = సంతోషము; ధరాసుత = భూమిపుత్రిక; ముద్దరాలు = అమాయకురాలు; పరమపావని = మిక్కిలి పవిత్రురాలు; అలుక = కోపము.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! లంకారాజ్యమును శాశ్వతముగ విభీషణునకు ఇచ్చుట తలచుకొనినను–రావణుని చెఱలోనున్న దేవతా సిద్ధ గరుడ గంధర్వ కాంతలను విడిపించుట తలచుకొన్నను–అన్నిలోకములందును దుష్టులపీడ లేకుండ చేయుట తలచుకొన్ననూ–కొలిచినవారికి కొంగుబంగారమై, వారికోర్కెలు తీర్చుట తలచుకొన్ననూ–మాకెంతో సంతోషము కలుగుచున్నది. కానీ–రామా!– అమాయకురాలు – భూదేవి పుత్రిక – పరమ పావని అయిన సీతను నీవు నిందలు పలికి, అగ్నిప్రవేశము చేయించితివనగా – మాకు కోపము కలుగుచున్నది! (ఇది రామావతార వర్ణనము–12.)

**సీ॥ అభినవాయోధ్యాపురాంతఃపురమునందు**
**మిసిమి బంగరురంగు మేడలోన,**
**జిలుఁగు మేల్ రతనాల సింహాసనము మీఁద**
**వామాంకమున సీత ప్రేమఁగులుక,**
**హనుమంతు దగ్రంబునందు భక్తిఁ జెలంగ,**
**ఛత్రంబు వెనుక లక్ష్మణుఁడు పట్ట,**
**భరత శత్రుఘ్నులు పార్శ్వస్థులై వీవ,**
**వాయవ్యతటి జాంబవద్విభీష**

**తే॥ ణేనజాంగద ముఖులు పెంపెసఁగ, మధ్య**
**నీలజలరుహరుచి మీరు నిన్ను రాము,**
**రమ్యగుణధాముఁ, బట్టాభిరాముఁ గొల్తు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 95**

**అర్థములు:–** అభినవ + అయోధ్యాపుర + అంతఃపురమున్ + అందు = చక్కగా అలంకరించిన – అయోధ్యానగరములోని – అంతఃపురములో; మిసిమి = నూతన కాంతితో కూడిన; జిలుఁగు = ఇంపైన, అందమైన; వామ + అంకమున = ఎడమ తొడమీద; ఛత్రము = గొడుగు; పార్శ్వస్థులై = ప్రక్కన నుండువారై; తటి = దిక్కు; జాంబవత్ + విభీషణ + ఇనజ + అంగద – ముఖులు = జాంబవంతుడు – విభీషణుడు – సూర్యుని కుమారుడైన సుగ్రీవుడు – అంగదదు మొదలైన ప్రసిద్ధులు; పెంపు + ఎసఁగన్ = అతిశయించగా; నీల – జలరుహ – రుచి – మీరు = నల్లని –

పద్మముయొక్క – కాంతిని – మీరెడి; రమ్యగుణధామున్ = మంచి గుణములకు స్థానమైనవానిని.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! అలంకరించిన అయోధ్యాపట్టణమున అంతఃపురమునందు, నూతనకాంతితోకూడిన బంగారువేదలో, రత్నాల సింహాసనముపై, ఎడమతొడపై సీతకూర్చుని యుండగా, అగ్రభాగమున హనుమంతుడు భక్తితో నిలువగా – లక్ష్మణుడు గొడుగు పట్టినాడు. భరతశత్రుఘ్నులు నీకు వింజామరములు వీచుచున్నారు. వాయవ్యభాగమున జాంబవంతుడు – విభీషణుడు – సుగ్రీవుడు – అంగదుడు నిలిచి నమస్కరించుచుండగా, వీరందరిమధ్యన నీలిపద్మమువలె భాసించు సద్గుణుడైన – పట్టాభిరాముని సేవింతును. (ఇది రామావతార వర్ణనము–13.)

**సీ॥ మానితమూర్తియై మహిమచేఁ జెన్నొంది,**
**కామఫాలాభిఖ్య గరిమఁ జెంది;**
**పంకజాతంబులఁ బరిమార్చు కళమించి,**
**అరిభయంకరగతి నధిగమించి;**
**శుభకర ధవళాంగ శోభచేఁ దనరారి,**
**రేవతీ రమణాంక రీతి మీఱి;**
**సద్బలభద్ర ప్రశస్తిచేఁ జెన్నొంది,**
**ఘనతర రామాకృతిని జెలంగి;**

**తే॥ చంద్రుఁడన భూజనాహ్లాదసరణి మీరు**
**నిన్నుఁ గొనియాడఁ దరమె వాఙ్నేతకైన?**
**నతుల సంకర్షణ స్వరూపాభిరామ!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 96**

**అర్థములు:–** మానితమూర్తి = గౌరవింపదగిన ఆకారము; కామపాల + అభిఖ్య – గరిమన్ – చెంది = "కామపాలుడు" అను – పేరుతో – గొప్పతనమును – పొంది; పంక – జాతంబులన్ = పాపముల సమూహమును; అరిభయంకరగతిన్ = శత్రువులకు భయము కలిగించు రీతిలో; ధవళాంగ శోభచే = తెల్లని శరీరకాంతిచే;

రేవతీ రమణ + అంకరీతి = "రేవతీదేవి భర్త" అను గుర్తుచేత; సత్ + బలభద్ర – ప్రశస్తి చేన్ = యోగ్యమైన (మంచి) "బలభద్రుడు" అను కీర్తిచేత; అతుల – సంకర్షణ – స్వరూప + అభిరామ! = సాటిలేని– "సంకర్షణుడు" అను – ఆకారముచేత – అందగించినవాడా!

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! బలరామా! నీ రూపము ఉజ్జ్వలమైనది. కామపాలుడను పేరు గడించితివి. నీవు పాపసమూహములను నశింపజేయుకళలో ప్రసిద్ధికెక్కినవాడవు! శత్రువులకు భయంకరుడవు. మంగళప్రదమైన తెల్లని శరీర కాంతిచే ఒప్పువాడవు. రేవతీదేవికి భర్తవైనావు. బలభద్రుడను పేరుతో కీర్తిపొందితివి. బలరాముడను గొప్ప ఆకృతిని పొందినావు. చంద్రునివలె జనులకు ఆహ్లాదమును పంచెడువాడవు. నిన్ను కీర్తించుట ఆ బ్రహ్మకే అసాధ్యము. నీవు సంకర్షణ స్వరూపుడవు. నీకు నా ప్రణామములు. (ఇది బలరామావతార వర్ణనము.)

**సీ॥ నీ మహామహిమ వర్ణింపగాఁ దరమౌనె**
**ఫణిపతికైన వాక్పతికినైన?**
**సకల లోకంబులు జననంబు నొందింప**
**రక్షింప శిక్షింప రాజవీవ!**
**యఖిల జగత్కంటకాకృతి నుగ్రులౌ**
**త్రిపుర రాక్షసుల మర్దించు కొఱకుఁ**
**దద్వధూనికర వ్రతంబులు భంగించి,**
**దుష్టసంశిక్షయు, శిష్టరక్షఁ**
**తే॥ జేయఁగా బుద్ధమూర్తి! ప్రసిద్ధిఁగన్న**
**యతుల కారుణ్యమూర్తి! నిన్నభినుతింతు,**
**నీ పదంబులపై భక్తి నిలుపఁజేయు,**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 97**

**అర్థములు:–** ఫణిపతి = ఆదిశేషుడు; వాక్+పతి=బ్రహ్మ; అఖిల–జగత్ + కంటక+ ఆకృతిన్ + ఉగ్రులౌ = సమస్త – లోకములకును – శత్రువులైన – ఆకారములతో – భయంకరులైన; తత్–వధూనికర–వ్రతంబులు=వారి–స్త్రీసమూహముల – వ్రతములు; భంగించి = భగ్నము కావించి; నిన్ను + అభినుతింతు = నిన్ను ప్రస్తుతించెదను.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! బుద్ధిమూర్తీ! కరుణాసంపన్నుడా! నీ మహిమను ఆదిశేషుడుకానీ, బృహస్పతికానీ వర్ణింపలేరు. లోకములు పుట్టుటకు రక్షింపబడుటకు, లయమగుటకు నీవే కారణము. లోకకంటకులైన త్రిపురాసురులను వధించుటకై, వారి భార్యల వ్రతములు భంగపరచి, దుష్టశిక్షణ శిష్టరక్షణ చేసితివి. మహాకారుణ్యమూర్తివైన నీపాదములపై నా భక్తిని నిలుపునట్లు చేయుము. (ఇది బుద్ధావతార వర్ణనము.)

**సీ॥ "అయ్యారె! నెమ్మోము నొయ్యారమౌ భళీ!**
**నిక్కు వీనులు, ముక్కు చక్కఁదనము!**
**ఔర! కైజామోర యల్లార్చు నుద్ధతి!**
**సేబాసు! ఱొమ్ములో జిగి బెడంగు!**
**అన్నన్న! చిత్రతరాంఘ్రి ధారాగతి!**
**వాహువా! సుందర బాహులీల!**
**ఆహా! సమస్త శుభావర్త విస్ఫూర్తి!**
**బాపురే! విపులమౌ వీఁపు కోపు!"**

**తే॥ అనుచు సకల జనుల్ చోద్యమంది పొగడ,**
**ఘనతరాశ్వంబుపై నెక్కి కలికిమూర్తి**
**వగుచు, పాశ్చాత్యవరులను నడఁచెదీవు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 98**

**అర్థములు:–** నెఱ + మోము = నెమ్మోము = అందమైన ముఖము; "కైజా" = "వాగె"ను వెనుకకు ఈడ్చి కట్టుట; "వాగె" అనగా గుఱ్ఱము నోటి కళ్ళెమునకు తగిలించెడు పగ్గము; మోర = గుఱ్ఱముయొక్క దీర్ఘముఖము; అల్లార్చు = అల్లాడజేయు; ఉద్ధతి = గర్వము; జిగి = కాంతి; బెడంగు = అందము; చిత్రతర + అంఘ్రి – ధారాగతి = మిక్కిలి చిత్రమైన –పాదముల – అశ్వగతి; బాహులీల = ముందరికాళ్ళ క్రీడ; సమస్త – శుభ + ఆవర్త – విస్ఫూర్తి = అన్ని విధముల – శుభప్రదమైన – సుడులతోకూడిన – ప్రకాశము; కోపు = అందము; చోద్యము = ఆశ్చర్యము.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహ ప్రభూ! "ఓ కలికిమూర్తీ! నీ గుఱ్ఱముయొక్క ముఖసౌందర్యము, ఒయ్యారము భళీ! దాని చెవులు, చక్కని ముక్కు మురిపించుచున్నవి.

నీవు కళ్ళెమును బిగింపగా, నీ గుఱ్ఱము మోము అల్లార్చే గర్వము చూడదగినది. దాని వక్షస్థలము కాంతితో అందగించినది. దాని కాళ్ళు, చిత్రవిచిత్రమైన అశ్వగతిని చూపును. దాని ముందరికాళ్ళు అందమైనవి. దానికి శుభప్రదమైన సుడులున్నవి. దానికి అందమైన విశాలమైన వీపుకలదు." – ఈ విధముగా సకల జనులు ఆశ్చర్యపడి నీ గుఱ్ఱమును పొగడుచుండగా, అటువంటి గొప్ప అశ్వమునెక్కి, కల్కి అవతారుడవై, పాశ్చాత్యులను వధించెదవు. నీకు నా నమస్కారములు! (ఇది కల్క్యవతార వర్ణనము.)

**సీ॥ దేవకీసతి వసుదేవ నందనుఁడవై,**
**నంద యశోద లానందమొంద;**
**సమదాత్మ పూతనా శకట తృణావర్త**
**ధేనుక ముష్టికాదికులఁ ద్రుంచి;**
**గొల్లచేడెల వల్వ లుల్లంబులు హరించి,**
**మామ కంసుని ద్రుంచి, మధుర నలరి;**
**రుక్మిణీ ముఖ్య సరోజేక్షణలఁ గూడి**
**ద్వారక వసియించి, ధర్మసరణిఁ**
**తే॥ బాండవులఁ బ్రోచి, కౌరవబలము నడఁచి,**
**భక్తరక్షణ శిక్షచేఁ బ్రబలినట్టి**
**కృష్ణ! గోవింద! మాధవ! కేశవ! హరి!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 99**

**అర్థములు:–** నందనుఁడు = కుమారుడు; సమద + ఆత్మ = గర్వముతో కూడిన; గొల్లచేడెలు = గొల్ల పడతులు; వల్వలు = వస్త్రములు; సరోజ + ఈక్షణలు = పద్మనేత్రలు; బ్రోచి = రక్షించి; శిక్ష = శిక్షించుట.

**భావము:–** ఓ సింహాద్రి నారసింహప్రభూ! శ్రీకృష్ణా! నీవు దేవకీవసుదేవుల బిడ్డవై, నందయశోదలచే పెంచబడితివి. పూతన, శకటాసుర, తృణావర్త, ధేనుక, ముష్టిక – మొదలైన రాక్షసులను సంహరించితివి. గొల్ల కాంతల వస్త్రములను దొంగిలించితివి. మామయగు కంసుని వధించితివి. రుక్మిణి మొదలగు అష్టమహిషులతో ద్వారకయందు నివసించితివి. ధర్మమైన రీతిలో పాండవులను రక్షించి, కౌరవులను అణచివైచితివి. భక్తరక్షణను దుష్టశిక్షణను నిర్వహించితివి. కృష్ణా! గోవిందా! మాధవా! కేశవా! హరి! నీకు ప్రణామములు. (ఇది కృష్ణావతార వర్ణనము.)

**సీ॥ మాణిక్యపీఠికామధ్య పద్మస్థితు,**
**రవికోటి తేజోవిరాజమానుఁ;**
**గందర్ప శతకోటి సుందరాకారుని,**
**శంఖ చక్ర గదాసి శార్ఙ్గ ధరుని;**
**శ్రీ భూమి యువతి సంశోభి పార్శ్వద్వయు,**
**నంచిత పుండరీకాయతాక్షు;**
**శ్రీవత్స కౌస్తుభ శ్రీహారయుత వక్షుఁ,**
**గటి లసన్మణికాంతిఁ, గనక చేలు;**

**తే॥ మకుట కుండల కేయూర మహిత కంక**
**ణాంగుళీయక ముఖ్య భూషాంగు, విశ్వ**
**నిలయు, నారాయణస్వామి! నిన్నుఁ గొలుతు!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ! 100**

**అర్థములు:–** పీఠిక = ఉన్నతమైన సింహాసనము; కందర్ప శతకోటి = నూరుకోట్ల మన్మథులు; శ్రీ – భూమి – యువతి = లక్ష్మీదేవి – భూదేవి అనుయువతులు; పుండరీక + ఆయత + అక్షున్ = తెలిదామరలవలె విశాలమైన కన్నులుగలవానిని; వక్షము = రొమ్ము; కటి = నడుము; లసత్ + మణికాంతి = ప్రకాశించుచున్న మణుల కాంతి; కనక చేలు = బంగారు వస్త్రము ధరించినవాడు; మకుటము = కిరీటము; కేయూరము = భుజకీర్తి; కంకణము = చేతి కడియము; అంగుళీయకము = ఉంగరము.

**భావము:–** శత్రువులను శీఘ్రముగా సంహరించువాడా! ఓ సింహాద్రి నారసింహప్రభూ! మాణిక్య సింహాసనమధ్యమున పద్మమునందు కూర్చున్నవానిని; కోటి సూర్యుల తేజస్సు గలవానిని; శతకోటి మన్మథుల సౌందర్యము గలవానిని; శంఖము – చక్రము – గద – ఖడ్గము – ధనుస్సులను ధరించినవానిని; శ్రీదేవి భూదేవి రెండు ప్రక్కలా నిలిచి కొలుచుచున్నవానిని; పద్మములవంటి కన్నులు గలవానిని; వక్షమున శ్రీవత్సమను పుట్టుమచ్చను, కౌస్తుభమను మణిని గలవానిని; మణుల మొలనూలు గలవానిని; బంగారు వస్త్రము ధరించినవానిని; మకరకుండలములు, భుజకీర్తులు, కంకణములు, ఉంగరము మొదలగు ఆభరణములచే ప్రకాశించువానిని;

విశ్వమంతటయు నిండినవానిని; శ్రీమన్నారాయణమూర్తిని పూజించుచున్నాను. స్వామీ! నీకు ప్రణతులు! (ఇది శ్రీమన్నారాయణమూర్తి వర్ణనము.)

**సీ॥ తిరుమల పెద్దింటి ధీర సంపత్కుమా**
**రార్య సద్వేంకటాచార్య శిష్యు**
**సురుచిరాపస్తంబ సూత్రు మౌద్గల్యస**
**గోత్రు, గోగులపాటి కులజు, గౌర**
**మాంబికాశ్రిత బుచ్చనామాత్య వరపుత్త్రు**
**కూర్మదాసాఖ్యు నన్గూర్చి నీదు**
**చరణదాస్య మొసంగి సంతరించితి భళీ!**
**యే రచించిన యట్టి యీశతకము**

**తే॥ వినినఁ జదివిన వ్రాసిన వివిధ జనుల**
**కాయురారోగ్య మైశ్వర్య మతిశుభంబుఁ**
**గరుణ దయచేసి పాలింపు కమలనాభ!**
**వైరిహరరంహ! సింహాద్రి నారసింహ ॥ 101**

**అర్థములు:–** ధీర = విద్వాంసుడైన; సురుచిర = రమణీయమైన, మనోజ్ఞమైన.

**భావము:–** శత్రువులను వేగముగా (వెంటనే) సంహరించువాడా! ఓ సింహాద్రి నారసింహ ప్రభూ! నేను తిరుమల పెద్దింటి సంపత్కుమార వేంకటాచార్య శిష్యుడను. ఆపస్తంబ సూత్రుడను. మౌద్గల్యస గోత్రుడను. "గోగులపాటి" మా ఇంటిపేరు. గౌరమ్మ – బుచ్చనమంత్రి నా తల్లిదండ్రులు. "కూర్మదాసుడు" అను పేరుగలవాడను. సింహాద్రి నరసింహస్వామీ! నీపాదసేవ చేసికొను భాగ్యమును కలిగించితివి. ఈ శతకమును చదివినవారికి, వ్రాసినవారికి, వినినవారికి, ఆయురారోగ్యములు, ఐశ్వర్యము, శుభములు దయతో ప్రసాదింపుము. స్వామీ! నీకు నా నమస్కారము!

ఇతి శమ్!

ఏతత్ సర్వం శ్రీకృష్ణార్పణమస్తు! – హరిః ఓం!



# అనుబంధము-1

## జగద్గురు శ్రీ శంకాచార్య విరచిత
## శ్రీ లక్ష్మీనృసింహ కరావలంబ స్తోత్రము

తాత్పర్య రచన : శ్రీ కాశీభొట్ల సత్యనారాయణ

**శ్లో. శ్రీమత్పయోనిధి నికేతన చక్రపాణే**
**భోగీంద్రభోగ మణిరంజిత పుణ్యమూర్తే ।**
**యోగీశ శాశ్వత శరణ్య భవాబ్ధిపోత**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 1**

**పదచ్ఛేదం:**

శ్రీమత్ పయోనిధి నికేతన:- చక్రపాణే! భోగీంద్ర భోగమణి రాజిత పుణ్యమూర్తే! - యోగీశ శాశ్వత శరణ్య - భవాబ్ధి పోత! - లక్ష్మీ నృసింహ! - మమ - దేహి - కరావలమ్బమ్.

**అన్వయం:**

లక్ష్మీనృసింహ! - మమకరావలమ్బం - దేహి

**వివరణం:**

ఈ లక్ష్మీనృసింహ కరావలంబస్తోత్రాన్ని శంకరభగవత్పాదులు రచించారు. ఒక క్షుద్రోపాసకుడు ఆచార్యస్వామిపై క్షుద్రదేవతా ప్రయోగాన్ని చేస్తే, శంకరులు నిర్లిప్తులై స్వామిచేతిని ఆసరా అడిగారు. అప్పుడు నృసింహస్వామి, వారి శిష్యునియందు ప్రవేశించి, ఆ క్షుద్రోపాసకుణ్ణి సంహరించారు.

ప్రతిశ్లోకంలోనూ నాలుగవ పాదం ఒకలాగే ఉంటుంది. ఇది మకుటం. శంకరుల భావంలో ఇది సంకల్పం.

హే లక్ష్మీనృసింహ! నీ చేతిని నాకు ఆసరాగా ఇవ్వు.

నూతిలో పడ్డవాడిని పైకి తీయడానికి, పైన ఉన్నవాడు పైనే ఉండి, తన చేతిని వానిచేతికిచ్చి, పైకి లాగాలి. వాడితోపాటు తాను నూతిలో దిగకూడదు. సంసారకూపంలో ఉన్న మనం కూడా స్వామి చేతిని ఆసరా అడిగి బయటపడాలి.

ఈ చేతిని అందించడానికి భగవంతుడు మనకోసం సుఖస్థానంనుండి దుఃఖస్థానానికి వస్తాడు. దీన్నే "అవతరించడం" అంటారు. "అవతారః కూపాదే" అని శాస్త్రం. అవతరించడమంటే నూతిలో పడటమే అంది. మనం పుడతాం. ఆయన మనకోసం అవతరిస్తాడు. అందుకే శంకరులు 'శ్రీమత్ పయోనిధి నికేతనా' అన్నారు. సర్వసుఖస్థానమైన పాలసంద్రం నివాసంగా కలవాడా! సుదర్శనచక్రం చేతియందున్నవాడా! అనగా ఏ సంహారాన్నైనా అక్కడినుండే చేయగలవాడా! – అని భావం. భోగీంద్రుడు ఆదిశేషువు కేవలం భోగికాడు. భోగానుభవంలో అంతటివాడులేడు. అటువంటి శేషునిపడగలపై వేలకొలది మణులున్నాయి. వాటితో ప్రకాశించేవాడు విష్ణువు. భోగీంద్రుడు తన సేవకుడైతే ఆ భోగాలన్నీ ఆయనివికావామరి! ఇంత భోగం తన కెలా కలిగింది? మూర్తీభవించిన పుణ్యంవలన. ఈ పుణ్యం యోగులలో శ్రేష్ఠులైనవారికి శాశ్వతగృహం. కనుక వాళ్ళను భవాబ్ధినుండి – అనగా సంసార సాగరంనుండి దాటించేవాడు. నేను యోగీశుణ్ణి అవునోకాదో నాకు తెలియదు. నువ్వే నిర్ణయించి నీ చేతిని నాకందించు.

**శ్లో. బ్రహ్మేంద్ర రుద్ర మరు దర్క కిరీటకోటి**
**సంఘట్టి తాంఘ్రి కమలామలకాంతికాంత ।**
**లక్ష్మీలసత్కుచ సరోరుహ రాజహంస**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 2**

**వివరణం:**

బ్రహ్మ ఇంద్ర రుద్ర మరుత్తుల సూర్యాదుల కిరీట సమూహాలచే తాకబడిన పాదపద్మాల శుద్ధమైన కాంతితో ప్రకాశించేవాడా! లక్ష్మీదేవియొుక్క మనోహర కుచపద్మాలమధ్య సంచరించే రాజహంసా! లక్ష్మీనృసింహా నాకు నీ చేతిని ఆసరాగా ఇవ్వు.

ఇక్కడ రుద్ర శబ్దం ప్రకృతిలో పూజనీయులైన ఏకాదశ రుద్రుల్ని చెబుతుంది. కుచాల్ని పద్మాలతో పోల్చటం అరుదు. అది సరస్సు కనుక రెండు పద్మాలమధ్య సంచరించే రాజహంస అని గ్రహించాలి. భర్తృభోగ్యమైన దాన్ని 'కుచ'మని,

పుత్రభోగ్యమైన దాన్ని 'స్తన'మని అంటారు. అందుకని శంకరులు కుచమనటం విష్ణుభోగ్యమైనవనే భావంలో అని గ్రహించాలి.

**శ్లో. సంసార దావ దహనాకుల భీకరోగ్ర**
**జ్వాలావళీభి రభిదగ్ధ తనూరుహస్య ।**
**త్వత్పాదయుగ్మ సరసీరుహ మస్తకస్య**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 3**

**వివరణం:**

సంసారమనే కార్చిచ్చు. దాని వలన వ్యాపించి భయంకరమూ రౌద్రరూపమూ అయిన జ్వాలాసమూహం. దానివలన దగ్ధమవుతూన్న రోమాలుగల నాయొక్క శిరస్సును నీపాదపద్మాల చెంత పెట్టడానికి చేయూతనివ్వు

ఇక్కడ కార్చిచ్చు రోమాల్ని తగలేయటం చిన్న విషయంగా కనబడుతుంది. కానీ అది చిన్నది కాదు. వెంట్రుకలు తగులబడితే చర్మం సర్వధాతువులతో తగులబడుతుంది. చితికెక్కిన ఉపాధికి క్రమం ఇదే. అయితే శిరస్సు అంతతొందరగా తగులబడదు. కనుక ఇప్పుడు నీ జ్ఞానం నాకు కలిగింది. కనీసం కపాలమోక్షం కాకుండా యీ శిరస్సును నీ పాద పద్మాలపై ఉంచేందుకు నీ చేతిని శిరస్సుకందించు. ఈ జీవుడు ఆ బ్రహ్మరంధ్రంద్వారా ముక్తుడవుతాడు. చితాగ్ని సంసారాగ్ని ఒకటే. అందుకే శ్మశానవైరాగ్యమన్నారు.

**శ్లో. సంసారజాల పతితస్య జగన్నివాస**
**సర్వేంద్రియార్థ బడిశస్థ ఝషాత్మనశ్చ ।**
**ప్రోత్తమ్భిత ప్రచుర తాలుక మస్తకస్య**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 4**

**వివరణం:**

నా సర్వ ఇంద్రియ ప్రయోజనాలు వలలోపడిన చేపలా ఉన్నాయి. అనగా నా యింద్రియాలు నా స్వాధీనంలో లేవు. నేను వాటి అధీనంలో ఉండి, సంసారమనే వలలో పడిన వాడిని. ఆ వలలోపడి, నాలుక బయట పెట్టి, తల వ్రేలాడవేసిన వాడిని. నువ్వు జగన్నివాసుడవు. నీకు నీరు నేల అనే భేదం లేదు. అంతటా ఉంటావు. కనుక నాకు నీ చేతినందించి, యీవలలోనుండి సుఖస్థానానికి చేర్చు.

**శ్లో. సంసారకూప మతిఘోర మగాధమూలం**
**సంప్రాప్య దుఃఖ శతసర్ప సమాకులస్య ।**
**దీనస్య దేవ కృపయా శరణాగతస్య**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 5**

**వివరణం:**

సంసారం ఒక నుయ్యి. అది మహాఘోరంగా ఉంటుంది. అది అగాధమూలం. అంటే దిగేకొలదీ లోతే తప్ప ఆగడానికి అవకాశం లేనిది. అంతేకాదు. 'శతం' అంటే 'అనేకం' అని భావం. ఇందులో అనేక దుఃఖాలు. అవి పాములవంటివి. అవి చుట్టబెడతాయి. కరుస్తాయి. తనేమీ చేయలేడు. అందుకని దీనుడు. దేవా! నీ శరణు పొందిననాకు దయతో నీ చేతినందించు.

**శ్లో. సంసార భీకర కరీంద్ర కరాభిఘాత**
**నిష్పీడ్యమాన వపుష స్సకలార్థితస్య ।**
**ప్రాణప్రయాణ భవభీతి సమాకులస్య**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 6**

**వివరణం:**

సంసారమనే భయంకరమైన మదపుటేనుగుయొక్క తొండంచే కొట్టబడుతూ, పీడను అనుభవిస్తూన్న శరీరం. అదేకాదు – ఇంకా అనేక బాధలతో ఇబ్బందులు పడుతూన్నవాడిని. ప్రాణప్రయాణ రూపమైన సంసారభయంతో ఉన్నవాడిని. అనగా నిత్యం మరణభయమున్నవాడిని. హే లక్ష్మీనృసింహా! అటువంటి నాకు చేయూతనివ్వు. ఏనుగు, తొండంతో ఒక చిన్న దెబ్బవేస్తే చాలు, మనం ఎంత దూరంలో పడతామో మనకు తెలుసు. సంసారమూ అంతే! ఉన్నచోట ఉండనివ్వదు. ఏదో వంకతో ఇక్కడనుండి అక్కడ పడవేస్తుంది. అక్కడినుండి యిక్కడ పడవేస్తుంది. పడ్డచోటులో మనకేదైన విలువ దొరికితే అదొక దొంగ ఆనందం. అది క్షణికం. లోభాదులవలన అన్నీ సుఖభ్రాంతులే. ఏ చిన్న అస్వస్థత కలిగినా మరణభయమే. ఈ ఉపాధిమీద అంతరాగం. కనుక దీన్ని నీమీదకు మళ్ళించు. నువ్వు నృసింహుడవు. నువ్వు కనబడితే ఏనుగు పారిపోతుంది. లక్ష్మీసహితుడవు. కనుక అసలు సౌభాగ్యమేమిటో తెలుస్తుంది. ఇక మరణభయముండదు.

**శ్లో. సంసారసర్ప విషదుష్ట భయోగ్ర తీవ్ర**
**దంష్ట్రా కరాళ విషదగ్ధ వినష్ట మూర్తే ।**

**నాగారి వాహన! సుధాబ్ధి నివాస శౌరే**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 7**

**వివరణం:**

సంసారమనేది ఒక సర్పం. విషంచేత దుష్టమూ, ఉగ్రత్వం వలన భయమునూ కలిగించేది. పైకి కనబడే దాని తీవ్రమైన కోరల విషం అంటుకొని నశిస్తూన్న రూపం కల నాకు, గరుడవాహన! అమృత సాగరవాస! శౌరీ! లక్ష్మీనృసింహా! నీ చేతిని ఆసరాగా ఇవ్వు.

సర్పాలకు గరుడునివలె, సంసారసర్పవిషానికి గరుడవాహనుడే విరుగుడు. విషానికి అమృతం విరుగుడు. అందువల్ల సుధాబ్ధి నివాసుని ఆలంబనం కోరుతున్నాడు కవి.

**శ్లో. సంసారవృక్ష మఘబీజ మనంత కర్మ**
**శాఖాయుతం కరణపత్ర మనంగపుష్పమ్ ।**
**ఆరుహ్య దుఃఖజలధౌ పతతో దయాళో**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 8**

**వివరణం:**

సంసారం ఒక చెట్టు. దీనికి పాపం విత్తనం. అనేక జీవకర్మలు దాని కొమ్మలు. ఇంద్రియాలు ఆకులు. మన్మథుడు పూవు. ఇప్పుడు జీవుడు ఈ చెట్టెక్కి, ఆ పూల స్పర్శవలన స్త్రీసౌఖ్యంకోసం ఏడుస్తున్నాడు. అట్టి దుఃఖసముద్రములో పడి మునుగుతున్న నాకు, నువ్వు దయాస్వభావం కలవాడివి కనుక చేయూతనివ్వు. చెట్టెక్కాడు. అక్కడంతా దుష్టసాంగత్యమే! వాళ్ళబాధ భరించలేక, దిగటంరాక ఏడుస్తున్నాడు.

**శ్లో. సంసార సాగర విశాల కరాళ కామ**
**నక్రగ్రహగ్రసన నిగ్రహ విగ్రహస్య ।**
**మగ్నస్య రాగ లసదూర్మి నిపీడితస్య**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 9**

**వివరణం:**

సంసారమనే సముద్రం. దానిలో వికృతమూ భయంకరమూ అయిన కామమనే మొసలి. దానినోట చిక్కుబడిన ఉపాధికలవాడిని. కామమంటే కోరికలు. పక్కింటి వాడింట్లో ఏమున్నాయో వాటిలో ఒక వస్తువైనా మనింట్లో ఉండాలి. కొనడానికి

డబ్బుల్లేవు. అప్పులు. వాటిని తీర్చలేక వీటిని అమ్ముకొని ఏడవటం. కొన్న సంతోషం క్షణం. ఏడుపు ఎప్పుడూను. ఇదే కామం. దీనినోట్లో పడితే, మొసలినోట్లో పడినట్లే. దీని తరువాతది రాగం. రాగమంటే అనవసరమైనంత ప్రేమ. మనుమలు – మునిమనుమలవరకూ. వాళ్ళు ఈ జీవుడికి సముద్రపుకెరటాల వంటివాళ్ళు. ఒక కెరటం ఒడ్డుకు గెంటితే, మరొక కెరటం మళ్ళీ వెనక్కి లాగుతుంది. ఈ రాగబంధంలో మునిగి పీడననుభవిస్తున్న నాకు నీ చేతిని ఆసరాగా అందించు!

**శ్లో. సంసారసాగర నిమజ్జన ముహ్యమానం**
**దీనం విలోకయ విభో కరుణానిధే మామ్ ।**
**ప్రహ్లాదఖేద పరిహార పరావతార**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 10**

**వివరణం:**

సంసార సాగరంలో స్నానానికి దిగినాను. కానీ మునిగిపోతున్నాను. నీయందు విభుత్వముంది. దానితోపాటు దయాస్థానానివి. కనుక దీనుణ్ణి అయిన నన్ను చూడు. ప్రహ్లాదఖేదాన్ని పరిహరించిన శ్రేష్ఠమైన అవతారమూర్తివి. నాకు చేతినందించి లాగి బయటపడవేయి. హిరణ్యకశిపునిలో తనకు మరణం లేదనే హ్లాదముండేది. ఆహ్లాదాన్ని ప్రహ్లాదరూపంగా భేదించినవాడివి. నేనూ అంతే! సాగరంలో దిగేటప్పుడు మహాహ్లాదంతో ఉన్నాను. ఇప్పుడదిపోయింది. నాకు చేతి నిచ్చి ప్రహ్లాదాన్ని కలిగించు!

**శ్లో. సంసార ఘోరగహనే చరతో మురారే!**
**మారోగ్ర భీకర మృగ ప్రవరార్ది తస్య ।**
**ఆర్తస్య మత్సర నిదాఘ నిపీడితస్య**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 11**

**వివరణం:**

హే మురారే! హే లక్ష్మీనృసింహా! సంసారమమనే మహాభయంకరమైన అరణ్యంలో తిరుగుతున్నాను. మన్మథుడనే భయంకర మృగంచేత వీపుపై చరువు దెబ్బలు తింటున్నాను. అలాగే ఈర్ష్య అనే వేసవిఎండ దెబ్బలకు తట్టుకోలేక పోతున్నాను. నాకు నీ చేతిని ఆసరాగా ఇవ్వు.

సంసారారణ్యం – అందులో మన్మథుడనే పెద్దపులి – దాని పంజాదెబ్బలు – ఇదీ స్త్రీభోగకామం. ఎదుటివాడి స్త్రీసౌఖ్యాన్ని చూస్తే మాత్సర్యం. దాని వలన లోలోపల గుబులు. అందుకని నృసింహశరణు అవసరం.

**శ్లో. బద్ధాగళైర్యమభటా బహుభర్త్స్యయంతి**
**కర్షంతి యత్ర పథి పాశశతైర్యదా మామ్ ।**
**ఏకాకినం పరవశం చకితం దయాళో**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 12**

**వివరణం:**

ఓ లక్ష్మీనృసింహా! దయాస్వభావా! నన్ను ఏకాకిని చేసి, పరులకు లొంగిన నన్ను ఆశ్చర్యకరంగా, అనేక పాశాలతో కంఠాన్ని బిగించి యమభటులు చావదన్నుతూ లాక్కుపోతున్నారు. నువ్వు నీ చేతిని ఆసరాగా ఇవ్వు!

ఎంత చావదన్నినా జీవునికి చావు రాకపోవటం నరకం. ఉపాధి చావటం సంసారం.

**శ్లో. లక్ష్మీపతే! కమలనాభ! సురేశ! విష్ణో!**
**యజ్ఞేశ! యజ్ఞ! మధుసూదన! విశ్వరూప ।**
**బ్రహ్మణ్య! కేశవ! జనార్దన! వాసుదేవ!**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 13**

**వివరణం:**

పైని చెప్పినట్లు యమభటులు అలా యీడ్చుకుపోతూ ఉంటే, ఇలా ఏడవాలి. అంతేకాని 'కుయ్యో మొర్రో' అని ఏడ్వకూడదు. ఇవన్నీ విష్ణుసహస్రంలోనివే.

(పై శ్లోకానికి శ్రీ దశిక కృష్ణమోహన్‌గారు వ్రాసిన తాత్పర్యం విపులంగా ఇలా ఉంది:

"ఓ లక్ష్మీపతీ! ఓ కమలనాభ! సమస్త దేవతాధీశా! సర్వవ్యాపకుడవైన ఓ విష్ణుమూర్తీ! యజ్ఞేశా! యజ్ఞస్వరూపా! ఓ మధుసూదనా! సర్వలోక స్వరూపా! ఓ బ్రహ్మణ్యా! ఓ కేశవా! ఓ జనార్దనా! వాసుదేవా! ఓ లక్ష్మీనృసింహప్రభూ! నాకు చేయూతనొసగి రక్షింపుమయ్యా!"

1. తపస్సు, వేదములు, బ్రాహ్మణులు, జ్ఞానము – ఇవి బ్రహ్మశబ్దముచే చెప్పబడును. వానికి హితకరుడు కావున పరమాత్మ "బ్రహ్మణ్యుడు".

2. "కశ్చ అశ్చ ఈశశ్చ త్రిమూర్తయః కేశాః, తే యద్వశేన వర్తన్తే స కేశవః" – అని శంకర భాష్యం. అంటే క = బ్రహ్మ; అ=విష్ణువు; ఈశ=శివుడు – ఈ త్రిమూర్తులు ఎవనికి వశవర్తులై ఉంటారో అట్టి విరాట్పురుషుని "కేశవుడు" అంటారు.

3. "జనాన్ దుర్జనాన్ అర్దయతి హి నస్తి, నరకాదీన్ గమయతి వా జనార్దనః" అని భాష్యం. అంటే దుర్జనులను హింసించువాడు, లేక వారికి నరకాదిగతి

కలిగించువాడు "జనార్దనుడు" – సంపాదకుడు.)

**శ్లో. ఏకేన చక్ర మపరేణ కరేణ శంఖ**
**మన్యేన సింధుతనయా మవలంబ్య తిష్ఠన్ ।**
**వామేతరేణ వరదాభయ హస్తముద్రాం**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 14**

**వివరణం:**

ఒక చేత్తో చక్రం. మరొక చేత్తో శంఖం. ఒకచేత్తో లక్ష్మీదేవిని కౌగిలించుకొనటం. కుడిచేత్తో వరదానరూప అభయముద్ర. ఇలా ఉన్న లక్ష్మీనృసింహా! నీ చేతిని ఆసరాగా ఇవ్వు. ఇందుకు ముందులా నామజపం మాత్రమే కాదు. అంతర్ముఖంగా ఇలా రూపదర్శనాన్ని కూడా చేయాలి. ఇక్కడ యమభటులంటే ఇంట్లో వాళ్ళు కూడా! అప్పుడు కూడా వాళ్ళనేమీ అనకూడదు. ఆయన్ని స్మరించాలి.

**శ్లో. అంధస్య మే హృతవివేక మహాధనస్య**
**చోరైర్మహాబలిభిరింద్రియ నామధేయైః ।**
**మోహాంధకార కుహరే వినిపాతితస్య**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 15**

**వివరణం:**

ఇంద్రియాలనే పేరుగల మహాబలవంతులైన దొంగలు నాయొక్క వివేకమనే మహాధనాన్ని దొంగిలించారు. నేను గుడ్డివాడినై మోహమనే కటికచీకటిగుహలో పడ్డాను. కనుక అటువంటి నాకొరకు నీ చేతిని నాకు ఆసరాగా ఇవ్వు. ఇచ్చిన చేతిని వెనక్కి తీసికొనకుండా ఇవ్వు. (అందుకని ఒకటి చతుర్థి, ఒకటి షష్ఠి)

**శ్లో. ప్రహ్లాద నారద పరాశర పుండరీక**
**వ్యాసాంబరీష శుక శౌనక హృన్నివాస ।**
**భక్తానురక్త పరిపాలన పారిజాత**
**లక్ష్మీనృసింహ! మమ దేహి కరావలంబమ్ ॥ 16**

**వివరణం:**

ప్రహ్లాదుడు – నారదుడు – పరాశర పుండరీకులు – వ్యాసమహర్షి – అంబరీషుడు – శుకమహర్షి – శౌనకమహర్షి – మొదలైనవారి హృదయాలలో

నివాసముండేవాడా! భక్తులను అనురాగంతో సంరక్షిస్తూ, వారి యెడల పారిజాత కల్పవృక్షమైనవాడా! నాకు నీ చేతిని ఆసరాగా ఇవ్వు.

**శ్లో.　శ్రీ శంకారర్య రచితం సతతం మనుష్యః**
**స్తోత్రం పఠేదిహతు సర్వగుణ ప్రసన్నమ్ ।**
**సద్యో విముక్త కలుషో మునివర్య గణ్యో**
**లక్ష్మీపతేదేః పద ముపైతి స నిర్మలాత్మా ॥　17**

**వివరణం:**

మాయవలన మోహంలోపడి సంపాదించిన శరీరం ఒకటిగా కాదు, అనేక జన్మ ఉపాధులు. ఇదొక ప్రవాహం. ఈ ప్రవాహంలోని సుడిగుండాలలో పడ్డ యీ మనుష్యదేహాలకు నీ చేతిని ఆసరాగా ఇవ్వు అని – లక్ష్మీ నృసింహ పాదపద్మములందలి మధువును అనుభవించే శంకరాచార్యకృత శుభకరమైన స్తోత్రమిది. శంకర భగవత్పాదులు ఈ స్తోత్రాన్ని ఎవరికోసం చేశారో ఇప్పుడు గ్రహించాలి.

ఇవి 17 శ్లోకాలు. 1 + 7 = 8 “ఓం నమో నారాయణాయ” – ఇది అష్టాక్షరి. ఈ సంఖ్య దాన్ని చెపుతుంది.



# అనుబంధము-2

## శ్రీ లక్ష్మీనృసింహస్వామివారి నామస్తోత్రములు-నామావళి

### 2.1. అష్టోత్తరశతనామస్తోత్రము

నారసింహో మహాసింహో దివ్యసింహో మహాబలః
ఉగ్రసింహో మహాదేవ స్తమ్భజ శ్చోగ్రలోచనః 1

రౌద్ర స్సర్వాద్భుత శ్శ్రీమా న్యోగానన్ద స్త్రివిక్రమః,
హరిః కోలాహల శ్చక్రీ విజయో జయవర్ధనః. 2

పఞ్చాననః పరం బ్రహ్మ చాఘోరో ఘోరవిక్రమః,
జ్వలన్ముఖో జ్వాలామాలీ మహాజ్వాలో మహాప్రభుః. 3

నిటలాక్ష స్సహస్రాక్షో దుర్నిరీక్షః ప్రతాపనః,
మహాదంష్ట్రాయుధః ప్రాజ్ఞ శ్చణ్డకోపీ సదాశివః. 4

హిరణ్యకశిపుధ్వంసీ దైత్యదానవభఞ్జనః
గుణభద్రో మహాభద్రో బలభద్ర స్సుభద్రకః. 5

కరాళో వికరాళశ్చ వికర్తా సర్వకర్తృకః,
శింశుమార స్త్రిలోకాత్మా ఈశ స్సర్వేశ్వరో విభుః 6

భైరవాడమ్బరో దివ్య శ్చాచ్యుత కవిమాధవః,
అధోక్షజో-క్షర శ్శర్వో వనమాలీ వరప్రదః. 7

విశ్వమ్బరో-ద్భుతో భవ్యః శ్రీ విష్ణు పురుషోత్తమః,
అనఘాస్త్రో నఖాస్త్రశ్చ సూర్యజ్యోతి స్సురేశ్వరః. 8

సహస్రబాహు స్సర్వజ్ఞ స్సర్వసిద్ధిప్రదాయకః,
వజ్రదంష్ట్రో వజ్రనఖో మహానన్దః పరన్తపః. **9**

సర్వమన్త్రైకరూపశ్చ సర్వయన్త్ర విదారణః,
సర్వతన్త్రాత్మకో-వ్యక్త స్సువ్యక్తోభక్త వత్సలః. **10**

వైశాఖశుక్లభూతోత్థ శ్శరణాగతవత్సలః,
ఉదారకీర్తిః పుణ్యాత్మా మహాత్మా చణ్డవిక్రమః. **11**

వేదత్రయప్రపూజ్యశ్చ భగవాన్పరమేశ్వరః,
శ్రీవత్సాఙ్క శ్శ్రీనివాసో జగద్వ్యాపీ జగన్మయః. **12**

జగత్పాలో జగన్నాథో మహాకాయో ద్విరూపభృత్,
పరమాత్మా పరంజ్యోతి ర్నిర్గుణశ్చ నృకేసరీ. **13**

పరతత్త్వం పరంధామ సచ్చిదానన్దవిగ్రహః,
లక్ష్మీనృసింహ స్సర్వాత్మా ధీరః ప్రహ్లాదపాలకః. **14**

ఇదం శ్రీనృసింహస్య నామ్నా మష్టోత్తరం శతం,
త్రిసన్ధ్యం యః పఠేద్భక్త్యా సర్వాభీష్ట మవాప్నుయాత్. **15**

(ఇతి శ్రీనృసింహపూజాకల్పే శ్రీలక్ష్మీనృసింహాష్టోత్తరశతనామస్తోత్రమ్.)



## 2.2. అష్టోత్తరశతనామావళి

ఓం నారసింహాయ నమః
ఓం మహాసింహాయ నమః
ఓం దివ్యసింహాయ నమః
ఓం మహాబలాయ నమః
ఓం ఉగ్రసింహాయ నమః
ఓం మహాదేవాయ నమః
ఓం స్తంభజాయ నమః
ఓం ఉగ్రలోచనాయ నమః
ఓం రౌద్రాయ నమః
ఓం సర్వాద్భుతాయ నమః **10**
ఓం శ్రీమతే నమః
ఓం యోగానందాయ నమః
ఓం త్రివిక్రమాయ నమః
ఓం హరయే నమః
ఓం కోలాహలాయ నమః
ఓం చక్రిణే నమః
ఓం విజయాయ నమః
ఓం జయవర్ధనాయ నమః
ఓం పంచాననాయ నమః
ఓం పరబ్రహ్మణే నమః **20**
ఓం అఘోరాయ నమః
ఓం ఘోరవిక్రయాయ నమః
ఓం జ్వలన్ముఖాయ నమః
ఓం జ్వాలామాలినే నమః
ఓం మహాజ్వాలాయ నమః
ఓం మహాప్రభవే నమః
ఓం నిటలాక్షాయ నమః
ఓం సహస్రాక్షాయ నమః
ఓం దుర్నిరీక్షాయ నమః
ఓం ప్రతాపనాయ నమః **30**
ఓం మహాదంష్ట్రాయుధాయ నమః
ఓం ప్రాజ్ఞాయ నమః
ఓం చండకోపినే నమః
ఓం సదాశివాయ నమః
ఓం హిరణ్యకశిపుధ్వంసినే నమః
ఓం దైత్యదానవభంజనాయ నమః
ఓం గుణభద్రాయ నమః
ఓం మహాభద్రాయ నమః
ఓం బలభద్రాయ నమః
ఓం సుభద్రాయ నమః **40**
ఓం కరాళాయ నమః
ఓం వికరాళాయ నమః
ఓం వికర్త్రే నమః
ఓం సర్వకర్తృకాయ నమః
ఓం శింశుమారాయ నమః
ఓం త్రిలోకాత్మనే నమః
ఓం ఈశాయ నమః
ఓం సర్వేశ్వరాయ నమః
ఓం విభవే నమః
ఓం భైరవాడంబరాయ నమః **50**
ఓం దివ్యాయ నమః
ఓం అచ్యుతాయ నమః
ఓం కవిమాధవాయ నమః
ఓం అధోక్షజాయ నమః

ఓం అక్షరాయ నమః
ఓం శర్వాయ నమః
ఓం వనమాలినే నమః
ఓం వరప్రదాయ నమః
ఓం విశ్వంభరాయ నమః
ఓం అద్భుతాయ నమః **60**
ఓం భవ్యాయ నమః
ఓం శ్రీ విష్ణవే నమః
ఓం పురుషోత్తమాయ నమః
ఓం అనఘాస్త్రాయ నమః
ఓం నఖాస్త్రాయ నమః
ఓం సూర్యజ్యోతిషే నమః
ఓం సురేశ్వరాయ నమః
ఓం సహస్రబాహవే నమః
ఓం సర్వజ్ఞాయ నమః
ఓం సర్వసిద్ధి ప్రదాయకాయ నమః **70**
ఓం వజ్రదంష్ట్రాయ నమః
ఓం వజ్రనఖాయ నమః
ఓం మహానందాయ నమః
ఓం పరంతపాయ నమః
ఓం సర్వమంత్రైకరూపాయ నమః
ఓం సర్వయంత్రవిదారణాయ నమః
ఓం సర్వతంత్రాత్మకాయ నమః
ఓం అవ్యక్తాయ నమః
ఓం సువ్యక్తాయ నమః
ఓం భక్తవత్సలాయ నమః **80**
ఓం వైశాఖ శుక్ల భూతోత్థాయ నమః
ఓం శరణాగత వత్సలాయ నమః
ఓం ఉదార కీర్తయే నమః
ఓం పుణ్యాత్మనే నమః
ఓం మహాత్మనే నమః
ఓం చండ విక్రమాయ నమః
ఓం వేదత్రయ ప్రపూజ్యాయ నమః
ఓం భగవతే నమః
ఓం పరమేశ్వరాయ నమః
ఓం శ్రీవత్సాంకాయ నమః **90**
ఓం శ్రీనివాసాయ నమః
ఓం గజద్వ్యాపినే నమః
ఓం జగన్మయాయ నమః
ఓం జగత్పలాయ నమః
ఓం జగన్నాథాయ నమః
ఓం మహాకాయాయ నమః
ఓం ద్విరూపభృతే నమః
ఓం పరమాత్మనే నమః
ఓం పరంజ్యోతిషే నమః
ఓం నిర్గుణాయ నమః **100**
ఓం నృకేసరిణే నమః
ఓం పరతత్త్వాయ నమః
ఓం పరంధామ్నే నమః
ఓం సచ్చిదానంద విగ్రహాయ నమః
ఓం లక్ష్మీనృసింహాయ నమః
ఓం సర్వాత్మనే నమః
ఓం ధీరాయ నమః
ఓం ప్రహ్లాదపాలకాయ నమః **108**



## 2.3. శ్రీలక్ష్మీనృసింహ సహస్రనామ స్తోత్రము

ఓమ్ నమోనారసింహాయ వజ్రదంష్ట్రాయ వజ్రిణే,
వజ్రదేహాయ వజ్రాయ నమో వజ్రనఖాయ చ. 1

వాసుదేవాయ వన్ద్యాయ వరదాయ వరాత్మనే,
వరదాభయహస్తాయ వరాయ వరరూపిణే. 2

వరేణ్యాయ వరిష్ఠాయ శ్రీవరాయ నమోనమః,
ప్రహ్లాదవరదాయైవ ప్రత్యక్షవరదాయ చ. 3

పరాత్పరాయ పారాయ పవిత్రాయ పినాకినే,
పావనాయ ప్రసన్నాయ పాశినే పాపహారిణే. 4

పురుష్టుటాయ పుణ్యాయ పురుహూతాయతే నమః,
తత్పూరుషాయ తథ్యాయ పురాణపురుషాయ చ. 5

పురోధసే పూర్వజాయ పుష్కరాక్షాయ తే నమః,
పుష్పహాసాయ హాసాయ మహాహాసాయ శార్ఙ్గిణే. 6

సింహరాజాయ సింహాయ జగద్వన్ద్యాయ తే నమః,
అట్టహాసాయ రోషాయ జ్వాలాహాసాయ తే నమః. 7

భూతావాసాయ భాసాయ శ్రీనివాసాయ ఖడ్గినే,
ఖడ్గజిహ్వాయ సింహాయ ఖడ్గవాసాయ తే నమః. 8

నమో మూలాధివాసాయ ధర్మవాసాయ (ధర్మిణే) ధన్వినే,
ధనఞ్జయాయ ధన్యాయ నమో మృత్యుఞ్జయాయ చ. 9

శుభఞ్జయాయ సూత్రాయ నమశ్శత్రుఞ్జయాయ చ,
నిరఞ్జనాయ వీరాయ నిర్గుణాయ గుణాత్మనే. 10

నిష్ప్రపఞ్చాయ నిర్వాణప్రదాయ నిబిడాయ చ,
నిరాలమ్బాయ నీలాయ నిష్కళాయ కలాత్మనే. 11

